శ్రీనివాసరావు, పసుమర్తి

మహాపురుషుల జీవితచరిత్రములు

చెన్నపట్టణము, 1913

Record no. 649

Śrīnivāsarāvu, Pasumarti

Mahāpuruṣula jīvitacaritramulu

Cennapaṭṭaṇamu, 1913

Record no. 649

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

---

## Bibliographic Record Target

శ్రీనివాసరావు, పసుమర్తి.

మహాపురుషుల జీవితచరిత్రములు / పసుమర్తి శ్రీనివాసరావు గారిచే రచియింపబడినది.- 1. కూర్పు.- చెన్నపట్టణము : విజ్ఞానచంద్రికామండలి, 1913.

v. <1 >, (2) leaves of plates ; 19 cm.

Record no. 649

Śrīnivāsarāvu, Pasumarti.

Mahāpuruṣula jīvitacaritramulu / Pasumarti Śrīnivāsarāvu gāricē raciyimpabaḍinadi.- 1. kūrpu.- Cennapaṭṭaṇamu : Vijñānacandrikāmaṇḍali, 1913.

v. <1 >, (2) leaves of plates ; 19 cm.

Record no. 649

---

35mm microfilm

Image placement: IA (IIA) IB IIB

Date filming began: 24 January 2006

# ప్రకటిత గ్రంథములు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ఆబ్రహాములింకను. | 0 | 12 | 0 |
| 2. | హిందూమహాయుగము. | 1 | 0 | 0 |
| 3. | జీవశాస్త్రము. (Biology) | 1 | 8 | 0 |
| 4. | రాణీసంయుక్త (నవల). | 0 | 12 | 0 |
| 5. | మహమ్మదీయమహాయుగము. | 1 | 12 | 0 |
| 6. | పదార్థవిజ్ఞానశాస్త్రము. (Physics) | 1 | 5 | 0 |
| 7. | రసాయనశాస్త్రము. (Chemistry) | 1 | 4 | 0 |
| 8. | ఆంధ్రులచరిత్రము. (1-భా.) | 1 | 4 | 0 |
| 9. | విమలాదేవి. (నవల) | 1 | 2 | 0 |
| 10. | కలరా. (Cholera) | 0 | 6 | 0 |
| 11. | జంతుశాస్త్రము. (Zoology) | 0 | 9 | 0 |
| 12. | వృక్షశాస్త్రము. (Botany) | 0 | 7 | 0 |
| 13. | శారీరశాస్త్రము : ఆరోగ్యబోధిని. | 0 | 11 | 0 |
| 14. | భౌతికశాస్త్రప్రథమపాఠములు. | 0 | 10 | 0 |
| 15. | రా. బ. వీరేశలింగముగారి స్వీయచరిత్రము. | 1 | 8 | 0 |
| 16. | భౌతికశాస్త్రము. (Physiography) | 1 | 8 | 0 |
| 17. | ఢిల్లీదర్బారు. | 1 | 8 | 0 |
| 18. | ఆంధ్రులచరిత్రము (2-వభా.) | 1 | 8 | 0 |
| 19. | చంద్రగుప్తచక్రవర్తి. | 0 | 12 | 0 |
| 20. | చలిజ్వరము. (Malaria) | 0 | 7 | 0 |
| 21. | అర్థశాస్త్రము. (Political Economy) | 1 | 8 | 0 |
| 22. | మహాపురుషుల జీవితచరిత్రములు. | 1 | 4 | 0 |

# BIOGRAPHIES OF EMINENT MEN

BY

P. SREENIVASA RAO, B. A.

First Edition

Madras:
THE VIJNANA CHANDRIKA MANDALI
1913

PRINTED AT THE SADANANDA NILAYAM PRESS, MADRAS

విజ్ఞానచంద్రికా గ్రంథమాల

# మహాపురుషుల జీవితచరిత్రములు

(ప్రథమ సంపుటము)

ఇది

పసుమర్తి - శ్రీనివాసరావు, బి. ఏ. గారిచే

రచింపఁబడినది

మొదటి కూర్పు

చెన్నపట్టణము

విజ్ఞానచంద్రికామండలివారిచేఁ

ప్రకటితము

వెల, ౧-౮-౦]

**గ్రంథమాలికాభిజ్ఞానము:—**

నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప ।
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా ॥
యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంఽశ సంభవమ్ ॥

భగవద్గీత. X 40-41.

శ్రీ వేంకటేశ్వరపరబ్రహ్మణేనమః



శ్లో॥ నాస్తి మాతృ సమం దైవం నాస్తి పిత్రా సమో గురుః ।
తయోః ప్రత్యుపకారోఽపి న కథం చ న విద్యతే ॥

కీర్తిశేషులైన

నా తండ్రి

**పసుమర్తి - మురారిరాజుపంతులుగారికిని**

సజీవులైన

నా తల్లి

**శ్రీ సూరమాంబకును**

వినయవిధేయపూర్వకముగ

నీ గ్రంథమాలికను

సమర్పణంజేయుచున్నాను.



# పీఠిక

శ్లో॥ క్వసూర్యః ప్రభవో వంశః క్వచాల్పవిషయామతిః ।
తితీర్షుర్దుస్తరం మోహాదుడుపేనాస్మిసాగరమ్ ॥
మందః కవియశః ప్రార్థీగమిష్యామ్యుపహాస్యతాం ।
ప్రాంశు లభ్యే ఫలే లోభా దుద్బాహురివవామనః ॥

కాళిదాసః, రఘు. I. 3-4.

లోకము కర్మసూత్రగ్రథితము. కర్మము ద్వివిధము: స్తోకమని, అస్తోకమని. మనుజుఁడు కర్మిష్ఠి. కర్మలేని భోగం బపోహంబు. అసందర్భంబు లసంభవములు. వర్తమాన దుఃఖంబులు భూతకాల స్వకర్మోపార్జితంబులు, స్వస్తోక కర్మోద్భవంబులు- ఇవి యసాధువులు, రిక్తములు, దేశాభివృద్ధి నిరోధకములు. ఆ హేతువం జేసి త్యాజ్యంబులు. స్తోకకర్మిష్ఠులు కనిష్ఠులు.

వర్తమానమెటుల భూతకాలభవమో, అటులనె, భవిష్యత్కాలము వర్తమానోద్భవము. భవిష్యత్కాలభోగంబులకు వర్తమానకర్మ లుపాదానంబులు. ఆ కారణముం జేసి, అస్తోకకర్మ లనుష్ఠేయంబులు. అస్తోకకర్మిష్ఠులు గరిష్ఠులు. స్వాస్తోకకర్మ లతిరేకములు. అతిపథమునకు గరిష్ఠు లధ్వగులు.

వారి నిదర్శనము లనన్యాదృశంబులు; వారి యనుభవములు మనుజుల కనుబోధము; వారి రాకలు మేలురాకలు; వారి సంభాషణలు మోహాంధకారవిదళనచంద్రికలు. వారి సఖ్యము శ్రేయోదాయకము; వారి యుపదేశము శ్రోతవ్యము. వారి సంపర్కము షడ్గుణైశ్వర్య సంధానకరణి. వారు నిర్మలులు, నిష్కళంకులు, నిరాశ్రయులు, నిత్యతృప్తులు, నిరాభాసులు. వారు లక్ష్యైకాగ్రచిత్తులు, సిద్ధసంకల్పులు, మృతజీవులు. వారి యాచరణవిధానముల నుపలక్షించి, తద్విధమున దేశకాలానుగుణ్యముగ గమనించుట మనుజులకు కర్తవ్యంబు.

ఆంధ్రభాషయందు పాశ్చాత్యమహాపురుషజీవితచరిత్రంబులు లోపంబులు. తల్లోపపూరితార్థం బీ మదీయప్రథమోద్యమంబు. ఈ గ్రంథము స్వకల్పనశక్తిశూన్యంబు; సరసవచనవిరహితంబు. ఈ చరిత్రములు "బుధులకు నవనిధుల దాపురంబును విపులజయలక్ష్మికిఁ గాఁపురంబును" గనుక, మదీయ లోపంబులు సహ్యంబులగుగాక.

ఇంతియకాదు. ఆంధ్రదేశమువనుండు "సకలకళావిభూషితులు శబ్దవిదుల్నయతత్త్వబోధకుల్ప్రకటకవీంద్రు" లంచలు తమ తమ శక్త్యానుసార మాంధ్ర మాతను "ప్రీతిపూర్వకంబుగాఁ జతుర్విధ శుశ్రూషలు గావించుచు సేవించుచుఁ బూజించుచు భావించుచు నమస్కరించుచు నారాధించు"చున్న సమయంబున, షోడశోపచారపూజావిధానంబు



గుర్తెఱుంగని నే నామె నారాధించుటకు సమకట్టి, 'పత్రం పుష్పం ఫలం తోయం యోమె భక్త్యా ప్రయచ్ఛతి' అనునటుల నామె ప్రసన్నవదనయై సంభావించు నని నా భావము. క్లిష్టపండితజనంబుల కామె సంస్తవనం బసంగతంబు. కాళిదాస విరచితంబగు నీస్తవము నిందుఁ బొందుపఱచుచున్నాఁడను:—

కళ్యాణి—ఖండజాతి—లఘువు.

పల్లవి: — నమో భక్త సురతరు లతే దేవి లలితే,

(1) త్రిపురసుందరి కృపాపాంగ లలితే ॥
చంద్రచూడః ప్రియే చంద్రతిలకాలికే చంద్రముఖి చంద్రికామందహాసే । కుంద సుందర రదన బంధు జీవాధరే కోటి విద్యుల్లతా బృందభాసే ॥

నమో భక్త.........॥

(2) దరదలిత కమలముకులోచ్చలిత మదకలిత విలసదలి లలితలోచన విలాసే । అధర రాగారుణోదయ విధృత దైత్య గురు రుచిరుచిర మౌక్తి కోల్లసిత నాసే ॥

నమో భక్త.........॥

(3) హంసగమనే సకల నిగమ వనశారికే హంసముని హంసమానస మరాళే । కంసరిపు సోదరీ కామితార్థ ప్రదే త్వాం శరణ్యాం కాళిదాస వరదే ॥

నమో భక్త.........॥

నా లిఖిత గ్రంథమునుజూచి శాంతముతో సంస్కరించినందుకు, నా గురువులు శ్రీ వేదమూర్తులయిన బ్రహ్మశ్రీ భళ్లె

మూఁడి దక్షిణామూర్తిశాస్త్రిగారికిని, సారిపాక నర్సింహశాస్త్రి గారికిని వందనములు చేయుచున్నాను. చిత్తులు సవరణలతోఁ గూడిన లిఖిత పత్రములనుజూచి వానిలోఁ గొన్ని పత్రములను స్ఫుటముగ వ్రాయుటలోఁ దోడ్పడిన నా ప్రియ స్నేహితులు మ. రా. రా. చిలుకూరి నారాయణరావుపంతులు బి. ఏ. గారి నభినుతించుచున్నాను. నా ముఖ్య స్నేహితులు మ. రా. రా. ఉలుగుండం వెంకటనర్సుపంతులుగారు గానరూపమైన స్తవమునకు రాగము, తాళము సరిపెట్టినందుకు వారిని సన్నుతించుచున్నాను. నా ప్రాణ స్నేహితులు మ. రా. రా. గా. హరిసర్వోత్తమరావుపంతులు ఎం. ఎ. గారు దీనికి మెఱుఁగుబెట్టి వన్నె తెచ్చినందుకు వారిని సంస్తుతిజేయుచున్నాను. "విజ్ఞానచంద్రికామండలి"వారు దీనిని స్వీకరించుటచే దీనికి గురుత్వము వచ్చినదని నా భావము. వారీగ్రంథము నతిత్వరితముగ ముద్రింపించి ప్రచురింపించినందుకు వారికిఁ గృతజ్ఞతాపూర్వకముగ నభివందనము లిడుచున్నాను.

గంజాం జిల్లా,
శ్రీకాకుళం
22-5-1913

ఇట్లు
విధేయుఁడు
గ్రంథకర్త.

# విషయసూచిక

## మొదటి భాగము

### ప్లూటార్కు వర్ణితచరిత్రలు

---

## రెండవ భాగము

### బెంజమిను ఫ్రాంక్లిను జీవనచరిత్రము



---

# ఉపోద్ఘాతము



## మహాపురుషులు – వారి జీవితచరిత్రములు

సృష్టియనాది. అందులోని జంతువు లనంతములు. అండజ, పిండజ, ఉద్భిజ, శ్వేదజములని వానిలోఁ దరగతులు గలవు; వీనిని జేతనము లని యెదరు. తరుశైలపాషాణము లచేతనములు. ఈ చేతనాచేతనములలో మనుజుఁడు రాజు. నిద్రాహారసంగమము లన్ని జంతువులకు సమానమైనను, వీని నన్నిటికంటె యెక్కుడగు బుద్ధికలవారు మనుజులు.

మొదట మనుజులు దిగంబరులై, నిలుచుటకు నీడ, తినుటకుఁ గూడును లేక, పశుప్రాయులవలె సంచరించుచుండిరి. ప్రకృతిలో 'పరిణామము' (Evolution) ననుసరించి, పిపీలికాది జంతువు లారోహణముగ, క్రమముగ వానరరూపమెత్తి, యా వానరముఖమే, సీత, దమయంతి, తారా మొదలగు స్త్రీలయొక్క పూర్ణచంద్రముఖముగ మారుటకును, ఆ వానరుని బుద్ధియే, కాళిదాసు, భోజుఁడు, చాణక్యుఁడు, శంకరుఁడు మొదలగు మహాపురుషుల కుశాగ్రబుద్ధిగ మార్పునొందుటకును నెంతకాలము పట్టియుండునో మనము చెప్పలేము. అటులనె, మనమిప్పుడు నాగరికులమని విఱ్ఱవీగుచు ప్రగల్భములు బలుకు నీస్థితికివచ్చుట కెంతకాలము బట్టియుండును?

జుట్టులను బెంచి, తీరుగ వానిని దిద్దుటయా, ద్రాక్షరసము నాస్వాదించుటయా, వీనిలో నేది నాగరీకము? ఆ పదమున కర్థమేమి? పండితపామరులు దానిని వాడుకచేయుదురె? అది నిర్గుణమా, సగుణమా? "ఏమిచెప్పుదును

గురునాథా?" అట్టిట్టిదనరానిదై, మహాశ్చోద్యమై, వింతయైనది, నాణెమైనది నాగరికము. అన్నిటియొక్క సముదాయమె యది. సముదాయము విడిన, నది లేదు; సముదాయము నిలబడిన, నది యున్నది.

పుట్టినదిమొదలు గిట్టునఱకు, దేశ జాతిభేదములు లేక, ప్రతి మనుజునకు ముఖ్యముగ కావలసిన వస్తువులేవి? నిలుచుటకు నీడ, తినుటకు తిండి, కట్టుటకు బట్ట ఇవి సమకూడిన మనుజుఁడు కొంత తృప్తిగ నుండును. మొదట చెట్లనీడలలోఁ బ్రదుకుచున్నవారికి, గుడిసెలు, గృహములు, భవనములు, ప్రాసాదములుఁ గాలక్రమమున గట్టినపురుషు లెట్టివారై యుందురు? ఆకు, అలము, దుంపలు, పచనముచేయని మాంసమును దిని బ్రదుకుచున్న వారికి, నేలదున్నుకొని, పంటలను పండించి, వానిని పచనముచేయువిధము నేర్పిన పురుషులొకరో, యిరువురో, మువ్వురో, యెందరో మనకు దెలియదు. వీర లెవరు! దిగంబరులై, కొంతకాలమాకులను, తదుపరి నారలను, మరితోళ్లను గట్టుకొనుచున్న వారికి, ట్వీడు, మస్లీను, బనారసు బట్టలను నేయుట నేర్పినవారెట్టివారో, నేర్పినవారో? నిప్పును గనిపెట్టినవాఁడు, దానిని రగిలించు సాధనములను గనుగొనినవాఁడు. ఈ పురుషులందరు మహాపురుషులుగారా?

ఎందరి మహాపురుషుల యనుభవములను, వారి నామములు దెలియకయే, మన మనుభవించుచున్నాము. వానిని మన యనుభవములని యెంచుటకంటె బుద్ధిహీనత కలదా? ఆ మహాపురుషుల నామములను స్మరించకపోవుటకంటె, హెచ్చు కృతఘ్నత కలదా?

గుండుసూది, దారము, పెన్సలు, కాగితములు మొదలగు వస్తువులలో నేదిలేకపోయినను మనుజునకు వ్యవహారము జరుగదు. ఇవి దిగువయంతస్థులోనివి. షట్ఛాస్త్రములు, షడ్దర్శనములు, ప్రకృతిశాస్త్రములు, ఈ మొదలగు వానిని రచించినవారు, వాని నభివృద్ధిఁగొందించిన వార లెందరో మనకు దెలి



యదు. వీనిని నేర్చుకొనుటకు మనుజుని జీవితకాలము చాలదు. ఆ మాట కేమి. ఈ రెండంతస్థులలోనివాని సభిన్న సముదాయఫలమును పండితపామరులు, సామంతసంసారులు, పెద్ద పిన్నవారలు, నగర గ్రామవాసులు వీరిలో నెవఁడు ప్రతిదినముఁ బొందకయుండును?

ఇవియన్నియు సమకూడి, సముదాయ మగుసరికి యెంతకాలముపట్టెనోగదా? వీని సముదాయమె సంఘము: కొంతకాలమునకు సాంఘికసూత్రము లల్లబడి, వర్ణాశ్రమ ధర్మములు విభజింపఁబడెను. సాంఘికుల మైనంతవఱకు, మనము వీని శుభాశుభ ఫలముల ననుభవింతుము. సంఘమునకు శుభఫలము నిచ్చువారు మహాపురుషులు; అశుభఫలము నిచ్చువారు నీచులు. అనేక సంఘములు గలిసిన, దేశవాసులగుదురు; వీరినే మహాదేశీయులని పిలిచెదరు. శరీరమునం దెక్కడ వ్రేటుతగిలినను, దానికి బాధకలిగినవిధమున, మనము చేసిన యశుభకార్యఫలములను మన సంఘమువారే కాదు, మన దేశీయులు సహిత మనుభవింతురు. యుక్తాహారవిహారములచేతఁ బోషింపఁబడినందున, రక్తము ధారాళముగ నాళములయందు బ్రవహించి, కర్మేంద్రియములకుఁ బుష్టి, జ్ఞానేంద్రియములకు నైర్మల్యముఁ గలుగజేసినపుడు, శరీరము సుఖ మనుభవించునటుల, సంఘములోఁ బ్రతి మనుజుఁడు భిన్నముగఁ జేయు శుభకర్మము లతనికిమాత్రమె గాక సంఘమునకును దేశమునకును అంతటికిని శుభంబు లొసఁగును.

ఈ శుభాశుభకార్యములు సజ్జన దుర్జనులచేతఁ జేయబడి, సంఘములను దేశములను ఉద్ధరించుటయో యథోగతిపాలు చేయుటయో జరుగును. ఈ గతుల ప్రదర్శనమే దేశచరిత్రనాఁబడు. దేశములోనివారే సజ్జనులు, దుర్జనులు. భిన్నముపైని 'పురుషుల జీవితచరిత్రము'లని, సముదాయముపైని 'దేశచరిత్ర' యని, మన మొకదానినె ద్వివిధముగఁ జూచుచున్నాము.

శరీరము నాశ్రయించుకొని మూఁడు ధాతువులు, పంచప్రాణము

లున్నవి. వీనిలోఁ బ్రాణవాయువు, పైత్యము ముఖ్యమైనవి; శేషించిన వానినివి యుద్రేకించనీయవు; అటులనె, లోకములో సజ్జనులు. వారు దుర్జనుల నణఁగఁగొట్టుదురు. 'మనుజుఁ డెటుల సజ్జనుఁడయ్యెనో, యెటుల తన జీవిత కాలములో సాధువుల రక్షించెనో, దుర్జనుల శిక్షించెనో, యెవరితో మైత్రి జేసెనో, యెవరితో వైరము బాటించెనో, బాల్య యౌవన కౌమార వార్ధకదశల నెటుల గడిపెనో, బ్రహ్మచర్య గృహస్థాశ్రమధర్మముల నెటుల బ్రవర్తింప జేసెనో, దేనియందు ఈ యంశములు సవిస్తరముగ వ్రాయబడియుండునో అది యేమహాపురుషుని జీవనచరిత్రము; ఈ మహాపురుషుల సంక్షిప్తచరిత్రయే 'దేశచరిత్ర.'

వారిచే చేయఁబడిన కార్యములయొక్క ఫలముల ననుభవించుటచేత, మన కింత యౌన్నత్యము, నాణెము వచ్చినపుడు, వారివలె మనముగూడ మహాత్కార్యములను యథాశక్తిఁ జేయ సమకట్టిన యెడల, మన మెటువంటివారమగుదుము? వానిని నెరవేర్చిన యెడల? వారి కార్యములకు దేశకాలపరిమితి లేదు; మన కార్యములకు గలదు. 'ఆత్మవత్సర్వభూతాని' అను న్యాయము వారియందు బ్రవర్తించెను.

సూర్యచంద్రులుదయించుచున్నారు; అస్తమించుచున్నారు. అటులనె గ్రహములు, నక్షత్రములు; పరిపాటియగుట చేత, నివి మన దృష్టిని యాకట్టుట లేదు. 'హాలీ' తోకచుక్క, తుపానులు మొదలగు ప్రకృతి విపరీతములు మన దృష్టి నాకర్షించుచున్నవి. అవి శాశ్వతమైనవి; ఇవి క్షణభంగురములు. అటులనె మహాపురుషులు, వారి కార్యములు; దుర్జనులు, వారి కృత్యములు.

వారి కాలములో వారు మహత్తుగలవారని పరులెరుగరైరి. సామాన్యులవలె వారుగూడ సుఖదుఃఖములననుభవించిరి. సూర్యకాంతి మొదట నధిత్యకలమీఁద బ్రసరించి, క్రమముగ నుపత్యకభూములకు దిగునటుల, వారి ప్రభావము మొదట మహనీయులకు గ్రాహ్యమై, తదనంతరము మనకు దెలియును;



వారిని జూచు భాగ్యములేదు; వారి చర్యలను వినుటకు నోము నోచుకొనలేదు; వారినెఱిఁగినవారి నైన గన్నులారఁ జూచుటకుఁ దగినంత పుణ్యమైనను జేయలేదు; అట్టి మహాపురుషులు ప్రపంచములో నొకకాలమున జీవించియుండిరను జ్ఞానమైనను మనకు లేదు.

ఇటుల కూపస్థమండూకంబులవలె, బుట్టుచు గిట్టుచు, చర్వితచర్వణులై, విషయములకు లోఁబడి, కాలమును గుర్తెఱుఁగక, పశువులవలె బ్రజలు సంచరించుచున్నారు. ఈ యజ్ఞానమును బోఁగొట్టుకొనుటకు, వారు గురువుల నాశ్రయించవలెను. దానిని బోఁగొట్టినవి గురూపదేశములు కావా? స్వయముగ వారివలన వినుటకు దగినంత యదృష్టము లేదు. ఆ యుపదేశములే, లిఖితరూపమును బొంది, జీవితచరిత్రములయినవి.

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం ॥
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥"

ఏయే కాలములోఁ బ్రజలు ధర్మమార్గము విడనాడి, యధర్మమార్గముఁ బొందుదురో, యా యా కాలములలోఁ బురుషోత్తముఁడు తన నిజవిభూతిని దెలుపుటకు బ్రపంచములోఁ దనకళ చేత మహాపురుషుల నుద్భవింపఁజేసి, వారి చేత లోకముల నుద్ధరింపఁజేయును. వారినే మనము క్రైస్తువని, మహమ్మదని, గౌతమబుద్ధుఁడని, శంకరుఁడని, ఆనందతీర్థులని, రామానుజులని, కన్ఫ్యూషియసని, లూథరని మొదలగు నామములతో స్మరించుచున్నాము. వారిలో నెంత మాహాత్మ్యముండక పోయిన, ననేకకోటి ప్రజలు వారిని బ్రతిదినము స్మరించుటయేగాక, వారి సిద్ధాంతములను బఠించి, వారి ధర్మముల నాచరించుచున్నారు.

సాధుజనరక్షణ, దుష్టజనదండన వీనికై పరమేశ్వరుఁ డనంతకోటి

జన్మముల నెత్తి భూభారముఁ దగ్గించెను. పురాణములలోఁ జెప్పిన యవతారములే గాక, మఱి యెన్ని యవతారము లాయన యెత్తెనో మనము చెప్పలేము; లోక కంటకులను సంహరించకపోయినయెడల, లోకములకు స్వాస్థ్యముండునా? కనుక, మహావీరులందఱు భగవంతుని కళలని తెలియనగును. ధాతువు లుద్రే కించి, శరీరమును గష్టపెట్టుచున్నప్పుడు, స్కంధత్రయము దెలిసిన వైద్యుఁడు వానిని శాంతింపజేయువిధమున, నంగపంచకము గుర్తెఱిఁగిన మహావీరులు చతురంగముల నడిపించి, దేశములకు మేలుగలుగఁజేయుదురు.

దేహము స్వస్థతగ నుండినపుడు, హృదయకమల మెటుల నాళముల లోనికిఁ బరిశుద్ధరక్తమును బంపునో, యటులనె, దేశములు చల్లబడి యర్థ ప్రాణములకు నెమ్మదిగలిగినపుడు, శాస్త్రజ్ఞులు, వేదాంతులు, పండితులు మొదలగు ప్రాజ్ఞులు బయలువెడలి, వారి వారి యుపన్యాసములచేత, బోధనల చేత, బ్రత్యక్ష నడవడికలచేతఁ బ్రజల యజ్ఞానమును బోఁగొట్టుదురు. వైతాళి కులవలె, వీరు మనుజులను మోహనిద్రనుండి మేలుకొలుపుదురు. అనేక జన్మ ములనుండి వచ్చుచున్న యజ్ఞానము మనస్సునుబట్టి యాక్రమించియున్నం దున, వీరి ప్రబోధనములచే, వారికి బ్రబోధోదయమగుట కష్టము. అందు చేత, మనము నిరాశఁజేసికొని, దిగులొందవచ్చునా? పఠనము, వ్యాసంగము, మననము, ఆచరణవిధానములచేఁ దానిని మేలుకొలుపవలెను. దౌవారికుఁ డైన మనస్సు జాగరూకతతో నుండకపోయిన, బుద్ధి చెడును. 'బుద్ధి నాశాత్ప్ర ణశ్యతి'. బుద్ధి చెడుట మనుజుఁడు చెడుట. ఈ రెండు నొకటే. మనస్సును మేలుకొలిపి, బుద్ధిని వికసింపజేయువారె, కాళిదాసు, షేక్స్పియరు, ప్లేటో, సోక్రటీసు, గాథె మొదలగువారు. సూర్యుఁడొక్క బాహ్యలోకమునకే వెలుగు నిచ్చునుగాని, వీరంతర్బహిర్లోకములఁ బ్రకాశింపఁజేయుదురు.

వర్తమానకాలము నధిష్ఠించి, భూతకాలావళిగుండ జూచిన, మనకు సమీపమునన్నవి దృశ్యములై, దూరముననున్నవి యదృశ్యము లగుచున్నవి.



అనంతమగుకాలమున నెందఱు మహాపురుషులు జననమై, భూభారమును వహిం చిరి? దేశచరిత్రలలోఁ జెప్పబడినవారుకాక, మఱి యెందరు మినహాయించఁ బడిరో గదా? వారిప్పుడు లేరా? ముందుకుండరా? వా రన్నికాలములలోను గలరు. భూమి నిలబడియుండుటయె, .వారు కలరనుటకు నిదర్శనము. వారు కనుపులవంటివారు; ఈ కనుపులను బట్టుకొనియే, మనము కాలారోహణముఁ జేయుచున్నాము.

"నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప ।
ఏషతూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరోమయా ॥"
"యద్యద్విభూతి మత్సత్వం శ్రీమదూర్జితమేవవా ।
తత్తదేవా వ గచ్ఛత్వం మమ తేజోంశ సంభవమ్॥"



# ప్లూటార్కు వర్ణితచరిత్రలు



## ప్లూటార్కు



అన్నినాఁడులలోఁ జిన్ననాఁడు మంచిదని యొక మహాపురుషుఁడు చెప్పెను. మాయమర్మములు తెలియక నిర్గుణులమై యెల్లప్పుడు నానందించుచు మనము చిన్నతనమును గడుపుదుము. వయస్సు ముదిరినకొలఁది లోకవ్యాపారములలోఁ దిగి విషయాసక్తులమై మనము తరంగములలోఁ గొట్టుకొనుచుందుము. అటుల నేకాంతస్థలమున చిదానందమును బొందుచుఁ గాలము గడిపిన తత్వజ్ఞాని యైన 'ప్లూటార్కు' యొక్క జీవితచరిత్రమును ముందుగఁ జదివి హర్షించి, తదనంతర మతనిచే వ్రాయఁబడిన లౌకికతరంగములలోఁ గొట్టుకొనుచున్న మహాపురుషుల జీవితచరిత్రములఁ బఠింపవచ్చును.

ప్రాజ్ఞుని యనుభవములను మన మెట్లు స్వీకరించునట్లే లోకమునుగూర్చిన యతని యాలోచనలను సహితము మనము తెలిసికొనవలెను. ప్రపంచధర్మములు ద్వంద్వములు. ఇవి యుద్రేకించి రాష్ట్రవినాశమును దెచ్చును. దేశకాల గ్రహా

సాంప్రదాయముల నివి మరగుపఱచును. ఇది యొకటి. రెండ
వది యేదన, మన స్వాతంత్ర్యమువలనఁ గలుగు మహోత్కృష్ట
పదవికంటె హెచ్చైన సమభావముఁ గలిగియుండుట మేలు; ఉచ్చ
పదవిని బొంది, సమభావమును బోఁగొట్టుకొనుటకంటె శాస్త్ర
జ్ఞానముచేత ధర్మమును నిలఁబెట్టి నిశ్చలతతోఁ గాలమును
గడుపుట మనుజున కుచితమైన పని. ఈ విషయముల నతని
జీవితచారిత్రమును జదివినచోఁ మనము తెలిసికొనఁగలము.

గ్రీసుదేశములోఁ 'బియోషియా' యను పేరుగల యొక
మండల ముండెను. అక్కడి ప్రజలు పశుప్రాయులుగ నుండుట
చేతఁ 'బియోషియా మూర్ఖు'లని వారికిఁ బేరువచ్చెను. మనము
'గొల్లల మూర్ఖత్వ' మనునట్లు 'బియోషియా మూర్ఖత్వ' మని
వాడుకకలదు. ఈయపవాదమును బోఁగొట్టుటకు నా 'పిండారు'
అను కవియు, 'అపామినందాసుఁ'డను వీరుఁడును నాదేశము
లోఁ బుట్టిరి. వారి తరువాత ప్రాజ్ఞుఁడైన 'ప్లూటార్కు' ఆదేశ
ములోఁ బుట్టి దానికిఁ గీర్తిఁ దెచ్చెను. అతఁడు క్రీ. శ. ౬౬
సంవత్సరములోఁ జనన మొందినటులు తెలియుచున్నది.

'అమోనియస్సు' అను నొజ్జయొద్ద నతఁడు చదివెను.
శిష్యుఁడు వ్రాసిన సంగతితప్ప మఱియొకటి గురువునుగుఱించి
మనకుఁ దెలియదు. శిష్యులనితఁ డెట్లు శిక్షించెనో దానిని
'ప్లూటార్కు' వ్రాసెను. "ఒకనాఁడు మధ్యాహ్నమున అతఁడు
పాఠములను జెప్పుటకుఁ బూర్వము మేము భోజనము చేయు



చుండఁ గొంతకాలము గడిపితిమి. ఇందుకతఁడు కోపగించి, కుమా
రుఁడేమో భోజనముఁ జేయుచు లేచిపోయె నని మిషఁబెట్టి
వానిని మా సమక్షమున కొట్టించెను. ఈ సమయములో
నతఁడు మా వైపు దృష్టి నిగిడించి చూచుచున్నందున, మా
నిమిత్త మతఁడు వానిని దండించెనని మేము గ్రహించితిమి."
ఈ సంగతిని 'ప్లూటార్కు' వ్రాసినందువలన గురువు విషయా
సక్తుల (Epicureans) లోనివాఁడు కాఁడని తెలియుచున్నది.
అతఁడు చేసిన శిక్షనుబట్టి యతఁడు వైరంగికుల (Stoics) లోనివాఁ
డని తోఁచునుకాని నిజముగ నతఁడు శాస్త్రజిజ్ఞాసకుల (Acade-
micians) లోనివాఁడు. వీరి పాఠశాల లాకాలములో గ్రీసు
దేశమునందు విశేషముగఁ గీర్తిఁ బొందెను.

బెత్తమును వాడుకఁ జేయుటకు తండ్రికిమాత్రమధికా
రముకలదు. ఈ పాఠశాలలలో గురువులు దాని నుపయోగిం
చుటలేదు. బుద్ధిని వికసింపఁజేయుటయే గురువుల పనిగాని
హేయమై, నికృష్టమై, నీచమైన బెత్తమును బట్టుకొని బాలు
రను దండించి వారి మనోవ్యాపారములను దగనివిధమున
నిరోధించి, వారి మర్యాదకుఁదగిన స్వాతంత్ర్యబుద్ధినిఁ బోఁగొ
ట్టుట యుపాధ్యాయులకు ధర్మము కాదు. బెత్తమును బట్టుకొని
బాలురను గురువులు శిక్షించుట, నేఁడుగూడఁ గలదు. బెత్తము
చేత దేహశుద్ధినిఁ బొందుట కాదుకాని, సిగ్గులజ్జలవలన, బుద్ధి
వంతులు, మొదట విచ్చలవిడిగ సంచరించినను, మార్గములో

నికి రాఁగలరు. ఏపాటిబుద్ధి లేకపోయిన దేహశుద్ధివలన వాఁడు మొండి దేరునుగాని సన్మార్గములోనికి రాలేఁడు. ఉన్నట్టువంటి తగుపాటి బుద్ధినైనను నిర్మలము చేయవలెనుగాని దెబ్బలుకొట్టి దానిని మలినము చేయరాదు. దేహపీడయైనకొలఁది మనస్సు శుద్ధిని బొందుచుండును; సిగ్గులజ్జలను బోఁగొట్టునది దానికంటె మఱియొకటిలేదు. ఆ రెండును గలిగియుండిన, ధర్మము నిలఁబడును; కీర్తి ప్రతిష్ఠలు వచ్చును.

ఇప్పటి మనవలెఁగాక గ్రీకులు మఱియొక విధమున విద్యాభ్యాసము జేయుచుండిరి. ప్రారంభములోనే వారన్ని శాస్త్రములలోను బ్రవేశపెట్టఁబడుచుండిరి. రామచిలుకలవలె మనము మాటలనుమాత్రము గ్రహింతుము; వారు మాటలచేత నిరూపింపఁబడిన వస్తుజ్ఞానమును గలిగియుండిరి. మనవలె రెండప్రచలిత భాషలను జదువుటలోఁ బదిసంవత్సరముల కాలమును వారు వ్యర్థపుచ్చుటలేదు. ఆ కాలమున వారు ప్రకృతిని పరిశోధించుటలో గడిపి, దానిలోని చిత్రముల యాథార్థ్యమును వాని నియమములను గ్రహించుచుండిరి. తత్త్వ, గణిత శాస్త్రములనేగాక శబ్దోత్పత్తి శాస్త్రము (Philology)ను వారభ్యసించిరి. మహాకవుల గ్రంథములలోని ప్రాస్తావికవచనములను వారు జిహ్వాగ్రమున నుంచుకొనిరి.

ఈ విద్యలలో 'ప్లూటార్కు' పూర్ణుఁడై మహాపురుషుల జీవితచరిత్రలను వ్రాసెను. ధారణాశక్తి విశేషముగఁ గలదు.



కనుకనే, చెప్పిన యంశములను జెప్పక చరిత్ర నతఁడు వ్రాసెను. నూటికొకచోట పునరుక్తి కలదుకాని సాధారణముగఁ గనఁబడదు.

వేషభాషలవలన నతఁడు శాస్త్రజిజ్ఞాసకులలోనివాఁడని తెలియుచున్నది. క్రియలు, మాటలు, ఉపదేశములు, ఆచరణలలో నతఁడు దానికనుగుణ్యముగ నడిచెను. క్రమముగ నతఁడు తత్త్వజ్ఞానమును బొందెనని యతని గ్రంథముల మూలమున దెలియుచున్నది. అందఱి మతములను బరిశీలించి శాస్త్రజిజ్ఞాసకులను, విషయాసక్తులను జెందక, బ్రహ్మజిజ్ఞాసకుల పక్షమతఁ డవలంబించెను. వైరంగికుల నతఁడు ముట్టలేదు. అందఱి బోధలలోను శ్రేష్ఠమగువానిని గ్రహించి వానినతఁ డనుష్ఠించెను.

ప్రకృతి నారాధించు పైథాగొరాసు క్షుద్రజంతువులను మనుజులు హింసించుటఁ జూచి, విచారించి, యొక్కమతమును గనిపెట్టెను. దానినే 'పునర్జన్మమత' (Metempsychosis)మందురు. జీవుఁడొక శరీరములోనుండి మఱియొక శరీరములోఁ బ్రవేశించునని, దీని సిద్ధాంతము. ఈ మూలమున జంతువులకు హింస లేకుండఁ జేయుట యతని యభిప్రాయము. మొదటినుండి సృష్టిలోని పిపీలికాది జీవకోటులనుజూచి సంతసించుచున్న 'ప్లూటార్కు' ఈ మతసిద్ధాంతముల నెటుల నవలంబించకుండును? మతబోధకునివలె నతఁడుగూడ నుపన్యసించి, జంతువులను

హింసించిన, వాని రూపమును బొందవలసివచ్చు నని ప్రజలకు బోధించెను.

'కేటో'యొక్క జీవితమును వ్రాయుచు, "అతఁడు (Cato) పరిచారకులను పశువులవలెఁ జూచుచుండెను; వారిని తోఁచినప్పుడెల్ల బానిసలుగఁ జూచుచుండెను; కొన్ని వేళల వారిచేత బరువులను మోయించెను; కొన్ని సమయములలో వారిని బయటకు వెళ్లఁగొట్టి వారి కాహారమిడుట లేదు. సృష్టిలో మనుజుఁడు రాజు గనుక, మనుజులను సోదరభావముతోఁ జూచుటయే గాక, యితర జంతువులసహిత మతఁడు ప్రేమించవలెను. అన్ని జంతువులను సమభావముతోఁ జూచుటయె పరమమతము" అని ప్లూటార్కు తన మనోభిప్రాయమును విశదపఱచెను. గురూపదేశమున కనుగుణ్యముగ నతఁడు నడిచెను.

పాఠశాలలలో గురువులుపన్యసించు అస్పష్టపరిభాషణములను, వీరమతస్థుల పిచ్చికూతల నతఁడు తిరస్కరించి, పైథాగొరాసు శాస్త్రమును ప్రకృతితో సమ్మేళనఁ జేసి, జ్ఞానోదయమగునట్లు చేసెను. పారసీకము, ఈజిప్టు దేశములలోని శాస్త్రములను శోధించినందున, నతనిని జ్ఞానియని స్వదేశీయులు బిలువఁదలఁచినపుడు, దాని కంగీకరించక 'శాస్త్రజిజ్ఞాసకుఁ'డని పిలువఁబడుట కతఁడు సమ్మతించెను.

గురువులయొక్క సదభిప్రాయముల నేగాక, వారి దురభిప్రాయములనుగూడ ప్లూటార్కవలంబించినందుకు మన మత



నిని మన్నింపవలెను. గురువువలెనే నతనికి స్వప్నములయందు నమ్మకము కలదు; వాని యాథార్థ్యమును జెప్పలేము. రెండు పక్షములలోఁ దగు కారణములగుపడుచున్నవి.

ఆ కాలములో ముద్రాక్షరశాలలు లేవు; ముద్రింపఁబడిన పుస్తకములు లేవు. అన్నియు లిఖితరూపముగనున్న గ్రంథములు. వానిని వ్రాయుట కష్టము. వ్రాయఁబడినవానిని కొనుట కష్టతరము. సంపాదించిన వానిని జదువుట కష్టతమము. అట్టి స్థితిలో, ప్లూటార్కు చదివిన గ్రంథములకు లెక్కలేదు. 'కావ్యశాస్త్రవినోదేన కాలో గచ్ఛతి ధీమతాం.'

అతని కుటుంబమువారు ధనములేనివారు కారు. ఆతని పూర్వులు పెద్ద యుద్యోగములఁ జేసినవారు. ప్రపితామహుని బాగుగ నతఁడెఱుఁగును. ఇతని కాలములో స్వదేశీయులు రోమనులు దాడి భరింపలేక శ్రమపడిరని ప్లూటార్కు వ్రాసియున్నాఁడు. అతని పితామహుఁడు సంతోషపురుషుఁడు; మంచి వక్త; మద్యపానాపేక్షుఁడు; రసములోనికి వెళ్లి సరసము బయటకు వచ్చుచుండెను. అతని తండ్రికూడ ధర్మాత్ముఁడు, సుగుణవంతుఁడు. ఆ కాలపు చదువుల నతఁడు బాగుగఁ జదివెను. తండ్రినిగుఱించి చెప్పుచు, "నేను మఱియొకనితోఁ గలిసి సందేశముమీఁద నొక గ్రామమునకుఁ బంపఁబడితిని. నాతోడ వచ్చినవాఁడు మార్గములోనుండి పోయినందున, నొంటరిగ నేనా గ్రామమునకుఁ బోయి, యా సందేశమును నెఱవేర్చి, స్వగ్రామ

మునకు వచ్చితిని. మఱునాఁడు నిర్వహించుకొని వచ్చిన యంశమును సభలో ముచ్చటింపవలసి యున్నందున, నా తండ్రి 'నేను, నేనని వాడుక చేయక, మేము కార్యము నెరవేర్చితిమని చెప్పిన, ప్రజలు నిన్నీర్ష్యతోఁ జూడ'రని నాతోఁ జెప్పె"నని ప్లూటార్కు వ్రాసెను.

'క్లైమను,' 'లెంప్రియసు' వీరిరువు రతని యన్నదమ్ములు. వీరు మువ్వు రత్యంత మైత్రిగ నుండిరి. అందులో 'క్లైమను'ను ప్లూటార్కు విశేషముగఁ బ్రేమించెను. "నే నదృష్టము గలిగి యున్నను, నాయన్న 'క్లైమను'యొక్క స్నేహము, దయకును బాత్రుఁడ నైతినని ప్లూటార్కు వ్రాసెను. 'అంప్రియసు'కు తాత పేరు పెట్టినందున; నతనివలె నితఁడు సంతోష పురుషుఁడు.

కొంతకాల మతఁడు దేశయాత్రలలో గడిపెను. ఈజిప్టు, ఇటాలియా దేశములలో నతఁడు తిరిగెను. ఇటాలియా దేశములోనుండిన దినములలో నతఁడు 'లాటిను' భాషను నేర్చుకొనుటకు సమయము దొరక లేదు గాని, రోమనులలో మహాపురుషుల జీవితచరిత్రలను వినుచుండెను. మొదట వస్తుజ్ఞానముఁ గలిగియున్నందున, వానిని నిరూపించు శబ్దముల నతఁడు 'లాటిను' భాషలో నేర్చుకొనెను.

ప్రకృతిలోని ప్రతివిషయము బుద్ధిని వికసింపఁ జేయునని యెంచి, వానినే ప్రసంగములలో 'రోమనులు' ముచ్చటించుచుండిరిగాని, 'కుక్కనూత' నక్కనూత'లలో 'వారు కాలమును



వ్యర్థపుచ్చ లేదు. అందుచేతనే, భాషాపరిజ్ఞానము లేకపోయినను, సంభాషణలవలన ప్లూటార్కు మహనీయుల చారిత్రములను గ్రహించెను. కొంచెము వయస్సు ముదిరినపైని, లాటిను భాషను నేర్చుకొని, అందు వ్రాయఁబడిన రోమనుల చరిత్రము నతఁడు చదివెనుగాని చరిత్రములకుఁ గావలసిన ముఖ్యాంశములను సంభాషణలలోనె నతఁడు ప్రోగుచేసెను.

ఆకాలములో రోమునగరములోని మహనీయుల చేతను, ప్రాజ్ఞుల చేతను మన్ననలను బొందుటయెకాక, రోము చక్రవర్తి 'ట్రాజను' చేతకూడ నతఁడు గౌరవ మందెను. అతఁడు చక్రవర్తికి గురువని కొందఱు, కాఁడని కొందఱు జెప్పుదురు. గొప్ప పండితుఁ డను పేరతనికి వచ్చెను. "బోద్ధారో మత్సర గ్రస్తాః" అనునట్లు అతనిని జూచిన కొందఱికి శిరోభారముగ నుండెను. జ్ఞానులకు వచ్చు దురవస్థ యిదియె. జ్ఞానులను మనము తేరి చూడ లేము. (మేఘముచేత గప్పబడినపుడు తప్ప గ్రహరాజును చూడ లేని విధమున).

జ్ఞానులకుఁ దగిన మర్యాదలను బొంది రోమునగరములో ధర్మము స్థాపించి, ప్రజలకు జ్ఞానోపదేశము జేసి, ట్రాజను చక్రవర్తిని సుగుణవంతునిగ నొనర్చి ప్లూటార్కు స్వదేశమునకు వచ్చి చేరెను. శిష్యుఁడైన చక్రవర్తి మరణము నొందినందున, నతఁడు దుఃఖించి 'కైరోనియా' పట్టణమునకుఁ బోయెను. అక్కడ నివసించి, లౌకిక వ్యాపారములలో దిగక, ఏకాంత

ముగఁ గాలముఁ గడుపుచు, మహనీయుల జీవితచరిత్రములను వ్రాయ నారంభించెను.

ఈ చరితములను చరిత్రములు వ్రాయువిధమున వ్రాయకపోయినను, నతఁడు వానిని రసవంతములుగ జేసెను. దేశకాల సంబంధముల నతిక్రమించి చరిత్రాంశములను వ్రాసినను, జ్ఞానోపదేశముల చేత వానిని నతఁడు నింపినందున, పండితపామరులు వానిని శ్లాఘించుచున్నారు. కంటకములతోఁ గూడిన గులాబీ పుష్ప మెంత మనోహరముగ నుండునో, యటుల సంకటములతోఁ గూడియున్న యతని గ్రంథ మంత యాహ్లాదకరముగ నున్నది.

సృష్టిస్థితిలయకర్తయైన పరమేశ్వరుఁ డొక్కఁడైనను, మీఁది మెట్టుననున్న దేవతలకు క్రింది మెట్టుననున్న మనుజులకు, యొవరికి సమీపముననున్న వారి గుణరూపములను బొందుచున్న ప్రాణులు కలవని యతని నమ్మకము. శూన్యస్థలముండుట ప్రకృతికి విరుద్ధము గనుక, దేవతలకు మనుజులకుఁ గల యంతర మీ జీవులచేత నిండియుండక తప్పదని యతఁడూహించెను. పుణ్యపాప కర్మములకుఁ దగినటుల నీ ప్రాణులను లోమ విలోమముగ దేవ మనుజ రూపములను బొందుచుందురని యతని యభిప్రాయము.

స్వగ్రామమున గ్రంథావలోకనలో నేగాక, వైదిక వ్యాపారములను లౌకిక చర్యలతోఁ గలిపి కాలమతఁడు గడిపెను.



సంఘములో నున్నపుడు, గృహస్థ ధర్మము నవలంబించి సాంఘిక దేవ పితృ ఋణముల నతఁడు తీర్చెను. అతఁడు న్యాయాధికారిగఁ గొంతకాల ముండెను. "న్యాయాధికారి యెప్పుడును ప్రజల కష్టసుఖములను వినవలెను. అతఁ డార్తశరణ్యుఁడు గావలెను. అతని గృహము శరణాలయము" అని యతఁడు చెప్పెను. ప్రజారాజ్యము నతఁడు మన్నించెను. ప్రజలు స్వాతంత్ర్యముగ నుండవలె నని యతని యభిప్రాయము.

తత్వజ్ఞాని, చరిత్రకారుఁడు, న్యాయాధికారి ఈ బిరుదులు యోగ్యముగ నతఁడు వహించెను. ఇఁక నతఁడు సంసారము నెట్లు గడిపెనో మనము చూడవలెను. నిస్సారమైన సంసారములో మనుజుని యొక్క సారము తెలియును. అన్ని చదువుల సారము కూడినందున నతఁడు సంసారి.

సత్కులమందుఁ బుట్టుట దుర్లభము. పుట్టినతరువాత ననుకూలవతియైన గృహిణిని బొందుట కష్టము. వీనిలో నేది లేకపోయినను, మనుజునికి సంకటమే; రెండును గలిగియున్న దానికంటె భాగ్యము లేదు. అతఁడు సత్కులమునందుఁ బుట్టెను. అతని భార్య యోగ్యురాలు; భర్త కనుకూలముగ నడిచెను; పురుషార్థములను గుర్తెఱిఁగి దంపతులు గృహస్థ ధర్మమును నడిపిరి. ఆమె పేరు 'టైమాక్సి'. వారికి నలుగురు కుమారులు, నొక కొమరితయుఁ గలిగిరి. "నా కూఁతురు దాదియొద్ద పాలు త్రాగి కడమ పిల్లలకు పాలిమ్మని దానిని నడుగునని ప్లూటార్కు

వ్రాసెను. ఈ కూఁతురు బాల్యములోనే మరణము నొందెను. కొంతకాలమునకు కుమారు లిగువురు చనిపోయిరి. ఎన్ని కష్టములు వచ్చినను వానిని భరించి మనోచాంచల్యమును ఆ దంపతులు పొందలేదు.

ప్లూటార్కు చిరకాలము జీవించెను. అతఁడెటుల మరణము నొందెనో, దాని వివరణ లేదు.



# డెమాస్తనీసు

డెమాస్తనీసు తండ్రి, డెమాస్తనీసు, 'ఆథెన్సు' పట్టణములో నివసించుచుండెను. అతఁడు ఖడ్గకారకుఁడు. అనేకమంది సేవకులచే నతఁ డాపనిని చేయించుచుండెను. రాజద్రోహము చేసి దేశమునుండి పరారియైన 'గైలాను'నకును, నతని భార్యయైన యొక కిరాతక స్త్రీకినిఁ బుట్టిన చిన్నది డెమాస్తనీసు యొక్క తల్లి యని కొందఱు చెప్పుదురు. కాని దాని యాథార్థ్యమును నిర్ణయించుటకు వీలులేదు. ఇతఁడు మాణవకుఁడుగ నుండినపుడు తండ్రి డెమాస్తనీసు కాలము జేసెను. పిత్రార్జితము దరిదాపుగ, నరువదివేల రూప్యము లితనికిఁ జెందెను. ఇతని సంరక్షకులు తమ స్వంతమునకు దీనిలోనుండి కొంతసొమ్ము నుపయోగించుటచేతను, శేషించినదానిని సద్వినియోగముఁ జేయక పోవుటచేతను, ఇతనికిఁ జేయవలసిన సంస్కారములు వారు జేయక యుపేక్షించిరి. ఇతఁడీయవలసిన గురు కట్నములఁ గూడ వారు తమ స్వంతమునకు వాడుకొనిరి. ఇట్లీతని బుద్ధికుశలతకుఁ దగిన జ్ఞానసంస్కారము లేనందున నితఁడు దాని ఫలితమును బొందుట కవకాశము లేకపోయెను. ఇతని శరీరము సున్నితమైనందున నితనిని మొండిపనులఁ జేయుటలో నియమించుట

కితని తల్లి కిష్టము లేక యుండెను. వారి వేతనములు వారికి తిన్నఁగ
నందక పోవుటచేత గురువు లితనిని దేహపరిశ్రమఁ జేయవలసిన
దని నిరోధించలేదు. మొదటినుండియు నితఁ డర్భకుఁడు. అందు
చేత బాలురంద ఱితని నపహసించుచుండిరి.

సర్వజనసమక్షమునఁ బ్రసంగించుట కీకాలములో నితని
కాకాంక్ష కలిగెను. ఒక సమయమున 'కాలిస్ట్రేటసు' అను నొక
వాక్చతురుఁడు విచారణసమయమునఁ దన వక్తృత్వమును సర్వ
జనసమక్షమున విశదపఱచునని విని, డెమాస్తనీసు తన యుపా
ధ్యాయులను వేఁడుకొని వారితోఁగూడ సభకుఁబోయెను.
నాఁడు వాక్చతురిని వాగ్ధోరణిచేత పరవశులయి యందఱును
వానిని స్తోత్రము జేసిరి. అందుచేతఁ దాను సహితము వానిం
బోలు వాక్చతురుఁడని పేరుఁ బొందుటకు నిశ్చయించి, బాల
క్రీడలయం దాసక్తి వదలి, డెమాస్తనీసు వాక్పాటవాయత్త
చిత్తుం డయ్యెను. సువక్తృత్వమునందు సంస్కారమును బొందు
టకు 'ఐసోక్రేటీసు' అను పేరుగల గురువు నాశ్రయించెను.
తన బాల్యావస్థ గడచినపిదప తన సంరక్షకులను వారు చేసిన
పనులకుఁ గారణములను జూపుఁడని న్యాయసభలో ఖచిత
ముగ నడిగెను. వారు కపటముగ సంచరించి కాలయాపనఁ
జేయుటచేత, వారిని నిరాకరించుచుఁ దన వాగ్వైభవమును
న్యాయసభలోఁ గనుపఱచుట కతని కవకాశ మయ్యెను. ఎంత
పోరాడినను బిత్రృధనములో నతనికిఁ గొంచెము సొమ్ము



మాత్రమే చిక్కెను. ఈ మూలమునఁ గొంత స్వానుభవముఁ బరి
పాటినిఁ బొంది, రాజకీయ వ్యవహారములలోఁ దన వాగ్వై
భవమును సభలోఁ బ్రకటనఁ జేయుటకు యత్నించి క్రమముగ
నతఁడు పేరుపొందెను.

మొదట నతఁడు సభలోఁ బ్రసంగించుట కుపక్రమింపఁ
దొందరపాటులో వాక్యవిరామముల నతిక్రమించి పూర్వపక్ష
సిద్ధాంతముల నసందర్భముఁ జేసెను. మాటలలో స్ఖలితస్వరుఁ
డై యేకరీతిగ ధోరణిని నడిపించుటకు వాయువు చాలనందున
నతని ప్రస్తావమును సాంతముగ వినుటకు సభ్యులు రోసి యతని
నధిక్షేపించిరి. సాలంకారనిష్యందమునకు లావణ్యోత్కర్షలను
సమకూర్చునది ప్రవృత్తియె యని తెలిసికొని, సోచ్చారణాంగ
విక్షేపవిముక్త ప్రవచనము లప్రశంసనీయము లని యతఁడు
గ్రహించెను. నాఁటినుండియు భూగర్భమున నొక బిలమును
నిత్యానుష్ఠానమున కేర్పఱచుకొని, రెండుమూఁడు నెలలపర్యంత
మక్కడ నతఁడుండి పోవుచుండెను. అక్కడనుండి బయటకు
రావలె నని తనకోర్కె పొడమిన నటుల వచ్చుటకు విఘ్నము
కలుగున ట్లతఁడు తన శిరస్సును సగము ముండనము చేసికొనెను.

అతఁడొకరి దర్శనమునకు వెళ్లినపుడుకాని, యతని దర్శ
నమున కితరులు వచ్చినపుడుకాని జరిగిన ప్రస్తావనాంశములు
అనఁగా విశ్రుతమైన వ్యవహారము లతని కభ్యాసముఁ గలుగఁ
జేయుచుండెను. స్నేహితులు వెళ్లినపైని నతఁ డధ్యయనాగార

ముఁజొచ్చి, విధి నిషేధపక్షములఁ జర్చించి విషయాంశమును వితర్కించుచుండెను. కొన్ని ప్రవచనీయములను మనన చేసి వానిని యుక్తముగ సంస్కరించి, యతఁడు జిహ్వాగ్రమున నుంచుకొనెను. సభలో నతనిని పేరుపెట్టి పిలిచి సాంప్రతవిషయము గుఱించి ముచ్చటించవలసిన దని సభ్యులు కోరిన దాని నతఁడసంభావపూర్వకముగఁ బ్రసంగించుట లేదు. అందుచేత నతఁడు ధారణాశక్తి లేనివాఁడనియు, నతని వాక్చాతుర్యము వ్యవసాయఫలమనియు పరులెంచిరి.

'పెరిక్లీసు' నతఁడాదర్శముగ దీసికొన లేదు. అస్ఖలితభాషణమును, హస్తాద్యభినయములను నాతనినుండి యితఁడు నేర్చుకొనుటయే గాక అతనివలె నాకస్మిక ప్రవృత్త్యనుసారోదిత వాదములయందుఁ బ్రతికూలమనస్కుఁడయ్యెను. వాని యౌన్నత్యమున కిదియే కారణమని యితని యభిప్రాయము. అన్ని సమయములలోఁ దన వాక్శక్తులను దైవాధీనములని యెంచక పోయినను ప్రాప్తకాలములయందు తన సభాపాండిత్యమును బ్రకటనఁ జేయుట కతఁడు విముఖుఁడు కాలేదు. ప్రస్తావించినపుడెల్ల దైవబలము కలదో యనునటుల నతఁడు భాషించుచుండెను.

స్వదోషములను బోఁగొట్టుకొనుటకతఁడు కొన్ని ప్రతివిధానములను సమకూర్చెను. అస్పష్టభాషణమును బోఁగొట్టుకొనుటకు నోటిలో గులకరాళ్లను బెట్టుకొని కంఠస్థముగనున్న



కావ్యమునో ప్రవచనమునో సముస్థలములను ఉచ్చభూములను బరుగెత్తుచు నతఁడుపన్యసించుచుండెను. స్వగృహమున నొక దర్పణము నిడుకొని దానిముందట మాటలాడుచు హస్తవిన్యాసముల నతఁడభ్యసించెను. ఒకసమయమున నొకఁడు పరిభవమును బొంది తన పక్షమున సభలో వాదించుటకితనిని రావలసినదని వేఁడుకొనెను. 'నీవు పరిభవముఁ బొందినవానివలె గనఁబడవే?' యని డెమాస్తనీసు తర్జింప, 'సరి, సరి, నేను దెబ్బలు తినలేదని మా యభిప్రాయమని' వాఁడు గర్జించెను. "నీవిప్పుడు దెబ్బలు తిన్నవానివలెఁ గనఁబడుచున్నా'వని డెమాస్తనీసు మాటను కలిపెను.

"ఆకారైరింగితైర్గత్యా చేష్టయా భాషణేన చ ।
నేత్రవక్త్రవికారేణ లక్ష్యతేఽంతర్గతం మనః ॥"

అని డెమాస్తనీసభిప్రాయపడెను.

అతని వక్తృత్వములు సర్వజనశ్లాఘనీయములయినను, రసికులు కొందఱు వానిని నీరసించిరి. వీని రచనశైలి చాతుర్యసంశోభితంబై మనోభేదన పాటవ ప్రశస్తంబుగ నుండెను. లిఖితరూపముగనున్న ప్రవచనములు మనోల్లాసమును గలిగించుచున్నను నతని సరసోక్తులు శ్రవణానందముగ నున్నవి.

'ఫోకియను'ల యుద్ధప్రారంభసమయమున నతఁడు వ్యవహారములలో దిగినటుల గనఁబడుచున్నది. అతఁడు, వ్రాసిన

భర్త్సనైన వాక్యములలో కూడ నటుల నే యున్నది. 'మిడియా' సను వానికి ప్రతికూలముగ నితఁడిరువదిమూఁడు సంవత్సరముల ప్రాయమున ప్రవచనములను వ్రాసెను. అప్పటికింకను కీర్తి ప్రతిష్ఠల నతఁడు పొందలేదు.

పరిగృహ్యాగ్రహమూన వైరుండును, వైరానుబంధ జాజ్వల్య మానరోషానలుండును నైన యతఁడొప్పుచుండెను. ధనము కలిగి స్నేహితుల ప్రాపకముమీఁద నిలువఁబడియున్న 'మిడి యాసు' ను పనిలోనుండి తొలఁగించుటకతనికి సమర్థత లేకపో యెను. అందువలన నతనికిఁ బ్రయోజనముఁ గూడ లేదు. కాఁబట్టి వాని పక్షము నవలంబించుట కతఁడుద్యుక్తుఁడయ్యెను. గ్రీసు దేశమును 'ఫిలిప్పు' అనువాని దాడినుండి రక్షించవలసి వచ్చినప్పుడు రాజకార్యములయందతనికిఁ గల యాకాంక్ష సిద్ధించుటకవకాశము కలిగెను. పూనిన కార్యమును మహా యోధునివలె నిర్వహించుటకును, వక్తృత్వమునకే కాక పలికిన సత్యవాక్యముల కాతఁడు ప్రఖ్యాతినొందెను. గ్రీసుదేశపు ప్రజలతని నభినుతించుటయే కాక, పారసీక దేశపు రాజాను గ్రహమున కతఁడు పాత్రుఁడయ్యెను. మండలాధీశ్వరుఁడైన 'ఫిలిప్పు' సహిత మందఱి వక్తలకంటె నితని నెక్కుడుగ నభినం దించెను. శత్రువులుకూడ వాగ్వాదములలో నతనిని శ్రేష్ఠు నిగ బహూకరించిరి.

మనుజులతోఁగాని వస్తువులతోఁగాని తుదముట్టఁ బొత్తు



నిలఁబెట్టుకొనుస్థిరబుద్ధి యతనికి లేదని కొందఱనియెదరు. అయినను మొదట నవలంబించిన పక్షములను సిద్ధాంతములను సాంతముగ నతఁడు పరిగ్రహించినటుల గనఁబడుచున్నది. ప్రాణములను విడుచుట కతఁడొప్పుకొనెనుగాని వానిని నతిక్ర మించుటకియ్యకొనలేదు. మాటలలోను క్రియలలో నతఁ డెప్పటికి కామాటలాడువాఁడు కాఁడు. రాజ్యతంత్రములోని రహస్యమును గుర్తెఱిఁగి దానిననుసరించి యతఁడు నడిచెను. ధర్మము ధర్మముకొఱకె యనుష్ఠించవలసినదను నియామకమున కనుగుణ్యముగ నతని ప్రవచనములు వ్రాయఁబడెను. ప్రియ మైనవి, సులువైనవి, లేక లాభకరమైన పనులను జేయవలసిన దని ప్రజల నితఁడు వీని మూలమున హెచ్చరించలేదు. కీర్తి ప్రతిష్ఠలను నిలుపుకొనుటయే ముఖ్యమనియు, రాజ్యము యొక్క క్షేమమంతగ యెన్నిక చేయవలసిన యంశము కాద నియు, వారికతఁడు బోధించెను. మాటల కనుగుణ్యమైన క్రియలు, క్రియలకుపయుక్తమైన మాటలు కలిగిన వాఁడైనను, యుద్ధముఁ జేయుటకుఁ దగిన ధైర్యస్థైర్యములు లేక లంచములు పుచ్చుకొనని వాఁడైన పక్షమున నతఁడధికముగ మన్నింపఁ బడసియుండును. రణరంగమున విచ్చలవిడిగ సంచరించుటకుఁ దగినంత ధైర్యమతనికి లేదు; వాడియైన సిరిచూపులతని మన స్సును నొప్పించక యుండలేదు.

సమయము దొరికినపుడెల్ల మాసిడను మండలాధీశ్వరుఁ

డగు 'ఫిలిప్పు'నువాని కార్యముల నితఁడు తృణీకరించుటకలదు. అందుచేత నతఁ డితని నందఱికంటె విశేషముగ సన్మానించి, యితని ప్రశంసలను ముఖ్యాలోచనలోనికిఁ దెచ్చి వానికి యుక్తముగఁ బ్రతివచనముల నిచ్చుచుండెను. 'ఫిలిప్పు'యొక్క సభకు రాయబారిగ నలుగురితో నితఁడు గలిసి వెళ్లినపుడు వారిలో నితఁడు విశేషముగ గౌరవమునొందెను. డెమాస్తనీసు తన వాక్చాతుర్యముచేత స్వదేశీయులను ఫిలిప్పుతో పోరాడు నటులఁ జేసెను. ఈ జగడము కొంతకాల మతిక్రమించెనుగాని తుదకు ఫిలిప్పునకు జయముకలిగెను. ఈ పరాభవము కలిగినసందులకుఁ గొంద ఱితనిని దూషించిరిగాని తుద కతఁడు నిర్దోషి యని జనులు ప్రకటనఁ జేసిరి. వీరస్వర్గము నొందినవారివిషయమై చేయవలసిన ప్రసంగముల నితనిని జేయుమని ప్రజలు వేఁడుకొనిరి.

ఫిలిప్పు కాలములోనే కాక వాని కుమారుఁడైన మహా అలగ్జాండరు కాలములోఁగూడ నితఁడు స్వదేశమువిషయమై పాటుపడెను. కాని నీచదశసంప్రాప్తమైనందున నతని శత్రువుల విజృంభణ సహింపలేక, వారికి లోఁబడవలసివచ్చునని యెంచి, విషముఁ ద్రావి డెమాస్తనీసు దేహత్యాగముఁ జేసికొనెను.

ప్రపంచములోఁ బుట్టిన మహావక్తలలో శ్రేష్ఠుఁడనఁదగు డెమాస్తనీసుయొక్క వాక్చాతుర్యము మిగుల సంస్తవనీయము.



ఆతఁ డుపన్యసించుచుండ 'అథీనియను'లొకవేళ నతని వాగ్ధారాసంపాతమునకు సంతసించుచు, నొకవేళ పరవశత్వము నొందుచు, కొన్ని సమయముల హృదయచాంచల్యమునకు లోనగుచు, మఱికొన్ని సమయముల దుఃఖపూరితమనస్కులగుచుందురు. ఒకప్పు డతఁడు తన వాచాలతచేత తన దేశస్థులను శౌర్యస్థైర్యాదిగుణంబు లంకురింపఁజేసి పుత్రధనయోషామిత్రసంపత్కళత్రప్రస్థానంబులను వీడఁజేసి తత్తరంబున రణాంబునకు దుముకఁజేయును. ఇటుల దన వాచాలత్వమున, సూర్యమండలము ననుసరించి తిరుగు గ్రహములవలెఁ బ్రజలతనిని బరివేష్టించి సంచరించుచుండిరి.



# శిశిరో



ఇతని తల్లిపేరు 'హెల్వియా'. ఆమె కులీనురాలు; మంచి గుణములు కలది. ఇతని తండ్రికిఁ గల యభివాదము మంచిది కాదు. అతఁడు రజకుఁడని వాఁడుక కలదు. పనిలోఁ బ్రవేశించినపుడు పేరును మార్చవలసినదని శిశిరోను స్నేహితులు వేఁడిరి. కాని యతఁడా పేరును వహించి యే కీర్తినొందెదనని బదులు చెప్పెను. ఇతఁడు క్రీ. పూ. ౧౦౬ సం॥ రమున జనవరి మూఁడవ తేదీని జననమొందెను. ప్రతి సంవత్సరము మారోజున న్యాయకర్తలందఱును చక్రవర్తి క్షేమమునకు హోమము చేసి దైవప్రార్థనఁ జేయువాఁడుక కలదు. ఇతని జననకాలమునఁ దల్లి విశేషముగఁ బ్రసవవేదనఁబడలేదు. ఇతని పెంపుడుదాదికొక ఛాయాపురుషుఁడగుపడి భాగ్యవశమున నామె పెంచుచున్న శిశువు గొప్పవాఁడు కాఁగలఁడనియు రోమపట్టణములోఁ బురుషసింహమను పేరొందుననియుఁ జెప్పెను. ఈ సోదెయొక్క సత్యమతని చేతలవలన తేటతెల్లమయ్యెను. యుక్తవయస్సున నతఁడు పాఠశాలకుఁ బంపఁబడెను. అప్పుడతఁడు మేధావియని పలువురు తెలిసికొని యతనిని దర్శించుటకు పాఠశాలకుఁ బోవుచుండిరి. బాలురచే సన్మానింపఁబడి వారిలో నగ్రాసన మతఁ





డధిష్ఠించెను. 'ప్లేటో' చెప్పిన ప్రకారము పండితునకును జ్ఞానికిని గావలసిన గుణము లతనికిఁ బట్టెను. అన్ని విద్యలను నేర్చుకొనుటకుఁ దగిన ధారణాశక్తిని గలిగియుండి యే విద్యను నతఁడు తృణీకరించలేదు. అన్నిటిలోను గావ్యరచనయం దతని కాసక్తి మెండు. కాలాంతరమున నపూనికతోఁ నవ్యామోహమును సమజేర్చి గొప్ప కవీశ్వరుఁడనియు కాక, గొప్ప వక్తయనికూడ నతఁడు ప్రసిద్ధినొందెను. భాషలో నేటికి కొన్ని మార్పులు వచ్చినను, నతని ప్రవచనీయము లిప్పటికిని శ్లాఘింపఁబడుచున్నవి. ఆతని యనంతరమున గొందఱు కావ్యనిపుణులు బయలుదేరినందున నతని కావ్యములు నీరసించి నేఁడు పేక్షఁ జేయఁబడినవి.

సాధారణముగ బాలురకుఁ బఠనయోగ్యములైన చదువు లతఁడు స్వాంతముగ నభ్యసించిన పైని విద్వాంసుఁడగు 'ఫైలో'యొక్క ప్రసంగములను వినెను. 'సెనేటు' సభాధ్యక్షుఁడును న్యాయవాదియునైన 'మూసియసు-స్కేవోలా' యనువానివద్ద న్యాయశాస్త్రము నతఁడు నేర్చెను. 'సిల్లా' యనువానియొద్ద శిక్షను బొంది శస్త్రవిద్యయం దభిలాష గలవాఁడయ్యెను. జనప్రకోపమువలన ప్రజారాజ్యతంత్రము లల్లకల్లోలముగా నుండుటచేత దేశము తుదకు నిరంకుశ రాజాధిపత్యమగునని యెంచి, శాస్త్రపరిశోధనఁ జేయుచు, విద్వాంసులతో ముచ్చటించుచుఁ, గావ్యాలాపవినోదములఁ దేలి

శ్రవణ మననములలో నతఁడు కాలమును గడిపెను. 'సిల్లా' యను నతఁడు ప్రభువై స్థిరముగఁ గొంత రాజ్యతంత్రము నిర్మాణించువఱకు నతఁడీప్రకారమున దివసములను జరిపెను.

'సిల్లా' రాజ్యాంగములను నడుపు కాలమున నతఁడు సత్కృత్యాభ్యాసమును జేయు చుండెను. కొన్నిదినములు దేశసంచారములో నతఁడు గడిపెను. ఈ దినములలో సుఖ దుఃఖములను సమముగఁ జూచుటకు కొందఱు వైరంగికులు (Stoics) బయలువెడలి యొక పాఠశాలను స్థాపించి దానిలో వారు సిద్ధాంతీకరించు చుండిరి. ఈ పాఠశాలలో 'శిశిరో' ప్రవేశించి వారి నియమములఁ గొన్నిటిని పరిగ్రహించెను. రాజకార్యములలో ప్రవేశించుట కతనికి సమయములు దొరక నప్పుడు 'ఆథెన్సు' పట్టణమునకుఁ బోయి యక్కడ శాస్త్ర శోధన జేయుచు దినములను గడపఁగోరెను.

ఇంతలో 'సిల్లా' మరణమునొందె నని వార్త శిశిరోకు వచ్చెను. ఇంతకుఁ బూర్వము దేహపరిశ్రమను జేసి దాని నతఁడు దృఢపఱచుకొనెను. అతని కంఠస్వరము తీరుగఁ గుదురుపడి కుహరాంతరాళముల నిండునటుల పూరించి మృదు మధురయుక్తముగఁ బ్రస్తావించుట కతనికి శక్తికలిగెను. రోము పట్టణములో స్నేహితు లతని నక్కడకు విజయముచేయ వలసినదని వేఁడుచు నుత్తరములు వ్రాయుటచేత నతఁ డక్కడకుఁ బోయి రాజకార్యములలోఁ బ్రవేశించుటకు సమకట్టెను.



దాని కనుగుణ్యముగఁ బ్రవచనముల నభ్యసించుచుఁ, బ్రవచ నీయుల ప్రసంగములను వినుచు నతఁ డొకదినమైనను వ్యర్థము చేయలేదు. వ్యవహారశక్తుల నుపయోగించుటకుఁ దగిన సామర్థ్యముఁ బొందవలయుననిన, వ్యావహారికునకు వాచాలత్వము తోడుగా నుండవలెనని స్మరించి తద్రూపమగు పద్ధతుల నతఁ డవలంబించెను.

అతఁడు వెంటనే మహోల్లాసముతో రాజకార్యముల లోఁ బ్రవేశించెను. మొదట వ్యవహారములను నిర్వర్తించుటలో కొంచె మతఁడు తొట్రుపాటుపడినను జాగరూకతతో పనులను జేయుచుండెను. ప్రజ లతనిని దయాళువు, పిఱికి పందయని నిరసించిరి. పుస్తకజ్ఞానము తప్ప లోకజ్ఞానము లేని వాఁడని ప్రవాదముకూడఁ గలదు. గౌరవమును బొంద వలె నను వాంఛ కలవాఁడగుటచేత నతనిని తండ్రి, స్నేహితులు ప్రోత్సాహపఱచినందున నతఁడు న్యాయవాదిగ సభ లోనికి వెళ్లెను. క్రమముగ నతఁడు వాచాలకుఁడని దేశమందంతట వెల్లడియై సమకాలీనులలో గొప్ప వక్తయని ప్రసిద్ధి నొందెను.

ఒక కాలమున క్షామము కలిగినందున నతనిని వికర్ణకునిగ (Queestor) 'సెనేటు' సభవారు నియోగించి సిసిలీద్వీపము నకుఁ బొమ్మని యుత్తరవుచేసిరి. అక్కడి ప్రజలను మొదట నట్టహాసముతో ధాన్యమును రోముపట్టణమునకుఁ బంపవలసిన

దని నిరోధించినను నతఁడు వారిని నెమ్మదిగను న్యాయముగను పరిపాలించెను. రోముపట్టణములోని కులీనులైన కొందఱు పురుషులు మితిమీఱి ప్రవర్తించుటచేత వారిని సిసిలీద్వీపమునకు సభవారు వెడలఁగొట్టిరి. అక్కడ ప్రజాప్రతినిధియెదుట వారిపక్షము నవలంబించి శిశిరో ముచ్చటించెను. ఈ మహాత్కార్యములను జేసినందు కతఁడుబ్బినవాఁడై రోములో నందఱుఁ దనను విశేషముగఁ జెప్పుకొనుచుందురని తలంచి మార్గమున వచ్చుచు నతఁడొక స్నేహితునితో నీ విషయమును గుఱించి తర్కించెను. "ఇన్నిరోజులనుండి తమ రెక్కడనుంటి" రని వాఁడు ప్రతివచనమిచ్చెను.

మహాసముద్రములోఁ జిరుచేపవలె నతని కార్యములు రోములో మునిఁగిపోయినందుకు విచారించి వాంఛలను తగ్గించుట కతఁడు సమకట్టెను. కీర్తిసముద్ర మపారమని యతఁడు గ్రహించెను. అయినను ముఖస్తుతియం దాసక్తియుఁ, గీర్తియం దపరిమితమగు కోరికయు గనుక నతని యభ్యాసాయములు కొన్ని సాగలేదు. శిల్పకారులు తమ పనిముట్లను వేర్వేరుగ గుఱ్తెఱిఁగినవిధమున రాజకార్యధురంధరుఁడు ప్రజలను వారివారి నామములతోఁ దెలిసికొనవలయును. అందుచేత నతఁడుగూడ నాగరికుల నందఱను వారి వారి పుట్టుపూర్వోత్తరములతోఁ గూడ విచారించి వారిని జ్ఞప్తిలో నుంచెను. అతఁడు దేశసంచారమునకు



గమనించినపుడు తన స్నేహితులకుఁ జెందిన గృహక్షేత్రములను నిరూపించుచుండెను.

దినచర్య గడుచుటకు తగినంత స్థితి యున్నను నది విశేషముగ లేనందున న్యాయవాదములలో నతఁడు పణమును స్వీకరించకపోవుట చిత్రముగనున్నది. కొంత స్వాస్థ్యము గలవాఁడై దాని మూలమున దేహయాత్రను సంతుష్టిగ నతఁడు జరిపెను. యుక్తాహారవిహారములు యుక్తమగు చేష్టలతోఁ గూడి రోములు, గ్రీకులులోని విద్వాంసుల గోష్ఠిని బొంది కాలము నతఁడు గమనించెను. అతని దర్శనముఁ జేయుటకు ప్రతిరోజును గొంద ఱతని గృహమునకుఁ బోవుట కలదు. రాజకీయ వ్యవహారములలో 'పాంపేయు' యనువాని కతఁడు తగినట్లు యోచనలను చెప్పుచుండెను.

అతనిని 'ప్రేటరు' అను నొక న్యాయాధికారిగ నియమించిరి. అతఁడు వ్యవహారములను నిష్కళంకముగ నిర్వర్తించెను. లంచములు పుచ్చుకొని న్యాయము నీతిపంథనుండి తప్పించి యపంథలోని కతఁడు త్రిప్పుటలేదు. మఱికొంత కాలమున కతఁడు 'కాన్సలు' అను పెద్ద న్యాయాధికారిగ నియోగింపఁబడెను. ఎక్కడనున్నను న్యాయముఁ దప్పక తన వాచాలత్వముచేత సత్యమునకు వన్నెతెచ్చి ప్రజలచేత నతఁడు మన్నింపఁబడెను. నీతిపథమును దప్పక సత్యసంకల్పముతోఁ

ప్రజల కప్రియమైనను దానినే విస్తరింపఁజేసి వారికి హితవుగ న్యాయాన్యాయములను విచారించుచుండెను.

అతని భార్యపేరు 'పెరన్షియా'. వీరి దాంపత్య మనుకూలముగనుండెను. భర్తయొక్క వ్యవహారములలో నామె సహకారిగనుండెను. భర్త త్రిశక్తియుతుఁడైనను నతని కామె మంత్రోత్సాహశక్తుల నాపాదించుచుండెను. దంపతు లిరువురుఁ బట్టణములో సన్మానమును విశేషముగఁ బొందుచుండిరి. పరులను మన్నించి వారిచేత మన్ననలను వీరు పొందుచుండిరి. ఆహితలక్షణుండును, రోషామర్షాహింసనిషేధుండును గుణాఢ్యుండును నావేగాగమ వర్జితుండును నై యతఁ డొప్పుచుండెను.

ఎంత గొప్పవారికైన కాల మొకరీతిగ గడువఁబోదు. కాలాంతరమున నతఁ డజాతశత్రు వైనను వ్యవహారరీతిని గొందఱతనిపై శత్రుత్వమును బాటించి మంచి చెడ్డలను విచారించక దేశోచ్చాటనము జేసిరి. అతని గృహములను వారు తగులపెట్టిరి. అతని స్వాస్థ్యములను రాష్ట్రమునకుఁ గలిపిరి. అతఁడు దేశాంతరగతుఁడై పరదేశములలో ప్రజలచేత సత్కరింపఁబడెను. ఈలోపున నతని శత్రువులు పదభ్రష్టులైరి. అతని కర్మ పరిపక్వమయ్యెను. పదియారు మాసములకు స్వదేశమున కతఁడు వచ్చెను. అతని రాకకు ప్రజలు రాకకువలె నెదురుచూచిరి. తలవంపులైన శత్రువులకుఁగూడ నతని రాక మేలురాక



యయ్యెను. ఇంతలోనే రాజ్యాంగములు మాఱి ప్రజాప్రభుత్వమునకు బదులుగ నేకరాజాధిపత్యమును స్థాపించిరి. స్వదేశచరిత్రను వ్రాయుట కతఁ డుద్యుక్తుఁ డయ్యెను. కాని కొన్ని కారణములచేత దానిని నెరవేర్పలేకపోయెను. భార్యాభర్తల కింతలో మనస్పర్ధలు రగిలెను. ఆమె విశేషముగ ఋణములను జేసినదని, యుద్ధమునకుఁ బోవునపు డతనికిఁ దగిన యేర్పాటు లామె చేయలేదని, తగిన సన్నాహములను జేసి కూతురి నామె తనయొద్దకు పంపలేదనియు, నిందారోపణఁ జేసి భార్య కతఁడు విడియాకు లిచ్చెను. తదనంతరమున మఱియొక కన్య నతఁడు వివాహమాడెను. ఇతని స్వగృహచరితము లిట్లుండెను.

సంసారసాగరము నీదుచు నతఁడు వార్ధక్యము నొందెను. మహాబలాహకప్రేరితంబులై సముద్రంబులుప్పొంగి సంగమించుకరణి రాజ్యాంగ తంత్రోత్పాటన సమయంబున దేశమరాజకమై ప్రజలు యుక్తాయుక్తవిచక్షణదూరులై, విదళిత మనోధైర్యములు కలవా రగుదురు. ఈ సమయములో స్వపక్ష పరపక్ష వివేచనలేక తృటికాలములో పక్షములను క్రమానురూపముగ విడుచుటయుఁ బొందుటయుఁగూడఁ గలదు. అట్టి కాలములో సపక్షమువా రతనికి శత్రువులై గృహకవాటములను భేదించి భృత్యులను విదళించి లోపలఁజొచ్చి శిరోను వాపు చిత్రవధఁ జేసిరి.

---

# మహా అలగ్జాండరు

మహా అలగ్జాండరు 'హెర్క్యులీస్' యొక్క సంతతి వాఁడు. వాని తండ్రి 'ఫిలిప్'; తల్లి 'ఒలింపియస్'. చిన్నతనములోనే వీరొకరినొకరు ప్రేమించినందునఁ గాలము వచ్చిన తరువాత వారు వివాహముఁ జేసికొనిరి. కామశాస్త్రము నుపదేశమును బొందుటకు పూర్వము తన గర్భముమీఁద పిడుగుపడి రగులుకొని మంటలు జాజ్వల్యమానముగా నలుదెసల వ్యాపించినటుల 'ఒలింపియసు' కలఁగనెను. వివాహానంతరమున రాజపత్నిగర్భము సింహముద్రాంకితము చేసినటుల 'ఫిలిప్పు'కు స్వప్నము వచ్చెను. పరిపంథి రాజచక్రంబుమీఁద నవక్రపరాక్రమమున సింహంబు కరణి లంఘించి, సముద్రమేఖలావలయిత భూచక్రంబు నిర్వక్రంబుగ నధిరోహించుటకుఁ దగిన పుత్రుఁడు కలుగునని జ్యోతిష్కులు స్వప్నఫలమును 'ఫిలిప్పు'తోఁ జెప్పిరి. అలగ్జాండరు క్రీ. పూ. ౩౫౬ సం॥ రము జూలై నెల ౬ తేదీని జననమొందెను. ఆ రోజుననే 'ఎఫీసస్'లోని 'డయానా' యను పేరుగల చంద్రదేవతయొక్క యాలయము తగులఁబడెను. అక్కడి భక్తులందఱు ఆ యాదిభౌతికాధిక్కి వెఱగంది, చిందఱవందఱపడిరి.





ఫిలిప్పు 'పోటిడయా' పట్టణమును ముట్టడించి దానిని పట్టుకొనినరోజున మువ్వురు హర్కారాలు రాజధానినుండి సుపుత్రజననవార్త నతనికిఁ దెచ్చిరి. అతని సేనానాయకుఁడు పోరాటములో జయమునొందెననియు, నతని పంచభద్రము 'ఒలింపికు' క్రీడలలో పందెము గెలిచెననియు సుపుత్రుఁడు కలిగెననియు, మూఁడు శుభవార్తల నతఁడు విని, పులకించి, చోద్యమంది, యుబ్బి 'చెలరేగెను. శిశువునకు 'అలగ్జాండరు' అనెడు నామకరణమును దండ్రి చేసెను.

దినదిన ప్రవర్ధమానముగ మహాపురుషలక్షణములు కలిగి, యతనికి యౌవనప్రాదుర్భావమయ్యెను. యుక్తకాలమున నతఁడు తగిన యొజ్జలయొద్దఁ బ్రవేశించి విద్యాభ్యాసముఁ జేసెను. రాజకుమారునకుఁ దగిన దేహమనస్సంస్కారముల నతఁడు పొందెను. తండ్రి శత్రువులపై దండెత్తి వెళ్లినపుడు సాంకేతస్థలమున ప్రధానులతో నతఁడు మంతనముఁ జేయుచుండెను. ప్రభుమంత్రోత్సాహశక్తులను గలిగి దురవగాహమైన గాంభీర్య ధైర్య స్థైర్య జేగీయమానుండై, భృత్యామాత్య సుహృద్బంధువర్గంబులో నతఁడనన్యాదృశంబుగ సంచరించెను. 'దళములు దళముగ నడచుచు। దలవంపులు చేసె వారి దళముల నెల్లన్'॥ అని విని సంతసించక "శత్రుదళములను విదళనము చేసి వారి రాష్ట్రములను స్వరాష్ట్రముతోఁ జేర్చుచు, దిగ్విజయమును జేయుటచేత నా భుజ

పరాక్రమములను జూపించుటకు తండ్రి నా కవకాశ మీయఁ"డని అలగ్జాండరు స్నేహితులతోఁ జెప్పి విచారించుచుండెను. "చతురంగబలములతోఁగూడిన నీ మహారాజ్యాధిపత్యమును బొందుటకు నే నియ్యకొనను. 'పరిపంధి రాజచక్రంబుమీఁద నవక్ర పరాక్రమంబున శిఖిశిఖాసంకాశ నిశిత శిలీముఖ నారాచ భల్లప్రముఖంబులైన బహువిధ బాణ పరంపరలఁ గురిపించి విదళిత మత్తమాతంగ తురంగరథవరూధ పదాతి యూధంబుగఁ జేసి', రణంబున నెదురులేని శౌర్యంబును బాటించి దేశపాలకుల నతిక్రమించి దిగ్విజయముఁ జేసి సామ్రాజ్యమును బొందుటకు నే నభిలషించెద"నని అలగ్జాండరు' స్నేహితునితోఁ బలికి కక్కసపడుచుండెను.

ఒకనాఁడు తండ్రి సముఖమున కొక తురగము క్రయమునకుఁ దేఁబడెను. అశ్వపాలకుల కవశ్యమై తట్టుపట్టకైన మనుజులను చేరనీయక, విచ్చలవిడిగ నది సంచరించుటఁ జూచి దానిని క్రయమిచ్చి పుచ్చుకొనుటకు రాజు సమ్మతింపఁడయ్యెను. దీనిని జూచి 'అలగ్జాండరు' "ఎంత చక్కని గుఱ్ఱమును తమరు వదలివేయుచున్నా"రని తండ్రితో పలుమారు పలికెను. అది విని రాజు "పసివాఁడవు. పెద్దలను ధిక్కరించుచున్నావు. వారికంటె దానిని నీవు వశ్యము చేసికొనఁగలవా" 'యని కుమారునితోఁ బలికెను. "అది యొంతపని?" యని కుమారరాజు నుడివెను. "నీ వొకవేళ దానిమీఁద స్వారిచేయలేకపోయిన, నీ మోటరి తనమునకు నీవేమి యొడ్డెద"వని రాజు తర్జింప, "నేను దాని వెల నిచ్చెద"నని కుమారుఁడు శాంతవచనమునఁ జెప్పెను. అప్పుడు రాజకుమారుఁడు తండ్రిసెలవుఁ గైకొని తురగమును తట్టి ప్రక్కకుఁ ద్రిప్పి, పగ్గములను స్వీకరించి, దాని నారోహించెను. ఆస్కంధిత, ధౌరిత, రేచిత, వల్గిత, ప్లుతనామాంకిత గతులలో నతఁడు దానిని నడిపించి మఱలినందునఁ బరిజనులందఱు సంతసించిరి. ఆనందబాష్పములొలయఁ దండ్రి, "నీకీ 'మాసిడన్' దేశము తగినదికాదు. నీవంటి తేజోవంతుఁడితర దేశములను భుజపరాక్రమముచేత స్వాధీనము చేసికొనవలసిన"దని పలికి కుమారునిఁ గౌఁగిలించుకొనెను.



మహామహోపాధ్యాయుఁడని పేరుబొందిన 'ఆరిస్టాటిలు'నకు కబురుపెట్టి యతఁడు దన కుమారునకు విద్యాభ్యాసము చేయింపవలసినదని ఫిలిప్పు వేఁడుకొనెను. నీతిశాస్త్ర పారంగతునిగఁ జేయుటయెగాక, యతనినిఁ బ్రగూఢశాస్త్రములలోఁగూడ 'ఆరిస్టాటిలు' ప్రవేశపెట్టెను. మొదటినుండియు వినయవిధేయతలతో గురువును శిష్యుఁడు భావింపుచుండెను. గురుశిష్యుల కత్యంతానురాగము బలిసెను. వైద్యములోఁగూడ కొంత ప్రవేశమును బొంది, మందులఁ జేయుటయం దతఁడు కుశలతఁ గలిగియుండెను.

ఈలోపున ఫిలిప్పు మొదటిభార్యను విడనాడి ద్వితీయ

కళత్రమును వివాహమయ్యెను. దానిచేతఁ దండ్రి కుమారులకు వైరము పొసఁగెను. అందుకుతోడు 'అలగ్జాండరు' తల్లి, కుమారుని తండ్రిపైకి పురికొల్పు చుండెను. ఒక రోజున, "రెండవ భార్యయైన 'క్లియోపాత్ర' యొక్క గర్భము ఫలించి, సింహాసనమునకుఁ దగిన కుమారునిఁ గనవలసిన"దని దైవ ప్రార్థనఁ జేయుఁడని క్లియోపాత్ర పినతండ్రి నలుగురియెదుటఁ జెప్పెను. "నే నౌరసపుత్రుఁడను కానని మీ యభిప్రాయము కాఁబోలు"నని యలగ్జాండరు ప్రశంసించెను. అంతలో రోషావేశకంపమానగాత్రుండై, ఫిలిప్పు చంద్రాయుధమును ఝళిపించి కుమారుని శిరస్సుఁ దెగవ్రేయఁజూచెను. దైవికముగ ఫిలిప్పు కాదంబరీరసవిఘూర్ణితలోచనుఁడై యుండినందున, నక్రమమున స్మారకముతప్పి నేలఁబడెను. "మాసిడను దేశవాసులారా, మీరు చూడుఁడు, నాలుగడుగులు వేయలేనివాఁడు ఐరోపాఖండమునుండి ఆసియాఖండమునకుఁ బోదలచినాఁ"డని అలగ్జాండరు పలికెను.

ఫిలిప్పు కాలాంతరగతుఁ డయ్యెను. సింహాసనమునకు 'అలగ్జాండరు' వచ్చెను. అప్పటి కతని కిరువదిసంవత్సరముల ప్రాయము. దేశమంతయు నల్లకల్లోలముగనుండెను. దేశములను కొట్టి స్వదేశముతో వానినిఁ జేర్చుటయెగాని, వానికి తగిన రాజ్యాంగముల నిర్మించి, వానిని స్థిరముగ ఫిలిప్పుంచలేదు. కలఁతఁజెందిన జలములలో కలుషరేణువు లనులోమవిలోమముగ సంచరించు విధమున, దేశము లానుపూర్వముగ ననుభవించుచున్న రాజ్యాంగములను మాపివేసి నూతన రాజ్యాంగములను స్థాపింపనందున, దేశవాసులు స్వాస్థ్యము లేక సంచరించుచుండిరి. ఇట్టి యరాజకస్థితిలోఁ దండ్రి కాలముఁ జేయుటయు, అలగ్జాండరు సింహాసనమునకు వచ్చుటయు జరిగెను. చతురంగబలముల నడపి, చతురోపాయముల చేత నరాజక దేశంబుల నర్థమునకును బ్రాణమునకును క్షేమం బొసంగి, అలగ్జాండరు వానికి ప్రశాంతమును గలుగఁ జేసెను. రథగజతురఁగపదాతి యూథంబుల నొక యక్షౌహిణి బలము సమకూర్చి దిగ్విజయమున కతఁడు బయలువెడలెను.



ఒక సుముహూర్తంబున మహా దంతావళంబు నధిరోహించి, 'వారాశిప్రావృత్త మేదినీవలయసామ్రాజ్యంబుఁ గైకొనుట' కతఁడు బయలువెడలెను.

> "హయహేషల్ గజ బృంహితంబులు రథాంగారావముల్ శింజినీ ।
> చయటంకారములున్ వివర్తిత గదాచక్రాస్త్రనాదంబులున్ ।
> జయశబ్దంబులు భేరిభాంకృతులు నిస్సాణాదిఘోషంబులున్ ।
> భయదప్రక్రియ నొక్కపీక నెగసెన్ బ్రహ్మాండ భేదంబుగన్"॥

ఇట్లు సునాసీరనాసీరంబులు శిరస్త్రాణంబులు ధరించి, ధ్వజంబు లెత్తి దండనాయకు లుద్దండంబుగఁ గోదండంబులు సాచి స్వదండంబుల దండించుచుఁ బ్రత్యానీకదండంబుల షండంబు లణఁచి నడువ యవన బర్బర తురుష్క పార

శీక దేశాధీశుల రణరంగంబున భంగపఱచి, జనపదములను
దాఁటి, భరతఖండమున కీశాన్యభాగముననున్న ప్రదేశమున
కలగ్జాండరు వచ్చి దండువిడిసెను. హిందూదేశపు రాజులు
మదమాత్సర్యములు కలవారై, గృహకలహములచేత నైకీ
భావము లేక 'పురుషోత్తముఁ'డను రాజునకు సహాయము
చేయనందున, నతఁ డొంటరిగ శత్రుధాటి కోర్వలేక పరా
జితుఁ డయ్యెను. క్రమముగ, తక్ష శైల కురు పాంచాల
ఘూర్జర దేశాధీశుల వంచించి, శత్రువు వారివలనఁ గప్ప
ములను బుచ్చుకొనెను. అటుల దుర్ధర్ష సమరరోషావేశం
బున, చతురంగబలంబులు దివారాత్రంబులు దేశంబులఁ
గడచి ధూపాయితులై, దిగ్విజయయాత్రను సాంతముఁ జేసి,
స్వదేశోన్ముఖగమనసన్నాహముఁ జేయవలసిన దని యొక్కు
మ్మడి చక్రవర్తిని బ్రార్థించిరి.

మార్గములో నతఁడు జయస్తంభముల నిలిపి, తన పేరిటి
పట్టణ నిర్మాణమునకు శంఖుస్థాపన మొదలైన కార్యములఁ
జేసెను. ఒక రోజున నైన నతఁడు మద్యపానముఁ జేయలేదు.
అతఁ డేకపత్నీవ్రతుఁడు; పరభాగుఁడు; శమదమాది గుణో
పేతుఁడు. ఎట్టి యంతఃకలహములు లేక, వచ్చినవారిని
సైరించుచు, సేనల నతఁడు నడిపించెను. అతఁడు పరదేశముల
లోఁ బోరాడుచు, స్వదేశ రాజ్యాంగములను బ్రవర్తింపఁ
జేయుచుండెను. తనకు లోఁబడిన మండలాధీశ్వరులను వారి



వారి పదవులలో నెలకొలిపి వారివలనఁ గప్పములఁ గైకొ
నుచు, దేశములలో క్షోభ లేకుండఁ జేయుట కతని కవకాశము
లేకపోయెను. అతని కాల మంతయుఁ బోరాడుటలోనే జరిగి
పోయెను.

జీవించిన కాలములో ననివార్యం బయిన తేజోప్రభా
వంబుచేత, దుర్ధర్షధానుష్కుఁడై యహోరాత్రంబులు సమర
సన్నాహములో నతఁడు కాలముఁ గడిపెను. కాలోచితమైన
దేశాచారములను విడువక, స్వకులధర్మంబు లాచరించుచు,
విశేషముగ భగవంతుని నతఁడు స్తోత్రముఁ జేయుచుండెను.
సంధ్యాకాలముల దేవతలకు హోమముఁ జేసి, తదుపరి నతఁడు
భోజనముఁ జేయుచుండెను. అతఁడు ప్రయాణోన్ముఖుఁడై
స్వదేశమునకుఁ బోవుచు పరరాజుల నీరాజనములఁ గైకొను
చుండు నతని నిబ శేత రాజు వశము చేసికొని క్రీస్తుపూర్వము
౩౨౩ సం॥రము జూన్ ౨౮ తేదీని తన దేశమునకుఁ దీసికొని
వెళ్లెను. ఇతని దండయాత్రమూలమున ప్రాచీన దేశములు
పాశ్చాత్యులకు వెల్లడియయ్యెను. రణశిక్షనుబొందిన పాశ్చా
త్యులు పోడువగ ప్రాచీనుల వ్యూహములు చెల్లాపచెదరై
పరారులగుదురని దేశప్రఖ్యాతి యయ్యెను. భరతవర్షమున
నతని యునికి కొద్దికాలమగుటచేత నతని దేశభాషాచార
ముల నవలంబించుటకు మనవారికి సమయము పడలేదు.
అతఁడు దేశములను విడువగానే, దేశాధీశులందఱు మార్య

వంశస్థాపకుఁడైన చంద్రగుప్తమహారాజునకు వశ్యులై, గ్రీకుల రాజ్యమునకు వ్యవధి లేనందున నది మఱఁగిపోయెను. వారి దేశభాషాచారములను మన మవలంబించి యుండినచో, నేఁడు మన యవస్థ యెటుల నుండియుండునో పరమేశ్వరునికిఁ దెలియును. ఇట్లు మేఘమధ్యమును వెలువడి వెలుంగు క్రొక్కారు మెఱుంగు తెఱంగున, గ్రీకుల రాజ్యము భరత వర్షంబునఁ బ్రకాశించెను.



# జూలియసు సీజరు

సీజెరు సామంతుల కుటుంబములో క్రీ. పూ. ౧౦౨ సంవత్సరమునఁ బుట్టెను. ఇతఁడు 'పాంపేయి' 'శిశిరోల'కంటె నాలుగు సంవత్సరములు చిన్నవాఁడు. 'కాన్సల్' అను పేరు గల యక్షుదర్శకుని యుద్యోగముఁ దన తండ్రి చేయక యే మృతినొందెను. క్రీ. పూ. ౮౧ సం॥ రములో నితని పినతండ్రి యా యుద్యోగమును చేసెను. ఇతని పితృష్వస్రయైన 'జూలియా'ను 'మేరియసు' వివాహమాడెను. సీజెరు మొదటినుండియుఁ బ్రజలపక్షమున మాటలాడుచుండెను. అందుచేత నతఁడు శత్రువుల బారినుండి తప్పించుకొని దేశాంతరగతుఁడయ్యెను. సాహసిక నావికులు కొందఱ తనిని చెఱపట్టి విడుదల సొమ్ము పుచ్చుకొని యతనిని విడచిరి. పిదప సీజెరు కొన్ని యుద్ధనావలను జతపఱచి యా సాహసిక నావికుల నోడించి, వారి నావలను, నియామకునిఁ బట్టుకొని వారికి మరణదండన వేయించెను.

ఈలోపున నతని శత్రువు లుచ్చపదచ్యుతులైరి. అతఁడు రోముపట్టణమును జేరెను. అతని మిత్రుల కమందానందము కలిగెను. క్రీ. పూ. ౭౮ సం॥ రమున నతఁడు 'స్పాని

యా దేశములో విక్రమకుఁడుగ నియోగింపఁబడి, యచటి పనుల బాగుగ నిర్వర్తించెను. క్రీ. పూ. ౬౩ సం॥ రమున సర్వాధికారియను పేరున నతఁడు కార్యములను వ్యవహరించుచుండెను. ఇంతలో ముఖ్యపురోహితుఁడు కాలము చేసినందున, సీజరాపనిలోఁ బ్రవేశించెను. అతఁడు పురోహితుఁడగుటవలన ప్రజలను దుర్వ్యాపారములలో నడువనీయఁడని వారు భయసంభ్రమములఁ బొందిరి. ఇతని సమకాలికులలో ముఖ్యులు 'పాంపేయి' 'శిశిరో' యనువారు. ఇతఁడు మహాయోధ. అనేక యుద్ధములను చేసి జయముఁ బొందెను. ఫ్రెంచి, జెర్మను, స్పానియా, ఇంగ్లాండు, ఉత్తరాఫ్రికా దేశములను ధ్వంసము చేసి, వానినుండి కప్పముల నతఁడు పుచ్చుకొనుచుండెను. కొల్లపెట్టిన ధనము నతఁడు కొనక దానిని నిలవచేసి శూరులకు బహుమానముగ నిచ్చుచుండెను.

ఉచ్ఛపదవాంఛాందోళితమానసుఁడై, రాత్రింబవళ్లు పాటుపడి, పిపాసాది బాధల కోర్చి సున్నితమైన శరీరము కలవాఁడై, యతఁడు శ్రమపడెను. సాధారణముగ తలనొప్పిచేత నతఁడు బాధపడుచుండెను. అప్పుడప్పుడతనికి మూర్ఛవచ్చుటకూడఁ గలదు. ఇట్టి సంకటము లతనిని వ్యసనపెట్టుచున్నను, దుర్వ్యాపారములు లేక యుక్తాహారవిహారములలో నతఁడు కాలముఁ గడిపెను. అన్ని కాలములలోను యుద్ధమునకు వెళ్లినపుడు పల్లకిలోగాని రథముపైనిగాని యతఁడు



శయనించుచుండెను. పగటివేళల దుర్గములను పట్టణములను శిబిరముల నతఁడు పరీక్షించుచు హర్కార్యాలు సరిగ వారి పనిని చేయుచున్నదియు లేనిదియుఁ జూచుచుండెను. అతఁడు నడుచుచున్నపుడు తాకీదులను వ్రాయుటకొరకు లేకరియు సంగరక్షకుఁడొకఁడును నతని వెంబడి పోవుచుందురు.

అతనికి బాగుగ స్వారిచేయు శక్తి కలదు. గుఱ్ఱము పరుగిడుచున్నపుడతఁడు కళ్లెములను వదలి, చేతులు ముడుచుకొని కూర్చుండును. స్వారి చేయునపుడతఁడిరువురు లేకరులు వ్రాయఁదగిన యంశములను వారికిఁ జెప్పుచుండెను. పని మిక్కుటమగుటచేత ముఖస్థముగ ప్రసంగించుటకవకాశము లేనందున స్నేహితుల కతఁడుత్తరములమూలమున ప్రశంసాంశములను వ్రాసి పంపును.

క్రమముగ ప్రాడ్వివాకుఁడుగను (Proctor) యధ్యక్షుఁడుగను (Consul) రాజకార్యములలో నతఁడు మెసలెను. ప్రభుమంత్రోత్సాహ శక్తులు కలిగి, శత్రువుల కలంఘనీయుఁడై వారి నతఁడు భంగపఱచెను. దైవముకూడ నతనికనుకూలుఁడయ్యెను. 'శిశిరో' దుస్తరణము నొందెను. 'పాంపేయి' యుద్ధములోఁ బరాభవమునొంది జీర్ణించెను. క్రీ. పూ. ౪౮ సం॥ రము అంతమగుసరికి మార్గము నిష్కళంకమైనందున, రాజ్యాంగముల నన్నిటిని స్వాధీనము చేసికొని ప్రజారంజకుఁడై యతఁడు కాలోచితముగ రాజ్యతంత్రములలో మార్పులను

చేసెను. చాలరోజులు రోముపట్టణములో నివసించుటచేత
రాజ్యతంత్రములలోని దోషముల నతఁడు బాగుగ గుర్తెఱిఁగి
వానిని శుభ్రపఱచుట కుద్యుక్తుఁడయ్యెను. అతిసూక్ష్మబుద్ధి
గలవాఁడై, యే యంశమునైన సులభముగ గ్రహించి యుచిత
ముగ విచారించును. నిరంకుశ ప్రభుత్వము కలవాఁడగుట
చేత నతఁడు లోపములను సవరించి న్యాయచట్టములను సులు
వుగ మార్చుటకు సమర్థుఁడయ్యెను.

యుద్ధములు విశేషముగ జరిగినందునను, శూరులకు బహు
మానములిచ్చుటచేతను, వృత్తిభోగులకు వార్షికములిచ్చుట
వలనను, బొక్కసములోని ధనము తగ్గెను. రు. 3,20,000
లు పరదేశీయులు వృత్తిభోగులుగ వార్షికములను పుచ్చు
కొనుచున్నందున, వారి పట్టీని పరీక్షించి యుద్ధములలో మర
ణమునొందినవారిని మినహాయించి వారి సంఖ్య నతఁడు
తగ్గించెను. తిరుగుబాటు చేయక లోఁబడినవారి నందఱి నతఁడు
రక్షించెను. మొండితేఱి మౌర్ఖ్యముగ మొద్దొడ్డినవారి నతఁడు
దండించెను. పట్టణమునకుఁ గావలసిన నీటిసదుపాయము నతఁ
డు చేయించెను. రాజమార్గములను వేయించి, కాలువలు
త్రవ్వించి రోము మహారాజ్యము నాపనము (Survey) చేయించి,
దాని పరిమితిఁ దెలిసికొనుట కతఁడొక పటమును వ్రాయిం
పించెను. ప్రాచీనాధునిక న్యాయచట్టముల నతఁడు సమన్వ
యింపఁజేసి చేర్చెను. ప్రజారాజ్యము నేకరాజ్యాధిపత్యముగ



మార్చుటకు దగిన సన్నాహము చేసెను. సర్వాధికారియై
పేరునకుమాత్రము 'సెనేటు' సభవారిని మంత్రాలోచన
లకుఁ బిలుచుచు, తమకట్టిన పనుల నెదురులేక యతఁడు సాగిం
చెను. యుద్ధములలోఁ బ్రజలు విశేషముగ మరణమునొంది
నందున ప్రజాసంఖ్య దేశములో తగ్గిపోయెను. వివాహము
లేక స్త్రీపురుషులు విచ్చలవిడిగ సంచరించుచుండిరి. అందు
చేత వివాహములు చేసికొని కుటుంబములను పోషించు
గృహస్థులకు విశేషముగ మన్ననలు కలుగున ట్లతఁడు తీర్మానిం
చెను. 'చంద్రికాసన్నిభస్ఫటికసంఘటితకుడ్యంబులును, కవాట
గేహళీవిటంకవాతాయనంబులును, వివిధవిచిత్రవిమానంబు
లును, నిరంతరసురభికుసుమఫలభరితపాదపమహోద్యానంబు
లును' కలిగి రోముపట్టణ మతని కాలములోఁ బ్రకాశించెను.

సీజరు చేసిన మహత్కార్యములలో పంచాంగ (Calender)
సంస్కరణ మొక్కఁడుగ భావించవలెను. రోమనుల సంవత్సరము
చాంద్రమానము ప్రకారము 3౫౫ రోజులు కలది. దీనిని సూ
ర్యమానముతో సరిజేర్చుటకు ప్రతి మూఁడవ సంవత్సరము
లో నొక యధికమాసమును వారు వేసికొనుచుండిరి. ఇట్టుల
జేయుచుండినను, సూర్య చంద్రమానములు సరిపడనందున
నతఁ డలగ్జాండ్రియా పట్టణములోని ప్రసిద్ధ జ్యోతిశ్శాస్త్ర
జ్ఞుఁడగు 'సాసీజనూస'ను వానిని పిలిపించి వానిచేత పతకశుద్ధిని
జేయించెను. సంవత్సరమునకు 3౬౫ రోజులని నిగణించుటకును

బదులుగ, నాటినుండి ౩౬౫ రోజులు గలదిగ వాడుక కలిగెను. సూర్యమానము ప్రకారము ౩౬౫ రోజులు గణించవలెను. అందుచేత నాలుగు సంవత్సరముల కొకపర్యాయము ఫిబ్రవరి నెలలో నొక రోజును కలుపు వాడుక నేటివఱకుఁ గలదు.

ఈ పనులలో నుండుటచేత నతఁ డొకరి దర్శనము చేయుటగాని యితరు లతని దర్శించుటగాని జరుగుటలేదు. అంతలోనే ప్రజ లసంతుష్టినిఁ జెంది, యతనిని నిర్లక్ష్యముగఁ జూడ నారంభించిరి. ధనికులు సహిత మతనిపేరు చెప్పిన మండిపడుచుండిరి. ఇందుకు తోడుగ నతఁడు రాజని పిలిపించుకొనుట కిచ్ఛకల దని యొక వదంతి కలిగెను. ప్రజా రాజ్యసంబంధ నాణెములమీఁద నతని శిరోముద్ర వేసి వ్యాపారములోనికిఁ దెచ్చిరి. 'సెనేటు' సభవా రతని యంగ రక్షణకు బాధ్యత్వను వహించిరి. అతని రాకపోకల సమయమున రాజలాంఛనములు జరుగుచుండెను. ఇన్ని మర్యాదలు పొందుచున్న నతఁడు వ్యసనగ్రస్తుఁ డయ్యెను. పట్టాభిషేకమును పొంది కిరీటమును ధరింపవలెనని యతఁడు కోరుచుండెను. రాజలాంఛనములను జూపుటకుఁ బ్రజ లిష్టపడిరి కాని అతఁడు రాజచిహ్నముల ధరించుటకు వా రిష్టపడ లేదు. అందువలన, 'బ్రూటసు' అనువాఁడు నడుముకట్టి యితరుల సహాయముచేత నొక కుట్రను పన్నెను. ఈలోపుగ సీజేరునకుఁ గొన్ని దుస్స్వప్నములు వచ్చెను; వినికిడివలన జరుగుచున్న కుట్ర



సంగతి యతనికిఁ దెలిసెను. ఎంతవారికైననుఁ గాల మవిలంఘనీయము!

ఒక రోజున 'బ్రూటసు' వచ్చి "ఏలినవారి కోరిక ప్రకారము పెద్దలందఱు తమరికి పట్టాభిషేకముఁ జేయుటకు సిద్ధముగ నున్నారు. స్వప్నములను శకునములను సరకు సేయక తమరు విజయముచేయవలె"నని సీజేరుతో మనవిచేసెను. వెంటనే యతఁ డుత్తరీయమును (Toga) ధరించి పల్లకీలో కూర్చొని సభామండపమునకుఁ బోవుచుండ, ప్రజలు గుంపులు గుంపులుగ నతని వెంబడించిపోయిరి. కుట్రసంగతి మార్గములో తెలుపుట కతనియొద్దకు కొందఱు వెళ్లఁ దలచినను, జనసమ్మర్దముచేత వారు సమీపింప లేకపోయిరి. సభామండపమునకుఁ బోయి యతఁ డున్నతాసనము నధిష్ఠించెను. వెంటనే రాజద్రోహులు గుమిగూడి వారి వారి మిథ్యావిజ్ఞాపనల నొసఁగుచు మూఁడి మనవిచేయసాగిరి. ఇది చూచి యతఁ డాసనమునుండి లేవఁబోవ ద్రోహులలో నొకఁ డతని యుత్తరీయమును పట్టి దిగలాగెను. ఇతరులు వారి వారి ఛురికములతో నతనిని పొడువసాగిరి. కొంతవఱకు వారి బారినుండి తప్పించుకొనెనుగాని 'బ్రూటసు'ను జూచి యతఁడు కండ్లు మూసికొనెను. ఇతఁ డతని పరమమిత్రుఁడు. 'నీవుకూడ వీరిలోఁ గలసితివా' యని సీజేరు బ్రూటసుతోఁ బలికి, యిరువదిమూఁడు గాయములు తగిలినందున, దుర్బలుఁడై పాంపేయియొక్క శిలాప్రతిమ సమీపమున

నేలఁగూలెను. ఆ కాలమున భూమండలములో మహాపురుషుఁడని ప్రసిద్ధికెక్కిన జూలియసు సీజేరు దుర్మరణము నొందెను. లాటిను భాషను స్వచ్ఛముగ నుచ్చారణఁ జేయుట కతనికి శక్తికలదు. అంత విశేషముగ లేకపోయినను, కొంచె మతఁడు వక్తృత్వము కలవాఁడని చెప్పవచ్చును. సీజేరు భాష్యములను నేటివఱకును జదువుట కలదు. దండ నాయకులలో నతఁడగ్రగణ్యుఁడు. మహా మంత్రులలో నతనికి మించినవారు లేరు. అతఁడు చేయవలసిన పనులలో నపజయము నెన్నఁడుఁ బొందలేదు. డాంబికము, మనోగర్వములు లేనందున నతఁడు మహా పురుషుఁడని చెప్పవచ్చును. అతఁడగ్రామ్యుఁడు, అగ్రీయుఁడు. శరీరము వ్యాధులచేతఁ గృశించినను, నతఁడలంకర్తయై యుండెను. కాలధర్మము ననుసరించి యతఁడనుకుఁడు, నిశాటుఁడుగ నుండినను పరులతని నిందించలేదు. యుద్ధములో ననేకమందినిఁ జంపి కొందఱిని పట్టి కట్టి తెచ్చినను, నా కాలపు బుద్ధిమంతులు దాని నొక తప్పిదముగ నెంచలేదు. చేయఁబూనిన కార్యమును చతురోపాయముగ మనశ్శంకలు లేక యతఁడు నిర్వర్తించెను. శత్రువులకు శృంగభంగము చేసి వారికి శిరచ్ఛేదము చేయక యతఁడు ప్రసాదించెను. వ్యవహారముల పొందికచేతఁ గాలాంతరమున ప్రజారాజ్యము కీలు వదలి, యేకరాజ్యాధిపత్యమునకు సందునిచ్చెను. ఈతరములోఁ గాకపోయినను, నితని మేనకూఁతురుయొక్క



కుమారుని కాలములో మహారాజ్యాధిపత్యము స్థాపింపఁబడెను. సీజేరునకు సంతతి లేనందున మరణానంతరమున నతని మేనకూఁతురి కుమారుఁడు 'అగస్టసు సీజేరు' రాజ్యమునకు వచ్చి రాజలాంఛనములనే కాక రాజచిహ్నములనుగూడ ధరించి పట్టాభిషిక్తుఁడయ్యెను.



# ఆల్సిబియాడీసు

ట్రోజను యుద్ధములోఁ బ్రసిద్ధికెక్కిన 'అజాక్సు' అను వాఁడితని వంశమునకు మూలపురుషుఁడు. ఇతని తల్లిపేరు 'దినోమాచి'; తండ్రి 'క్లినియసు'. ఇతఁడు 'ఆర్టిమీషియమ్'వద్ద జరిగిన నౌకాయుద్ధములోఁ బోరాడి పేరుఁబొందెను. ఇతఁడు 'పెరికిలీసు' సంరక్షణలో నుండెను. 'నిసియసు', 'డెమాస్తనీసు' ఇతని సమకాలికులు. మహామహోపాధ్యాయుఁడైన 'సోక్రెటీసు' ఇతనిఁ బ్రేమించుటచేత ఇతనికిఁ గీర్తివచ్చిన దని చెప్పుదురు.

బాల్య యౌవన కౌమారావస్థలలో నితని రూపలావణ్యము లాసేచనములు. అతఁ డస్ఫుటముగ మాటల నాడుటచేత, ప్రసంగములు రమ్యముగ నుండి మనుష్యుల నాకర్షించుచుండెను. మొదటినుండియు నతని నడవడిక లేకరీతిగ నుండ లేదు. ఆతని భోగభాగ్యములు వృద్ధిక్షయములొందఁ దదనుగుణ్యముగ నవియు మారుచుండెను. అతఁడు మనోవ్యాపారములకు లోఁబడెను; ఎదిరించి పోరాడి జయము నొందవలయునను కోరికఁ గలవాఁడు. మల్లయుద్ధములో నతఁడు నేలకు ద్రొబ్బఁబడినప్పుడు, పట్టువదలించుకొనుటకు శత్రువుయొక్క





వ్రేళ్లను కొరుక, వాఁడు 'ఆడుదానివలె కఱచుచుంటి'వని యెత్తిపొడువ, "లేదు, సింహమువలె"నని అతఁడు జబాబు చెప్పెను.

ఒక రోజున నతఁడు బాలురతో వీధిలో పాచికలాడుచుండ బండి తోలుకొని యొకఁడు వచ్చి వీరిని దారి యొసల మనెను. అతఁ డప్పుడు పాచిక వేయవలసిన సమయము. బండివాఁడు మోటుతనమున గుఱ్ఱముల నదరి వచ్చుచుండ బాలురందఱు నోసరిలిరిగాని యతఁడు మార్గమున కడ్డుగా పండుకొనెను. వాఁ డదిచూచి భయపడి శకటమును నిలిపెను.

విద్యార్థిగ నుండుకాలమున నతఁడు వేణుగానమును నేర్చుకొనుట కిష్టపడలేదు. మురళీగానము సేయువా రుచ్ఛ్వాస నిశ్వాసముల నరికట్టి మాటలాడుటకు వీలులేదు. వైణికులు గాత్రముచే పాటను వినికిడి చేయఁగలరు. "మేమాథెన్సు పట్టణమువారము, వేణుగానమును నేర్చుకొన"మని యతఁడు పలికినందున నతనివలె నితర బాలురుకూడ దానిని మానిరి.

పెద్దలందఱు అతని స్నేహమును గోరి యతనివద్దకు వచ్చుచుండిరి. అతని సుందరవిగ్రహమును జూచి వారు తనివిఁ బొందలేదు. ధనికుఁడు గనుక నతనిని పరులు చెఱుపుదురను భయముచేత నతని మనోవ్యాపారములు విచ్చలవిడిగ సంచరింపకుండునట్లు వానిని 'సోక్రెటీసు' నిగ్రహించెను.

అందుచేత నతఁడు మంచిమార్గమునకు వచ్చి యుక్తాయుక్త విచక్షణత గలిగియుండెను. అతఁడు 'సోక్రటీసు'ను గురువుగ భావించెను. దైవాధీనమువలన నట్టి గురువు సంప్రాప్తుఁడయ్యెనని యతఁడు సంతసించెను. సద్గురువులు దొరకుట దుర్లభము; దొరికినపుడు వారి యనుగ్రహమునకుఁ బాత్రులగుట కష్టతరము. వారి యనుగ్రహము కలిగినపుడు వారియుపదేశముల ననుసరించి నడచుట కష్టతమము. సర్వకాలముల యందతఁడు గురుసన్నిధానమున వర్తించెను. అతఁడతనితోఁ గలిసి భోజనము సలిపి యతనితో మల్లయుద్ధము సేయుచుండెను. గురువునుతప్ప తదితరుల నతఁడు లక్ష్యము సేయలేదు. గురువునకుఁ దెలిసిన యంశము లాకాలములో నెవ్వరికిఁ దెలియవని యతఁడూహించెను. స్నేహితులతనిని సన్మార్గము నుండి తప్పింపఁజూచినను గురువున కతఁడు భయపడి వారి బోధలకుఁ జెవియొగ్గలేదు. ఒకవేళ విషయములకు లోఁబడినను నిప్పుతగిలి యినుముకరఁగి తదుపరి చల్లారి గట్టియగువిధమున 'సోక్రటీసు'చేత మందలించఁబడి యతఁడు మనోబలము నొందుచుండును.

ఒకరోజున నతఁడు పాఠశాలకుఁ బోయి ప్రాచీనకవియైన 'హోమరు' వ్రాసిన కావ్యము నిమ్మని యుపాధ్యాయుని నడిగెను. అతఁడా గ్రంథము లేదని చెప్పినందున వానినొక లెంపకాయ వేసి వెళ్లిపోయెను. మఱియొక యుపాధ్యాయుం



డా గ్రంథమును సవరణఁజేసి యుంచితినని చెప్ప 'ఓహో! మీరు బాలురకుఁ జదువు చెప్పెదరా? హోమరును సవరణఁ జేయు శక్తిఁగల తమరే బాలురకు విద్యాభ్యాసము చేయఁదగినవా'రని ఆల్సిబియాడీసు పలికి యతనికి వందనము చేసెను.

ఒక పర్యాయము గురుశిష్యులు కలిసి యుద్ధమునకు వెళ్లిరి. అందులో శిష్యుఁడు గాయము తగిలి పడిపోయినందున గురు వతనిని రక్షించి శత్రువును శిక్షించెను. యుద్ధము ముగిసినపిదప 'సోక్రటీసు'న కీయుటకు బదులుగ నతని ప్రేరణమున వీరకిరీటమును ప్రజలు శిష్యున కిచ్చిరి.

ఒకసమయమున బాలురతోఁ గలిసిపోవుచు వారి ప్రోత్సాహమున నిష్కారణముగ నతఁ డొకనికొక లెంపకాయ వేసెను. అందుకు వాఁడు గినిసి యీ దౌర్జన్యమును గ్రామమంతట చాటెను. మఱునాఁ డుదయమున నతఁడు వాని యొద్దకుఁ బోయి తనను శిక్షించవలసినదని దుస్తులుతీసి వాని యెదుట నిలువఁబడెను. వాఁడందుకు సంతసించి యతనిని క్షమించెను.

అతఁడు భార్యతోఁ బొత్తులేక పరస్త్రీలతోఁ సంచరింప నామె స్వపితృగృహమునకుఁ బోయి విడియాకులీయఁదలఁచి గ్రామపురోహితుని సమీపించెను. అప్పుడతఁ డా సంగతిని విని, పరుగిడి యామె నెత్తుకొని రాజమార్గమున వచ్చి స్వగృహా

మును చేరెను. నాఁడు మొదలు దంపతు లిరువురు సఖ్యతగ నుండిరి. కొంతకాలమున కామె మరణమునొందెను.

అతనివద్ద మంచి కుక్క యొకటి యుండెను. సొగసైన దాని పుచ్ఛము నతఁడు కోసివేసెను. ఈ సంగతి గ్రామస్థులు విని నవ్విరి. 'ఎందు కట్లు జేసితి'వని కొంద ఱడుగ 'మీరు పరిహసింపవలసిన దని చేసితిని. ఇంతకంటె హెచ్చు దుర్మార్గము చేసితి నని మీరభిప్రాయపడఁగూడ'దని యతఁడు సమాధానము చెప్పెను.

అతనివద్ద మంచి గుఱ్ఱములును రథములును ఉండెను. 'ఒలింపికు' క్రీడలలో నవి మూఁడు నాలుగు పందెములను గెలిచెను. దేశములో వీనిని విశేషముగఁ గలవాఁ డతఁడేగాని పరులు లేరు. క్రీడలకు వాని నధికముగఁ బంపువాఁ డతఁడే.

దాతృత్వమునం దతనికి సమానులు లేరు. బీదలకును సాధువులకును రెండు చేతుల నతఁ డిచ్చుచుండెను. ఇచ్చిన సొమ్ముకు లెక్కలేదు. పుచ్చుకొనిన వారికి పరిమితి లేదు. ఏ విధానమును లేక నిధానముగ దానములను వితానముగఁ జేయుచు ఘనులను మించెను.

కులశీలములు కలిగి ప్రజ్ఞావంతుఁడై బంధుమిత్రవర్గంబుల సంసర్గియుంబుతో నతఁడు ప్రకాశించుచుండెను. రాజకీయవ్యవహారములలో నతఁడు ప్రవేశించుటకు మార్గములు నిష్కంటకముగ నుండెను. త్రిశక్తులు గలిగి దురవగాహమైన



ధారణాశక్తి గలిగి వాచాలత్వమున నతఁడు ప్రజలను బరవశులఁగఁ జేయుచుండెను. అతని దుర్వ్యాపారములను మాత్రము వారు సహింపలేదు. మద్యపానము జేసి పరస్త్రీల రతిలోఁబడి మునుఁగుచుఁ దేలుచు నతఁడు కొంతకాలము వ్యర్థము చేసెను. వేషభాషలలోఁగూడ నతఁడు శృంగారపురుషుని వలె సంచరించెను. ఇట్టి పురుషుని వైఖరి ప్రజారాజ్యములోని ప్రజల కంతగ నిష్టము లేకపోయినను నతనిని వారు మన్నించుచుండిరి. 'ధనమూలమిదం జగత్తు'ను న్యాయము సుప్రసిద్ధమయ్యెను.

భోజనకాలమున నతని గృహములో వీరభద్రపళ్లెరములను వాడుకొనుట కలదు. సహపంక్తిని నెప్పుడును బదుగురకు తక్కువ లేక యతనితో స్నేహితులు భోజనము చేయుచుండిరి. అతిథి యభ్యాగతుల నతఁ డెన్నఁడును పొమ్మని చెప్పలేదు. ఇట్టి సుగుణ దుర్గుణ సంసర్గము గలవాఁడగుట నతనిని ప్రజలు ప్రేమించి యతని దుర్గుణములను బాలచేష్టలని భావించి సహించిరి.

'పెరికిలీసు' కాలధర్మమునొందినందున 'ఆథెన్సు' పట్టణములో వ్యవహారములను నడుపుటకు సమర్థుఁడు లేకపోయెను. అథీనియనులు సిసిలీద్వీపముపైకి దండెత్తిపోవలెనని సమకట్టిరి. 'ఆల్సిబియాడీసు' వారిని ప్రోత్సాహపఱచెను. వారందుకు సమ్మతించి నిసియసును నతనిని నౌకానాయకులుగ

నియమించిరి. దండు బయలు దేరుటకు సిద్ధముగ నుండెను. 'బుధుఁ'డను దేవునియొక్క ప్రతిమలన్నియు తునకలు చేయఁబడి యుండెను. ప్రజలందఱు ఖిన్నులైరి. ఈ దౌర్జన్యమును 'ఆల్సిబియాడీసు' చేసెనని యతని శత్రువు లపవాద వేసిరి. యుద్ధమునకుఁ బోవు సమయము గనుక వా రప్పు డతనిని విమర్శింపక దండుతోఁ బోనిచ్చిరి. ఈ యపవాదను పోగొట్టవలసిన దని వారి నతఁడు ప్రార్థించెను గాని వా రందుకు సమ్మతించలేదు. నావలతోఁ గూడ నతఁడు బయలు దేరి సిసిలీద్వీపమునకుఁ బోయెను.

ఈలోపున ప్రజ లీ యపవాదమును బరిశీలించి బంధుమిత్రవర్గంబులనుబట్టి కట్టి శిక్షించిరి. అతనిమీఁద వారు నేరస్థాపన చేసిరి. అతనినిపట్టి శిక్షించక దండుతో పోనిచ్చినందుకు వారు వగచుకొనిరి. సేనను విడిచి వెంటనే రావలసిన దని వారతనికి వర్తమానముఁ బంపిరి. సిసిలీద్వీపములో యుద్ధము సాంతము కాలేదు. సేనలను విడిచి యతఁడు బయలుదేరెను. అతఁడు విగ్రహములను ధ్వంసము చేయుటయే కాక పురోహితుల వేషము వేసికొని వారిని వ్యధికరణము చేసెననియు నిందారోపణం జేసిరి. అతనిని చండాలునిగఁ బ్రకటనచేసి యతని యాస్తిని జప్తుచేసి రాష్ట్రమునకుఁ గలిపి ప్రజలతనికి మరణదండన విధించిరి. ఈ సంగతుల నతఁడు విని స్వగ్రామమునకు వెళ్లక 'స్పార్టా' యను పరరాజ్యములోని పట్టణము



నకు వెళ్లెను. అక్కడ వా రతనిని మర్యాదగఁ జూచిరి. స్పార్టనుల వేషభాషలను వారి యాచారములను నతఁ డవలంబించి వారికి స్నేహపాత్రుఁ డయ్యెను. వర్తమానములచేత నతఁడు మహాకులీనుఁ డని వా రంతకు పూర్వము విని నందున నతనిని వారు మన్నించిరి. ఆ దేశపు రాజతనినిఁ జూచి మత్సరముచేత జంపుటకుఁ బ్రయత్నించెను. ఆ సంగతి తెలిసికొని యతఁ డక్కడనుండి పరారియయ్యెను. పారసీక దేశపు ధనికుఁ డొకఁడు దైవికముగ వచ్చినందున మైత్రి కలిపికొని యతనితో కలిసి లేచిపోయెను. అథీనియనులు స్పార్టనులు పోరాడుచున్న సమయమున నీ పారసీక దేశస్థుఁడు స్పార్టనులకు సహాయము చేయుటకు వచ్చెను. స్పార్టనులు మంచివారు కారని యతనితో చెప్పి వారికి విశేషముగ సహాయము చేయఁగూడదని యాతనితో 'ఆల్సిబియాడీసు' పలికెను. అథీనియనులు యుద్ధసమయమున శూరుఁడైన 'ఆల్సిబియాడీసు' లేఁడని విచారించిరి. ఆ సంగతి నతఁడు విని మంత్రతంత్రములు చేసి పారసీకదేశస్థుని యథీనియనులపక్షము నవలంబించునట్లు చేసెను. వారిలో ద్రోహుల గొందఱను పట్టి స్వదేశీయుల కతఁ డప్పగించెను. ఈ యుద్ధములో నథీనియనులు గెలిచిరి.

ఇంత కాలమునకు స్వదేశమునకుఁ బోవలెనని యతఁడు యత్నించెను. మహా వైభవముతో నతఁడు స్వగ్రామమును చేర నతనిని దర్శించుటకుఁ బ్రజలు గుమిగూడిరి.

పడిన కష్టములను వారితో నతఁడు చెప్పి గ్రహపాటుచేత నవి కలిగెనని యతఁడు పలికెను. కొంతవఱకు వారు విచారించిరి. ఏరోజున నతఁడు స్వగ్రామమును చేరెనో నారోజు 'మినేర్వా' దేవతయొక్క నిజరూపదర్శనదిన మయ్యెను. ఆరోజున వారు దేవతను చూచుటకు వీలులేదు. అతఁడా దినమున విజయము చేయుటచేత శుభసూచకము కాదని వారు తలంచిరి.

ఇంతలో స్పార్టనులకు అథీనియనులకు తిరుగ జగడము వచ్చెను. స్పార్టనులు రాజ్యాధిపత్యములోనివారు. అథీనియనులు ప్రజారాజ్యములోనివారు. వీరు మైత్రితో నుండుట దుర్లభము. వీరి ప్రజారాజ్యమును మాపివేయవలెనని వారు కోరుచుండిరి. కాని శూరుఁడైన 'ఆల్సిబియాడీసు' జీవించియున్నంతవఱకది సమకూడదని యెంచి వారతనిని, యమమందిరమునకుఁ బంపుటకుఁగాను కొందఱి దుష్టులను సన్నద్ధము చేసిపంపిరి.

అతఁ డప్పుడొక చిన్నగ్రామములోఁ దనప్రియురాలితోఁ గలిసియుండెను. ఒకనాటిరాత్రి తాను తన ప్రియురాలి వస్త్రములను ధరింప నామె వచ్చి తన్నుఁ గౌఁగిలించుకొని, తన ముఖమును స్త్రీముఖముగ దిద్దినటుల నతఁడు స్వప్నముఁ గనెను. అతని నెదిరించుటకు భయపడి ఘాతకులతని గృహమునకు నిప్పు ముట్టించిరి. అప్పు డతఁడు బట్టలు



తీసి, మంటమీఁద వేసి, యవి ముట్టుకొనులోపున ఖడ్గము ధరించి బయటకు వచ్చెను. ఘాతకులతనిని జూచి చెదరిపోయి దూరమునుండి బాణములను ప్రయోగించినందున నతఁడు నేలవ్రాలి మరణము నొందెను.

సుగుణ దుర్గుణ సంపత్తిఁ గలవాఁడై విచ్చలవిడిగ సంచరించి నీతిమార్గము నవలంబింపక స్వదేశీయులకు మేలు కలుగఁ జేయుటకు బదులు వారికిఁ గోపముఁ గలిగించి వారిచేత నతఁడు నిందింపఁబడెను. మంచికాలములోనుండి యుక్తాయుక్త విచక్షణత లేక నడచినందున నతఁడు దుర్మరణము నొందెను.



# కోరియలేనస్సు

———o———

రోములోని కుటుంబములలో ‘మార్సి’ కుటుంబము వారు మహా కులీనులు. కోరియోలేనస్సు ఈ కుటుంబము వాఁడు. చిన్ననాఁడు తండ్రి మరణము నొందినందున నతఁడు తల్లి సంరక్షణలో నుండెను. తండ్రి మరణముచేతఁ గొన్ని నష్టములు కలిగినను, సజ్జనుఁడై ప్రతిష్ఠను సంపాదించుటకుఁ బురుషునకు వీలగును. దుర్జనులు కొందఱు దానిని కారణముగ నెన్నుదురు. సాగులేని సారవంతమైన క్షేత్రములోఁగాబు పెరిగిన విధమున శిక్షలేని మహా కులీనుల హృదయములలో దుర్గుణములు బయలువెడలు నను నీతివాక్యమున కతఁడు తార్కాణముగ నుండెను. అతఁడు మనోధైర్యమును నిశ్చలబుద్ధియుఁ గలిగి ఘనకార్యములను జేసి ఘనత వహించెను. అతఁ డింద్రియవ్యాపారములకు లోఁబడి, కలహశీలుఁడై మాఢ్యముగ సంభాషించుటచేత నతనిని పరులసహ్యించిరి. నిశ్చలబుద్ధితో సుఖదుఃఖముల ననుభవించిన న్యాయాన్యాయవిచక్షణుండును, నబ్ధిగంభీరుఁడును మితాహారుఁడును అని యతఁడు స్తోత్రము నందినను, ప్రజారాజ్యములోని సభలలో నతఁడు సాటోపముగ మాటలాడి దురాచారముగ నడ





చినందునఁ బరులతనిని నిందించిరి. లోకజ్ఞానమువలన మనుజులకు సుశీలత గలుగును, సమవర్తనము వర్తించును. ఆ కాలములో రోమనులు క్షాత్రధర్మమును మన్నించుటయేగాక, ధర్మమన క్షాత్రధర్మమే యని యభిప్రాయపడియుండిరి.

మొదటినుండియు ‘కోరియలేనస్సు’ యుద్ధమునందు సంచరించెను. చిన్నతనములో నతఁ డందులకుఁ దగిన యాయుధముల నెత్తి దించుచుండెను. శరీరముఁగూడ సాము చేయుటచేత సళాకువలె సాగుచుండెను. అన్నివిధములైన గరిడీవిద్యలలో నతఁ డారితేరెను. కత్తిసాము, మల్లయుద్ధము, ముష్టియుద్ధములలో నతఁడు పరిపాటుపడెను. అతఁడు మల్లయుద్ధవిశారదుఁడు. అందులో నతనిని మించినవారు లేరు. బరువుగల మనుష్యుఁడగుటచే నతని నెవరును నెదిరింపలేకపోయిరి. అతఁడు శీఘ్రకాలములో మహావీరుఁడను పేరుఁ బొందెను.

స్వల్పబుద్ధి కలవారికి శీఘ్రముగఁ గీర్తివచ్చిన యెడల వారు దానితో సంతుష్టి నొందుదురు. అంతటితో వారిపని సరి. ఉదారబుద్ధి కలవారికిఁ గీర్తివచ్చిన యెడల వారంతటితో సంతృప్తిఁ జెందక చేసినవానిని చేయఁబూనినమహత్కార్యముల కభిజ్ఞానముగ నుంచుకొని ముందుకు నడచెదరు. కోరియలేనస్సుపైఁ జెప్పఁబడిన రెండవపక్షములోనివాఁడు. ఆ కాలమున రోమనులనేక యుద్ధములలో మెలంగుచు

చున్నందున, ప్రతిదానిలో నతఁడు శౌర్యమును గనపఱచి బహూకరింపఁ బడుచుండెను. ఒకదానికంటె నొకటి యధిక మయ్యెను. పదులు కీర్తిని సంపాదించుటకు ధైర్యమును జూపి న, తల్లికి సంతోషముఁ గలుగఁ జేయుట కతఁడు శౌర్యముఁ జూపెను. ఆమె యాజ్ఞానుసార మతఁడు పెండ్లియాడి భార్యా పుత్రాదులతో నామె యింటనే యుండెను.

ఈ సమయములో 'సెనేటు' సభవారికిని బ్రజలకును నంతఃకలహములు పుట్టెను. ఋణదాతలు ఋణగ్రస్తులను బాధించుచుండిరి. అందుచేత ఋణగ్రస్తులు యుద్ధములో సహాయము చేయమనిరి. వారి బాధలను నివృత్తి చేసెదమని సభవారు చెప్పి వారిని యుద్ధమునకుఁ దీసికొనిపోయి, తదుపరి వారి మాటప్రకారము సహాయముఁ జేయనందున వారొక్కుమ్మడి రోముపట్టణము నదలి పైదేశములకుఁ బోవ యత్నించిరి. వారిని శాంతముఁ జేయవలసినదని కొందఱును, కూడదని కోరియలేనస్సు మొదలగువారును సభవారికి సలహా యిచ్చిరి. సభవారేమి చేయుటకుఁ దోఁచక 'అగ్రిప్పా' యనువానిని సంధి చేయుటకు ప్రజలయొద్దకుఁ బంపిరి. 'అగ్రిప్పా' వారికి ప్రశాంతివచనములఁ జెప్పి, "పూర్వకాలమున నవయవము లన్నియు జీర్ణకోశముపై తిరుగఁబడెను. అది సోమరిగ నుండుటయు, పనిపాటలు తాము చేయుటయుఁ జూచి కినిసి యవి తమతమపనుల మాని వేసెను. కొంతకాలమున కవియు జీర్ణిం



చెను. అప్పుడు జీర్ణకోశము వానిఁ జూచి 'మీరు మందబుద్ధి గలవారు. పదార్థములను మీరు తెచ్చి నాయెదుటఁ బెట్టిన నేను వానిని పక్వము చేసి, రక్తముగ మార్చి, దానిని నాళముల ద్వారా మీకుఁ బంపుచుందును. అందుచేత మీరు బలము కలిగి వర్తించుచున్నారు. నేను సోమరిగ నుండ లేదని మందలించినపైని యవయవములన్నియు తమతమ పనులను నిర్వర్తించుచుండెను. మీరుఁగూడ నా యవయవములవలె మందబుద్ధి గలవా"రని ముచ్చటించి వారి కోపమును మాన్పెను. ప్రజలు వారివారి పనుల ననుసరించి వెళ్లిరి; రెండవ పర్యాయముఁగూడ వారు యుద్ధమునకు సహాయులై వెళ్లిరి. ఇందులో వారు శత్రువులకు వీపుచూపి పరుగిడుచున్నప్పుడు, వారిని సమావేశము చేసి మఱలించి యుద్ధమునకుఁ దీసికొనిపోయి 'కోరియలేనస్సు' జయమును బొందెను. ఇటుల 'కోరియొలి' యను పట్టణమును పట్టుకొనినందున నతనికి 'కోరియలేనస్సు' పౌరుషనామము కలిగెను. విజయమును బొంది వారు రాజధానిం జేరిన మఱుచటిదినమున 'కోరియలేనస్సు'ను వేనోళ్ల గొనియాడి సన్మానించి బహువిధముల సత్కరించిరి. కొల్లపెట్టి తెచ్చిన ద్రవ్యములో నొక దశాంశమును నొక శ్వేతాశ్వమును నతనికి బహుమానముగ వారిచ్చిరి. అప్పుడతఁడు సభలో లేచి 'నా విజ్ఞాపన యొకటి యున్నది. దానిని తమరు మన్నించవలెను. శత్రుపక్షములోని వాఁడొకఁడు నాకతిథిసత్కారము

చేసినందున వానిని విడుదల చేయవలసిన'దని సభవారిని ప్రార్థించెను. వారందుకు సమ్మతించి యటులచేసిరి. అప్పుడు జయశబ్దములు మ్రోగెను. ప్రజలు సంతసించిరి. ఈర్ష్యాళురు సహిత మతనిని గౌరవించిరి.

ఇంతలో క్షామము వచ్చెను. ప్రజలకు తినుటకు కూడు లేకుండెను. పదార్థములను కొనుటకు ధనము నిండుకొనెను. అవికూడ సమృద్ధిగ లేకుండెను. దీనికిఁ గారణము ధనికులను ప్రాకృతజననాయకులు వదలివేయుటయే. ఈలోపున 'వెలిత్రి' పట్టణవాసులు పరాభవము నొందినటుల రాయబారులు వచ్చి సభవారితోఁ జెప్పి యా పట్టణము నిర్మానుష్యముగ నుండుటచేతఁ గొందఱి ప్రజల నక్కడకుఁ బంపవలసిన దని వారు వేఁడిరి. ఆప్రకారము కొందఱు సామంతులును సంసారులును బీదలును నా పట్టణమునకుఁ బోవలసినదని సభవా రుత్తరువు చేసిరి. ఈ ప్రకారము చేసిన దుండగీండ్రచేత విడువఁబడి పట్టణము స్వాస్థ్యముఁ బొందు నని సభవా రభిప్రాయపడిరి. ప్రాకృతజననాయకులు ప్రజలను పురికొలిపి వారి యాజ్ఞోల్లంఘనము చేయుటకు సమకట్టిరిగాని 'కోరియలేనసు' వారి తుంటరితనము నణఁగఁగొట్టి వారి నా పట్టణమునకుఁ బంపెను. విషవాయువులు విడిచినపైని శరీరము సుఖమును పొందినట్లు వీరు వెలిపోయినపిదప రోముపట్టణము హాయిగ నుండెను.

కొంతకాలము గడచినపిదప 'కోరియలేనసు' యుద్ధ



దర్శకుని పనికి నిలఁబడెను. ఈ పని మనుజులచేతిలోనిది. వారి యంగీకారముపైని యెవరినైన నియోగించుచుండిరి. పని కావలసినవాఁడు శరీరమును దుస్తులతోఁ గప్పికొనక తాను చేసిన మహాత్కార్యములను వారితో చెప్పి యందుకు నిదర్శనముగ వాని శరీరముమీఁది గాయములను వాఁడు చూపింపవలయును. కోరియలేనసు ఇటులఁ జేసెను. మొదట ప్రజలితని నా పనిలో నియోగించుటకు సమ్మతించిరి కాని వారి చిత్త మంతలో మాఱి సభవారితో నతఁ డేకమై తమరిని నలుపునను భయము కలిగి యతని కాయుద్యోగము నిచ్చుటకు వారియ్యకొన లేదు. ఆ పనిలో మఱియొకఁడు నియోగింపఁబడెను. ఇటులఁ బరాభవమును బొంది 'కోరియలేనసు' స్వగృహమునకు వెళ్లెను.

అతని యహంకార మతనికి ముప్పుఁదెచ్చెను. వినయవిధేయతలు లేక కార్యములను సాధించువిధ మతఁడు బాగుగ గుర్తెఱింగినవాఁడు కాఁడు. ప్రభుశక్తి విశేషముగ నతనికిఁ గలదు. అతని యాటోపమునకు రోసి ప్రజ లతనిమీఁదఁ గొన్ని నింద లారోపించిరి. తా ననింద్యుఁడ నని యతఁడు సభలోఁ బ్రసంగించినను నతని మాటలను వినక 'టార్పియను' పర్వతశిఖరమునుండి క్రిందికి నతనిని దిగఁద్రోయవలసిన దను శిక్షను సభవారు విధించిరి. ధనికులందఱు నతనిపక్షమై కొండమీఁదికి నతనిఁ దీసికొని వెళ్లిరి. కాని అతనిని దిగఁద్రో

యలేకపోయిరి. ధనికాధనికులకుఁ బోరాటమయ్యెను. అప్పుడు సభవారు మరణదండన మాపుచేసి యతనిని దేశోచ్చాటనము చేసిరి. సభవారందుకు విచారించిరి. ధనికులు సన్నమైరి. అధనికులు ప్రసన్నమైరి. మనోధైర్యము చెడక తల్లికి నమస్కారము చేసి భార్యాపుత్రాదులను పలుకరించి వారిని విడిచి యతఁడు నలుగురు భృత్యులతోఁ గలిసి పరదేశమునకుఁ బోయెను.

తరువాత నతఁడు 'వాల్సియను'లను ప్రజలను పురికొలిపి వారితోఁగూడ దండెత్తి వచ్చి రోమనులను జయించవలెనని యుద్దేశించెను. ఆ ప్రకార మతఁడు వారి యొద్దకుఁ బోయెను. వారికి రోమనులకుఁ బరమవైరము. వారి నాయకుఁడైన 'టల్లసు', రోమనుల నాయకుఁడు కోరియొలేనస్సునకు బద్ధద్వేషి. వారి 'కోరియొలి' పట్టణమును ధ్వంసము చేయుటచేత కోరియొలేనస్సను పౌరుషనామ మితనికి వచ్చెను. శత్రువుల పట్టణముఁ బ్రవేశించి, 'టల్లసు' గృహమున కితఁడు పోయి లోపలఁ బ్రవేశించెను. వానిని నెవరు నటంకపెట్టలేకపోయిరి. కావలివారు లోపలకుఁ బరుగెత్తి మహాపురుషుఁడొకఁడు వచ్చి సభామండపములో నుండెనని 'టల్లసు'తో మనవి చేసిరి. కోరియొలేనస్సు చేతులతో ముఖము మూసికొని కూర్చుని యుండెను. అతనిఁ జూచి 'మీరెవరండి? ఏమి పనిమీఁద దయచేసినా'రని టల్లసు అడిగెను. 'నేనెవరో తమరు పోల్చలేదా? రోమనులతోఁ గలిసి మీతోఁ బోరాడి,



మీ పట్టణమును ధ్వంసముచేసి, కోరియొలేనస్సను పౌరుషనామమును బొందినవాఁడను. నీకు ప్రతివీరుఁడను. ఎవరితో నీవు వైరమును సాధించవలెనని కోరితివో యతఁడే నేను. నా దేశస్థులు నన్ను మన్నించక నేను చేసిన మహత్కార్యములకు వారు నన్ను వెడలఁగొట్టిరి. వారిని సాధించవలెనని కోరి నీయొద్దకు వచ్చినాఁడను. శత్రువుల గుట్టు తెలిసినందున నీపక్షమునఁ బోరాడి, పూర్వముకన్న విశేషముగ శౌర్యమును జూపించఁగలను. నా మాటను మన్నించిన యెడల యుద్ధసన్నాహము చేయుము. లేనిపక్షమున నన్ను నీ యిష్టానుసారము శిక్షించవచ్చు'నని కోరియొలేనస్సు ముఖము మూసికొని ప్రతివచనమియ్యక, అందుకు 'టల్లసు' సమ్మతించి యతనిని కౌఁగిలించుకొనెను. వాల్సియనులు సమావేశము చేసి, వారిని కోరియొలేనస్సు పురికొలిపెను. మాటకారియొ కాక, పనివాఁడని వారతనిని శ్లాఘించిరి. వారు రణభేరి వేసిరి. దరువులు ధణధణ మ్రోయఁగ, దళవాయులు వారి దళముల నడిపింప సాగిరి. రోమపురసీమలలో వారు దండు విడిచిరి. రోమనులు సమరసన్నాహము లేకయున్నందున, భయకంపితులైరి. కోరియొలేనస్సుచేత వాల్సియనులు నడిపింపఁబడి, సమీప పట్టణములను ముట్టడించి వానిని పట్టుకొనిరి. రోమనులు నిశ్చేష్టులై యేమియుఁ దోఁచక యుండిరి.

అప్పుడు రోమనులు సంధి చేయుటకు యత్నించిరి. రాయ

బారులను కోరియలేనస్సువద్దకుఁ బంపిరి. అతఁడు సంధికి నొప్పుకొనలేదు. అంతట రోమను లతని తల్లి 'వలుమ్నియా' ను సంధి చేయుటకుఁ బంప, యామె వెళ్లి, ''నాయనా, నీవు మమ్ము విడనాడి వెళ్లినది మొదలు మా దురవస్థ చెప్పుటకు వీలు లేదు. నీవు రెండు కక్షులవారికి సమాధానము చేయవలెను. లేనిపక్షమున నీ కన్నతల్లిని ముందు సంహరించి రోముపట్టణమును ముట్టడివేయు''మని యతనితోఁ జెప్పెను. అతని దారాపుత్రాదులు పాదాక్రాంతులైరి. వెంటనే నతని మనస్సు కరిగి వాల్సియనులను విడిచి, రోమనుల కమందానందమగునట్లు రోముపట్టణములోఁ బ్రవేశించెను.

కోరియలేనస్సును దండనాయకుఁడుగ వాల్సియనులు నియమించిరి. 'టల్లసు' మొదలగు శత్రుపక్షమువారు కినిసి యతఁడు చేసిన స్వామిద్రోహమునకు తగిన కారణములను నిరూపించి సేనాధిపత్యమును వదలివేయవలసినదని యతనికి వర్తమానముఁ బంపిరి. వాల్సియనులు సభచేయ నతఁ డక్కడకుఁ బోయి, తాను చేసినపనికి సమాధానము చెప్పుచుండ 'టల్లసు' మొదలగువారు లేచి యతనిని కత్తులతో పొడిచి చంపివేసిరి. సెనేటుసభవారు, రోమనులీ వర్తమానము విని పరితోషించలేదు; పరితపించలేదు.



# నిసియస్సు

'నిసియస్సు' 'థ్యూసిడైడీసు' వీ రిరువురు తమ కాలములో ప్రజలను పుత్రవాత్సల్యముతోఁ జూచుచుండి రని మహా మహోపాధ్యాయుఁడైన 'అరిస్టాటులు' ప్రకటన చేసెను. 'థ్యూసిడైడీసు' పెద్దవాఁడు. 'పెరికిలీస'నువాఁడు ప్రజలపక్షము మాటలాడును; మొదటివాఁడు ధనికులపక్షము నవలంబించి యతనిని యెదిరించుచుండెను. 'నిసియస్సు' మిక్కిలి చిన్నవాఁడు. పెరికిలీసు కాలములో నితఁ డతనితోఁ గలిసి పని చేయుటయు, స్వతంత్రముగ పనిచేయుటయు కలదు. యుద్ధములలోకూడ నితఁడు చతురుఁడై యుండెను. పెరికిలీసు కాలాంతరగతుఁడైనపిదప, నితఁడు వ్యవహారస్థుఁడై, పనులను ప్రజల కింపగునటుల నెరవేర్చుచుండెను. ప్రజ లతనిని నమ్మిరి. వారిచేత నతఁడు సన్మానింపఁబడెను. వారిని నొప్పించుట కతఁడు భయపడినందున, వా రతనిని ప్రేమించుచుండిరి. స్వభావముచేతఁ గొంత సభాకంపముఁ గలవాఁడైనను, యుద్ధములలో నతఁడు జయమును బొందుటచేత నతనిని వారు మన్నించిరి.

ప్రభు మంత్రోత్సాహశక్తులు గలిగి పెరికిలీసు రాజ్యా

సూత్రములను ధరించి ధర్మబుద్ధితో నడిచెను. ఈ రెండు గుణము
లతనికి లేకపోయినను ధనము విశేషముగ కలవాఁడైనందున,
గరిడీసంబరముల చేతను, మల్లయుద్ధముల చేతను, నాటకముల
చేతను బ్రజల నతఁడు రంజింపచేసెను. అతఁడు పురజనులకు
కూర్చిన బహుమానములలో నేకశిలాప్రతిమ నేఁటివఱకు
గానఁబడుచున్నది.

'డీలాస'ను నొక ద్వీపములో 'అపాలో' యను పేరుగల
సూర్యదేవతాలయ మొకటి కలదు. అక్కడ ప్రతిసంవత్సర
మొక మహోత్సవము జెరుగుచుండును. అక్కడకు దేశదేశ
ములనుండి మనుజులు వెళ్లుట కలదు. ఒక సంవత్సరము 'ఆథెన్సు'
పట్టణమునుండి కానుకలను బలులను బట్టుకొని గాయకులతో
నుత్సవమునకు వెళ్లుటకు ప్రజలు నిసియస్సును నియోగించిరి.
అతఁ డక్కడకుఁ బోయి వానిని సమర్పించి యక్కడ జెరిగిన
వినోదములలోఁ గొంత కాలము గడిపెను. అయిదు వేల రూ
ప్యముల కొక భూమిని కొని దాని నతఁడు భోగరాగాదులకు
దేవున కిచ్చెను.

అతఁ డటుల చేయుట డాంబికమునకుఁ గాదు. నిజమైన
భక్తికలవాఁడు. దేవతిర్యఙ్మనుజులనిన నతనికి భయము. ప్రతి
దినమున నతఁడు హోమము చేయుట కలదు. అతనికి వెండిగని
కలదు. అందులో ననేక పనులను జేయుచుండిరి. అతనికి
విశేషముగ భృత్యవర్గము కలదు. రాబడి మెండుగ నుండెను.



సత్పాత్రులను జూచి యతఁడు దానము చేయుచుండెను.
భయశీలుఁడుగాన నతనిని వెరిపించి దుర్మార్గులు ధనమును
స్వీకరించుచుండిరి.

'ఆథెన్సు' పట్టణములో నతఁడు 'ఆర్కను' అను పేరున
నొక న్యాయాధికారిగ నియోగింపఁబడెను. ముఖశాల కందఱి
కంటె ముందుగ నతఁడు బోవును. అక్కడనుండి లేఖకులు
వెళ్లినపైని అతఁడు వచ్చును. పురవాసులతోఁ గలిసి మెలిసి
తిరుగుటకతఁడు భయపడుచుండెను. వారిని తన గృహము
నకు భోజనమునకు బిలుచుటగాని వారి గృహములకు నతఁడు
వెళ్లుటగాని లేదు. ఇతరు లతని దర్శనమునకు వచ్చిన భయము
చేత వారికి దర్శన మియ్యక వారిని బంపివేయుచుండెను.
సెలవుదినములలోఁ గవాటములు వేసి స్వగృహములో నతఁడు
మెసలుచుండెను. వేయేల? నిసియస్సుయొక్క జీవితకాల
మంతయు జాగరూకతతోఁ గడుపఁబడెను. అతఁడు యజమాని
యైనను బ్రజలవిషయమై పాటుపడెను. వాచాలత్వము సామ
ర్థ్యము గలవారిచేతఁ బ్రజలు పనులను చేయించుకొనినను
వారి నీర్ష్యతోఁ జూచుట కతదని యతని యభిప్రాయము.
అందుచేత నేపనికైన నతఁడు బూనుకొనలేదు. ముందు
వెనుక లాలోచించి పూనుకొనినపనిని నతఁడు సాంతము చేసి
జయమును బొందుచుండెను. ప్రజల కీర్ష్య కలుగునను భయ
ముచేత కొంచెము తన ప్రతాపమువలన కలిగినను జయము దైవ

ష్టముచేత కలిగెనని యతఁడు చెప్పుచుండెను. ఆకాలములో 'అథీనియనులు' విశేషముగ బాధలు పడుచున్నను వానిని పరుల దోషములవలన సంభవించె నని వారు పలుకుచుండిరి గాని 'నిసియస్సు'వలన సంప్రాప్తమయ్యె నని వారు చెప్పుట లేదు.

ఈకాలములో నాథెన్సు పట్టణములో నొక వక్త బయలు దేరెను. అతని పేరు 'ఆల్సిబియాడీసు'. ఇతరులవలె నతఁడు దుర్మార్గుఁడు కాకపోయినను నతని గుణములు విపరీతముగ నుండెను. దుర్మార్గులను వెడలఁగొట్టి పట్టణమునకు స్వాస్థ్యమును నిసియస్సు తెచ్చుసరికి 'ఆల్సిబియాడీసు'వలన నది తగ్గిపోయి మరల దౌర్జన్యములు బయలుదేరెను.

ఈలోపున స్పార్టనులకు 'అథీనియను'లకు యుద్ధము పొసగినను నిసియసు రెండుకక్షులవారికి సంధిచేయుటకు యత్నించెను. పెద్దలంద అందుకు సంతసించిరి. ఒక సంవత్సరము వఱకు వారు యుద్ధము మానిరి. కుక్కుట ధ్వని విని వారుదయమున లేచుచుండిరి. రణభేరీ మ్రోగుట లేదు. అట్టి సమయమున స్పార్టనుల రాయబారులుగూడ వచ్చిరి. సంధిమాటలు సభామండపమున జరుగుచుండెను. ఆల్సిబియాడీసుయొక్క ప్రేరణచేత సంధిమాటలు పొసఁగలేదు. పడుచువారు యుద్ధమునకు వృద్ధులు సంధికి యిట్లు నిరుతెగలుగ అథీనియనులు విడిరి. మాటలు పొసఁగనందున రాయబారులు లేచిపోయిరి.



అథీనియనులకు కోప ముద్రేకించెను. నిసియస్సు, ఆల్సిబియాడీసు, మఱియొకనిని వీరి మువ్వురలో నొకనిని దేశోచ్చాటన చేయుటకు వారు యత్నించిరి. అంతలో వీరిరువురు కలిసి స్నేహము చేసికొని మూఁడవవానిని దేశోచ్చాటనఁ జేయించిరి. వీరుభయులు సంధిఁ జేసికొనుటఁ జూచి ప్రజలు మిగుల సంతసించిరి.

పరదేశీయుల ప్రోత్సాహముచేత అథీనియనులు సిసిలీ ద్వీపముపైకి దండెత్తిపోవఁ దలఁచిరి. కూడదని నిసియస్సు, సోక్రటీసు మొదలగువారు; కూడునని ఆల్సిబియాడీసు మొదలగు పడుచువారు; సపక్ష పరపక్షముగ సభలో వాదించిరి. సభవారు దండెత్తి వెళ్లుటకు యత్నించి 'నిసియస్సును' 'ఆల్సిబియాడీసు'ను సేనానాయకులుగ నియమించి దళము లాయత్త పఱచిరి. వారా ద్వీపమునకు తర్లి వెళ్లిరి. అక్కడనుండి ఆల్సిబియాడీసు విమర్శనకు మరలినందున సేనాధిపత్యము నిసియస్సుకిచ్చిరి. అతఁడు యుద్ధము సాంతముచేసి దుర్గములను బట్టుకొని ద్వీపములో ముఖ్యపట్టణమైన 'సిరాక్యూసు'ను ముట్టడించి దాని లోఁగదీసెను. ఆ పట్టణము లోఁబడిన పిదప దాని చుట్టు పరిఘల నెత్తించి దుర్గములఁ గట్టి యగత్త్య నతఁడు త్రవ్వించుచుండెను. మూత్రకృచ్ఛ్రరోగముతో నతఁడు బాధపడుచుండియు స్వల్పకాలములో నిన్నికార్యములు చేసినందు కతనిని స్వదేశీయులు శ్లాఘించిరి.

ఇంతలో సిరాక్యూజ నగరవాసులకు కొందఱు సహాయులైనందున వారు తిరుగంబడి నిసియస్సును రణములో నోడించిరి. నౌకాహవములోకూడ నతఁడు పరాభవము నొందెను. వారు తఱుముకొని వచ్చుటచేత నతఁడు పట్టణములోఁ బ్రవేశించెను. అతఁడు కట్టించుచున్న పరిఘులమూలమున బయట కతనికిగాని నతని సైనికులకుగాని రావీలు లేకపోయెను. రేవుపట్టణమును వారు పట్టుకొనినందున వీరా మార్గముననైనఁ బాఱిపోలేకపోయిరి. ఈ దురవస్థను అథీనీయనులు విని మఱికొంత సైన్యమును జేర్చి 'డెమాస్తనీసు'ను సేనానిగఁ జేసిపంపిరి. వారు వచ్చి నిసియస్సు చేసిన సలహాప్రకారము నడవక వెంటనే యుద్ధమునకుఁ గడచిరి. ఈ యుద్ధములో రెండువేల అథీనీయనులు వీరస్వర్గమును బొందిరి. 'డెమాస్తనీసు'యొక్క తొందరపాటుచేత నీయపజయము అథీనీయనులకుఁ గలిగెను. సైనికులు నిరుత్సాహులైరి. వారు ఘూపితులై కృశించిరి. వారికి సహాయమిచ్చుటకు స్వదేశమునుండి సైన్యము వచ్చువిధము గనఁబడదు.

అప్పుడు అథీనీయనులు నావల నెక్కి స్వదేశోన్ముఖులైరి. శత్రువులు పరస్పరముగ నున్నట్లుండి, వారు బయలుదేఱి నావలను గడుపుచుండ మిడుతల దండువలె యుద్ధనావలతో నాక్రమించి ఘోరముగ సముద్రముమీఁదఁ బోరాడిరి. అథీనీయనుల యుద్ధనావలు భారము కలవియగుటచేత



భారములేని శత్రువుల నావలవలె సులువుగ సంచరించుటకు సమర్థత లేకపోయి వేగముగఁ బట్టుపడెను. రాళ్లను రువ్వి శత్రువులు వీరి నావలను గొన్నిటిని ముంచివేసిరి. పట్టుపడిన నావలలోని వారు ఖైదులయిరి. అందులో నిసియస్సు యొక్క శ్రమలు చెప్పలేము. అతఁడు వృద్ధు, రోగి, భోగి; అతని సలహాకు విరుద్ధముగ నీ యుద్ధము జరిగెను. దాని ఫలితము నతఁ డనుభవింపవలసివచ్చెను. డెమాస్తనీసు (వక్త డెమాస్తనీసు కాఁడితఁడు), పరాభవమును బొందలేక పొడుచుకొని చచ్చెను. శత్రువులు కనికరము చూపక వీరిని నఱకుచుండిరి. దీని కంతము కనఁబడ లేదు. శత్రుసేనాధిపతియైన 'గిలిప్పస్సు'ను కలిసికొని, "దయాదాక్షిణ్యమును జూపుటకుఁ గాల మిదియే. మేము ధూపాయితులమైతిమి. మమ్ము కరుణించి మీరు మా కభయ మియ్యవలెనని 'నిసియస్సు' ప్రార్థించెను. అప్పుడు యుద్ధము చాలించవలసినదని 'గిలిప్పస్సు' ఉత్తరువు చేసెను. అప్పుడు 'సిరాక్యూజ్'ులు సభఁ జేసి హతశేషులైన అథీనీయనులను గనులలోఁ బనిఁ జేయుటకును వారి సేనాధిపతులఁ జంపించివేయవలసినదని యుతీరుమానముఁ జేసిరి. ఆప్రకారముగ 'నిసియస్సు'ను రాళ్లతోఁ గొట్టి వారు చంపివేసిరి. గనులలో పనికిఁబోయిన 'అథీనీయనులు' క్షుత్పిపాసాది బాధలచేత శ్రమపడి మడిసిరి. మఱికొందఱు బానిసలుగ శత్రువులచేత నమ్మఁబడిరి. ఒకఁడు

'ఆథెన్సు' పట్టణమునకుఁ బోయి క్షౌరముఁ జేయించుకొనుచు మంగలివానితో నీ దుర్వార్తను జెప్పెను. పట్టణములో నాసంగతి తెలియనందున క్షౌరకుఁడు వెంటనే పట్టణములోనికిఁ బోయి యధికారులతో నీ సంగతిఁ జెప్పెను. వారా వార్తను విశ్వసింపక చెప్పినవానినిఁ బట్టి తెప్పించి యూహఁగ తెలియని యీ దుర్వార్త నతఁడుఁ జెప్పినందు కతనిని శిక్షించిరి. ఇంతలో నిజము తెలిసెను. నాగరికులందఱు దుఃఖాక్రాంతులైరి. నిసియసు మొదలగు సేనాధిపతుల దుస్మరణమునకు వారు విలపించిరి. ప్రతి గృహములోను రోదనశబ్దము తప్ప మఱియొకటి వినఁబడదు. దుర్వార్తాశ్రవణముచేత నా దినము వారికి దుర్దినమయ్యెను. పడుచువారి యాలోచనలను గ్రహించి, వృద్ధుల దూరాలోచనలను నిగ్రహించినందున వారికీ దురవస్థ సంప్రాప్తమై కొన్నితరములవఱకు అథీనియనులు శిరస్సు నెత్తుకొని తిరుగలేదు. ఈ సంగతులు క్రీ. పూ. సం॥ ౪౧౩ వత్సరములో జరిగెను.

'నిసియస్సు' దూరదర్శియైనను, ప్రాప్తకాలజ్ఞుఁడు కానందున, నీ పరాభవము సమకూడెను. అందులో, సేనాధిపతి సంప్రాప్తకాలమునకుఁ దగినటులఁ బన్నాగములఁ బన్నుటకుఁ దగిన కుశాగ్రబుద్ధిఁ గలిగియుండవలెను. అతఁడు నిసియసువలె దీర్ఘాలోచనపరుఁడైన, శత్రువులు సమయము వేచియుండరు గనుక నతనిని పరిభవించుదురు. వారికి సమయమతఁ



డియ్యకూడదు. కేవలము దూరదర్శియైగాని, కేవలము ప్రాప్తకాలజ్ఞుఁడైగాని యతఁ డుండఁగూడదు. అందుచేత సైన్యాధిపత్యమునందఱు పుచ్చుకొనరు. స్వసైన్యరక్షణముఁ జేయుచు, శత్రుసైన్యగతులు గుర్తెఱిఁగియుండవలెను. ఏ సమయమునైన నతఁ డేమఱిపాటుగ నుండినను సైన్యములు నశించుటయేగాక స్వదేశమున కపకీర్తి వచ్చును.

# 'మార్కసు క్రాసస్సు'

'క్రాసస్సు' రోముపట్టణములో నివసించుచుండెను. అతని తండ్రి గుణదోషవివేచకుఁడు (Censor) గ నుండెను. వీరన్నదమ్ములు ముప్పురు. అందులో నితఁడు కడపటివాఁడు. అన్నదమ్ములందఱు తండ్రి కాలములో వివాహమాడిరి. వారందఱు తండ్రితోఁ గలిసి భోజనముఁ జేయుచుండిరి. పెద్దన్నగారు కాలముచేసినపిదప నతని కుటుంబమును 'క్రాసస్సే' సంరక్షణ చేయుచుండెను. అతఁడు జితేంద్రియుఁడైనను నొక సతీమణి (Vestal Virgin) యొక్క గృహమును తక్కువ వెలకు పుచ్చుకొనఁ దలఁచి యామెతో సరససల్లాపములాడుచుండెనని నొక వదంతి కలిగెనుగాని, యది నిజమైనది కాదు. అతఁడు మంచిగుణములు గలవాఁడైనను దురాశాపరుఁడని యెంచి, న్యాయాధికారు లతనిని శిక్షచేయక విడిచిరి. సతీమణి స్వగృహము నతని కమ్మివేసెను.

ఈ దురాశచేత నతని గుణములు వన్నెకెక్కలేదు. మొదట నతని యాస్తి ౩౦౦ టాలెంట్లు (౧ టాలెంటు = ౧౯౩ కాసులు). రాజకీయవ్యవహారములలో నున్నపుడు విశేషముగ ధనార్జన నతఁడు చేసెను. అందులో, యుద్ధములలో కొల్లపెట్టి తెచ్చినది కొంత, గృహములు కాలిపోవుచున్నపుడు





పైని పారవేసిన వస్తువులను దొంగిలించి తెచ్చిన సొమ్ము కొంత కలదు. ఈవిధముగ నతఁడు ౭,౧౦౦ టాలంటులు గణించెను.

రోముపట్టణములోని గృహములు సాధారణముగ నిప్పుముట్టుకొని తగులఁబడుచుండెను. గృహములన్నియు కలిసి యుండుటచేత శీఘ్రముగ నవి యంటుకొనినందున వానిని నార్పుటకవకాశము లేకపోయెను. అందుచేత నతఁడు కమ్మరులు లేపకారులను సుమారు ౫౦౦ మందిని జాగ్రతచేసెను. నిప్పంటుకొనిన గృహములను వానిని సమీపమున నున్న వానిని నతఁడు గొనుచున్నందున పట్టణములో చాలభాగ మతనిదియై యుండెను. అయిన నతఁ డొక గృహములో వాసము చేయుచు మిగిలినవానిని కట్టించలేదు. ఆ నివాసమైనను విరివిగ నున్నది కాదు.

అతనికి వెండిగనులు మెండుగ గలవు. వాని రాబడి విశేషముగ నుండెను. వానియొద్దనున్న బానిసలనేక వ్యాపారములను నేర్చినవారు. వైటికులును (Diamond Cutters) వర్ధకులు (Carpenters), రుక్మకారకులు (Goldsmiths), మండులు (Barbers), రజకులు (Washermen), మాంసికులు (Meat Sellers), భారవాహకులు మొదలగువారతనియొద్ద పని జేయుచుండిరి. వీరిమూలమున వచ్చుచున్న సొత్తు అధికముగ నుండెను. లేఖకులుకూడ నతనియొద్ద నుండిరి. ఎవరెవరికెటువంటి పనులు నిర్ణయించి వారి వారిచేత నతఁడు పనులను జేయించెను.

అభ్యాగతుల నెన్నఁ డతఁడు పొమ్మనలేదు. పటాటోపము లేక స్నేహితులకు విందు లతఁ డప్పు డప్పుడు చేసెను. వారికి వడ్డి లేకుండ ఋణముల నిచ్చుచుండెను గాని వా రేరోజున సొమ్ము నిచ్చివేసెద మని చెప్పిరో యారోజున నతఁడు ఖచితముగ సొమ్ముఁ బుచ్చుకొనుచుండెను. వ్యవహారములో మిక్కిలి నిష్కర్షగ నతఁడు మాటలాడును. కుచ్ఛితవ్యాపారము లేమియు నతనిలో లేవు.

అన్ని విద్యలలో నతఁడు ముఖ్యముగ వక్తృత్వము నభ్యసించెను. గొప్పవక్త కాకపోయినను సభాకంప మతనికి లేదు. శిశిరో, పాంపేయి, సీజరు; వీరు ప్రతివాదిపక్షమునఁ బ్రసంగించుట కిష్టపడనపుడు, క్రాసను లేచి వానిపక్షమున మాటలాడుచుండెను. ప్రసిద్ధికెక్కిన న్యాయవాదులచేత విడువఁబడిన ప్రతివాదులను చేరఁదీసి వారిపక్షము నితఁ డవలంబించెను. అందుచేతఁ బ్రజ లితనిని నుతించిరి. రోమనులలో నెట్టి యధముఁడైనను వాని కితఁడు వందనముచేసి వానివలనఁ బ్రతివందనములను గైకొనుచుండెను.

ఇతఁడు దేశచరిత్రలను, మహాపురుషులచరిత్రలను బాగుగఁ జదివెను. మహామహోపాధ్యాయుఁడైన 'అరిస్టాటి' లుపన్యసించిన తత్త్వజ్ఞానమునం దితని కభిలాష మెండుగనుండి, దాని ననుసరించెను.

ఆరోజులలో 'మేరియస్సు' 'సిన్నా' యను నిరువురు రోమనులు సెనేటుసభలోఁ గక్షి వహించినందున, వారిమూల



మునఁ బ్రజలకు రాజ్యమునకుఁగూడ కొంత వేడి కలిగెను. కొందఱు మహా కులీనులను పట్టి కట్టి తెచ్చి వారికి మరణ దండన విధించిరి. అటుల దుర్మరణము నొందినవారలలో క్రాసను యొక్క తండ్రి, జ్యేష్ఠభ్రాత లిరువురుండిరి. ఈ భయముచేత క్రాసస్సు స్పానియాదేశమున కిరువురు స్నేహితులు నిరువది పరివారకులతో కలిసి ప్రచ్ఛన్నవేషముతో లేచిపోయెను. అక్కడనుగూడఁ బ్రజ లట్టుడికినట్టుడుకుచుండిరి. దానినిఁ జూచి, యతఁ డొంటరిగ సముద్రతీరముననున్న నొకకొండబిలములోఁ బ్రవేశించి, యక్కడ కాలమును గడుపుచుండెను. భోజనపదార్థముల నతని స్నేహితుఁడైన 'విచియస్సు' స్వపరిచారకుని చేతి కిచ్చి ప్రచ్ఛన్నముగ బిలద్వారమున నంపించుచుండెను. వానిని నతఁడు స్వీకరించి పొట్టపోసికొనుచుండెను. ఒంటరిగ కాలము గడుపుట కష్టమని గ్రహించి స్నేహితుఁ డిరువురు కన్యల నతనియొద్దకుఁ బంపించెను. వారితో నతఁడు కాలయాపనచేసి, యెనిమిదిమాసము లందులో నుండి 'సిన్నా' మరణము నొందెనను వార్త విని బయటకు వచ్చిచేరెను.

అజ్ఞాతవాసానంతరమున నతఁడు ౨,౫౦౦ ల కాల్బలమును బోగుచేసి, వానితోఁగూడి వెళ్లి, రోమనునాయకుఁడైన సిల్లాతో సంగమించెను. వీరిరువురు కలిసి యుద్ధమును జేయుచుండిరి. 'క్రాసస్సె' శూరుఁడు కాకపోయినను పట్టుదలతో శత్రువుల నెదిరించి వారినిఁ దఱుముచుండెను. దురాశ

చేత చేయరానిపనుల నతఁడు చేయుటచేత నతనిని ప్రజలు దూషించిరి. ఇతనికంటె చిన్నవాఁడైన పాంపేయుని వారు దయతోఁ జూచుచుండిరి. సిల్లాకూడ నతనినిఁ బ్రేమతోఁ జూచుచుండెను. అందుచేత క్రాసస్సుకు శిరోభారముగ నుండెను. ఒక రోజున 'గురుఁడు పాంపేయి' వచ్చుచున్నాఁడని కొందఱతనితోఁ జెప్పిరి. అప్పుడతఁడు, "వాని గురుత్వ మెంత" యని వారి నడిగెను.

అతఁ డాత్మస్తుతి పరాయణుఁడు. ముఖస్తుతుల కతఁ డితరులకంటె నెక్కుడుగ నభినందించుచుండెను. శూరత్వములో పాంపేయితో సమానుఁడు కాకపోయినను, వ్యవహారములలో నతనిని మించెను. ధనముఁగలిగి పరులకు ఋణముల నిచ్చుచు ప్రతివాదులపక్షమున మాటలాడుటచేత నతని మాటలను ప్రజలు విని యతఁ డనుగ్రహించిన పురుషులనె వారు పెద్దయుద్యోగములలో నియమించుచుండిరి. పరదేశములలోనుండి పోరాడుచున్నపుడు పాంపేయిని ప్రేమించుచున్నను గ్రామములోనున్నపు డతనిని నిరాకరించి యతనికి వ్యతిరేకముగ క్రాసస్సు బోధించినప్రకారము కార్యములను వారు నిర్వర్తించుచుండిరి. సాధారణముగ పాంపేయి నలుగురిలో మెసలక కార్యార్థియై వచ్చినవారిని తిరస్కరించి సాటోపముతోనుండెను. క్రాసస్సు యెప్పు డందఱితోను కలిసి మెలిసి తిరుగుచు ప్రతివాని కార్యముల శక్తికొలఁది జేయు



చుండెను. అందుచేత క్రాసస్సును బ్రజలు ప్రేమించిరి. ఐనను వీరిరువురు మహా ప్రౌఢులు. ప్రబోధనశక్తిగలవారు. వారి ముఖవర్చస్సు ప్రజల నాకర్షించెను.

ఈ కాలములో రోములో నధికారులు మూడు కక్షలుగ నుండిరి. శాంతముగ వ్యవహారములను నడుపుట కిష్టముఁ గలవా రందఱకు పాంపేయుఁడు నాయకుఁడు. విచారించక ధారాళముగ కార్యములను నెరవేర్చుటకు సమకట్టినవారికి సీజరు నాయకుఁడు. ఏపక్షము నొందక ముభావముగ నున్నవారిలో ప్రధానుఁడు క్రాసస్సు. అతఁడు కాలోచితముగ పక్షములను మార్చుచు స్వలాభమున కతఁ డేయెండ కా గొడుగును పట్టుచుండెను.

ఈలోపున దేశములోని మల్లులంద ఱేకీభవించి పితూరి చేసిరి. వారిని దండించుటకు 'క్రాససు' సేనాధిపత్యమును బుచ్చుకొని దండుతో వెడలెను. వారి నతఁడు దరిమి జయమును బొందుకాలములో 'పాంపేయి' వచ్చి పరారియైనవారిని బొడిచి చంపెను. కష్టపడినవాఁడు క్రాసస్సు; వీరకిరీటమును బొందినవాఁడు పాంపేయుఁడు. కొంతకాలమునకు పాంపేయునకు అక్షదర్శకోద్యోగము (Consulship) లభించెను. క్రాసస్సునం దభిమానముచేత నతఁ డితని కా యుద్యోగము మఱియొకటి సమకూర్చెను. కాని కొన్ని రోజులకు వారిరువురు కలహించిరి. పనులలో కూడు నని యొకఁడు కూడ

దని మఱియొకఁడు; ఇటుల వీరిరువురు గ్రుద్దులాడిరి. అంతలో వారి యుద్యోగకాల మంతరించెను.

ఇంతలో ప్రజారాజ్యమును ధ్వంసము చేయుటకు 'కటలీను' పేరుగలవాఁ డొకకుట్రను పన్నెను. అందులో 'క్రాసస్సు' 'సీజెరు' కలిసియుండిరని వదంతి పుట్టెను. 'వక్తశిశిరో' సభలో క్రాసస్సు కుట్రకారుఁ డని ప్రసంగించెను. వీరిరువురకు మనస్పర్థలు రగిలెను. క్రాసస్సు నిర్దోషి యని వెల్లడి యయ్యెను. శిశిరోను జంపుట కతఁ డుద్యుక్తుఁ డయ్యెను. కాని యతని కుమారుఁ డతని నాటంకపఱచెను.

కాలాంతరమున సీజెరు అక్షుదర్శకుని (Consul) పనికి నిలఁబడుటకు యత్నించెను. కాని పాంపేయుఁడు క్రాసస్సుల కంతఃకలహము లుండుటచేత ముందుగ వారిని మిత్రులుగ చేయఁజూచెను. వారినిఁ గలిపి వారితో నతఁడుఁ గలిసినందున వారు మువ్వ రజేయులుగ నుండిరి. ఈ మువ్వురి ప్రభుత్వములో పాంపేయునికి గాని క్రాసస్సునకు గాని మేలు లేక పోయెను. సీజెరు వారి సహాయముచేత ప్రజారాజ్యమును మార్చుటకు తగిన ప్రయత్నములను జేయుటకు వీలయ్యెను. వీరు మువ్వ రక్షుదర్శకులుగ నుండిరి. సీజెరు పనులను బాగుగ నెరవేర్చుచున్నందున నతనిని సేనాధిపతిగ నియోగించిరి. అధికారమును విశేషముగ నడిపించవలె నని 'పాంపేయు'నికి వాంఛ కలిగెను. దురాశకు తోడు సీజెరువలెఁ గీర్తి ప్రతిష్ఠలను సంపా



దించవలె నని క్రాసస్సు కోరి తుద కతఁడు దురవస్థనుఁ బొంది స్వదేశమునకు దుర్దినములను దెచ్చెను. వీరు మువ్వురు కలిసి స్వతంత్రముగ రాజ్యము నేలవలెననికూడఁ బలుకుకొని రోమను రాజ్యమును మూఁడు భాగములుగఁ జేసికొనిరి. సిరియా దేశము క్రాసస్సు వంతుకు వచ్చెను. అతఁ డందులకు సంతసించి యా దేశమునకుఁ బోయి దానినిఁ బరిపాలించెను.

అతఁ డక్కడనుండిన సమయమున 'పార్థుల'నువారితో రోమనులకు జగడము వచ్చెను. అందులో రోమనుల నాయకుఁడు గనుక క్రాసస్సు సైన్యములను వెంటఁ బెట్టుకొని యుద్ధమునకు నడిచెను. మహాఘోరముగ రెండు కక్షులవారు పోరాడిరి. క్రాసస్సు కుమారుఁడు రణములో మరణము నొందెను. క్రాసస్సుయొక్క స్నేహితులు వ్రాలిరి. క్రాసస్సు కుమారునియొక్క శిరమును బల్లెము కొనకు తగిలించి దానిని పార్థులు తెచ్చి రోమనుల యెదుట నుంచిరి. దానిని జూచి రోమనులు ధైర్యము చెడి వ్యసనపడిరి. "ఈ మహాశూరుఁడు వీరుఁడు కాని క్రాసస్సుయొక్క కుమారుఁడు కాఁ"డని వారితో పార్థులు చెప్పిరి. క్రాసస్సు విచారించి స్వసైన్యము నుత్సహించెనుగాని వారు నిరుత్సాహులైరి. యుద్ధము చాలించి లోఁబడవలసిన దని పార్థులు రోమనులకు చెప్పి వెళ్లిరి. వారు పరారి కాకుండ సైన్యముచు నాలుగు వైపులనుంచి శత్రువులా రాత్రి వైజయంతికలలో వెళ్లఁబుచ్చిరి. ఆ రాత్రి రోమనులకుఁ గాల

రాత్రివలె నుండెను. క్రాసస్సు వ్యసనముతోఁగూడ చీఁకటి గదిలోఁ బ్రవేశించి విలపించుచుండెను.

అప్పుడు యోధులందఱు సమావేశమై వీరసభ నొకటి చేసి దానిలో పరారియగుటకు సన్నాహముఁ జేయవలసిన దని కూడఁ బలుకుకొని వా రందఱు లేచిపోయిరి. క్రాసస్సు కూడ వారితో కలిసిపోయెను. దుర్బలు లందఱు శిబిరములలో నుండుటచేత మరునాఁ డుదయమున నాలుగువేల మందిని శత్రువులు ఖండించిరి. పాఱిపోవుచున్న రోమనులను దారిలో కలిసి పార్థులు వారిని సంహరించిరి. అందులో 'క్రాసస్సు'కూడ నేలఁబడి వీరస్వర్గము నొందెను.

కలిగినదానితో సంతుష్టినొందక దురాశచేత విశేషముగ ధనము నార్జన చేయవలెనని సమకట్టి పరదేశములకుఁ బోయి శక్తిలేని పనుల నారంభించి క్రాసస్సు తుదకు దుర్మరణము నొందెను. ఈ విషయము క్రీ. పూ. సం॥ ౬౦-౫౩ రములలో జరిగెను.



# పెరికిలీసు

'పెరికిలీసు'యొక్క తల్లిదండ్రుల వంశములవారు 'ఆథన్సు' పట్టణములో ఘనతకెక్కిరి. ఇతని తండ్రి మహాశూరుఁడు. మైకేలుయొద్ద జరిగిన యుద్ధములో నితఁడు ప్రసిద్ధికెక్కెను. ఒకరోజున సింహపు పిల్లను బ్రసవమైతి నని యతని తల్లి కలఁగనెను. కొన్ని రోజులకు పెరికిలీసు భూపతనమయ్యెను. అతఁడు శరీర సౌష్ఠవము కలవాఁడు. అతని శిరస్సుమాత్రము కొంచెము పొడవుగ నుండెను.

అతనికి సంగీతములోఁ బ్రవేశముగలదు. ప్రకృతిశాస్త్రములోను తత్వములోను నతఁడు వ్యవసాయముఁ జేసెను. తర్కశాస్త్రము నతఁ డభ్యసించెను. వాగ్వాదియని యతఁడు గొంత పేరొందెను. 'అనాక్సూరుఁ'డను వానివద్ద నీ విద్య నతఁడు నేర్చుకొనెను. గురుశిక్షను బొంది, మృదుమధురమైన రచన గలిగినవాఁడగుట మహాత్కార్యములను జేయుట కతని బుద్ధి గమనించెను గాని స్వల్ప విషయములలో నది ప్రసరించలేదు. ఎప్పుడు నతఁడు మౌనముద్రను ధరించియుండెను; పకపకమని వెఱ్ఱి నవ్వులు నవ్వువాఁడుగాఁడు; మందముగ మాటలాడును; ప్రసన్నవదనుఁ డైనను, ముఖమును చూచిన దీర్ఘ

లోచనపరుఁడని తోఁచును; గాంభీర్యము కలవాఁడు; డాంబికముగ దుస్తులను ధరించువాఁడుగాఁడు; అందఱితో మర్యాదగ మాటలాడును. మాటలలో కాపట్యము లేదు. అందుచేతఁ బ్రజ లతనినిఁ బ్రేమించిరి.

ఒకరోజున, తుంటరి యొకఁ డతనిని ముఖశాలలో దూషించుచుండెను. అతఁడు దానిని లక్ష్యము చేయలేదు. ప్రల్లదములు మానుమని వానికతఁ డుత్తరువు చేయలేదు. సాయంసమయమున నతఁడు స్వగృహమునకు వచ్చుచున్నపుడు, వాఁడు దారిలో నతనిని నోటికి తోఁచినటుల మాటలాడుచున్నను వానిని వారింపలేదు. స్వగృహము చేరి, వాని యింటిలో వానిని దిగవిడిచి రమ్మనుమని తన పరిచారకునితో నతఁడు చెప్పిపంపెను. ఈ సహనము గురూపదేశమువలన కలిగినదె. ఇదియొకాదు. కారణములు తెలిసికొనలేక, ప్రకృతివిషయములను జూచి భయపడు ప్రాకృతజనులను బోలక, వాని యాదార్థ్యము నతఁ డా కాలమునకు తగినటుల గ్రహించెను.

చిన్నతనమునుండియు నతఁడు ప్రజలయెడ నయముగ భయముగ మెలఁగుచుండెను. 'తెమిస్టాకలీసు' మొదలగు రాజకార్యధురంధరులు మృతినొందినపైని, అతఁడు రాజ్యసూత్రములను ధరించెను. ప్రజారాజ్యము గనుక నతఁ డధనికుల ప్రాపకమును విశేషముగఁ గోరినను ధనికుల నతఁడు నిర్ల



క్ష్యము చేయలేదు. సభామంటపమునకుఁ బోవునపుడును మొగసాలకు వెళ్లునపుడును నతఁడు రాజమార్గములలోఁ గనఁబడును గాని తదితరసమయములలో నతని దర్శన మగుట దుర్లభము. అతఁ డందఱితోను ముక్తసరిగ మెలఁగును. అతిస్నేహము లేదు; వైరము లేదు. చనువుగనుండిన, నధికారముయొక్క మహాత్తు చెడునని యతని యభిప్రాయము. ఎవరు పిలిచినను విందుల కతఁడు వెళ్లుట లేదు. అధికారములో నున్నందున వారు తనను విందులకుఁ బిలిచి, ప్రసన్నునిగఁ జేయుఁదలఁచెదరని యతఁ డూహించెను; వెళ్లినపైని, మనస్సు నిర్మలముగ నుండక వారు చెప్పిన మాటలచేత కలుషమై, ప్రజలకు న్యాయము కలుగదని యోచించి విందులకు వెళ్లుట మానుకొనెను. న్యాయాధికారు లెప్పుడు స్వపక్ష పరపక్ష విచక్షణ లేక నిష్పక్షపాతముగ న్యాయము విచారించిన, ప్రజల కనురాగము కలుగునని యాలోచించి యతఁ డా ప్రకారము నడిచెను.

తన విశిష్టభావములను మాతృభాషలో వర్ణించి, స్పష్టమధురశైలిలో తన యుచ్ఛస్థితికి తగినటుల మాటలాడుట కతఁడు సమకట్టెను. ఇందు కతని గురూపదేశములు సహాయమయ్యెను. సహజముగ నున్న కల్పనశక్తితో ప్రకృతితత్త్వశాస్త్రములలో నేర్చిన సంగతులను గలిపి, వక్తలలో నతఁడు శ్రేష్ఠుఁడయ్యెను. సభలోఁ బ్రసంగించుటకుఁ బూర్వము, శబ్దార్థ

దోషములు రాకుండునటుల నతఁడు దేవతలకుఁ బ్రార్థన చేసి తదుపరి మాటలాడుచుండెను.

అతఁడు వ్యవహారములను యుక్తముగ నడిపెను. నీతి మార్గమును తప్పక న్యాయము తీర్చుచుండెను. నాటకములకని పౌరుష క్రీడలకని మహోత్సవములకని ప్రజల ధనము వ్యయము కాకుండ రాజ్యాదాయములోని సొమ్ము వ్యయపఱచి ప్రజల నతఁడు సంతోషపెట్టెను. రాజ్యవ్యయము క్రింద లెక్క వ్రాసి, ప్రతిసంవత్సర మఱువది నావలను సిద్ధపఱచి, వాని మీఁద నావికాయాత్ర చేయుటకు నెనిమిది నెలలు ప్రజలను బంపుచుండెను. మఱికొందఱి నతఁడు నూతన సీమలలోఁ గాపురముఁ జేయుటకుఁ బ్రయాణముఁ జేసెను. ఇటుల నూతన సీమలకుఁ బంపివేయుటచేత, దుర్మార్గుల చేత విడువఁబడి నగరము స్వాస్థ్యముఁ బొందెను. నూతనసీమలలోని వారు విదేశీయులకు భయము కలిగించి, స్వదేశముయొక్క మూలబలము ప్రకటనఁ జేయుచు, దానికి దూరరక్షకులుగ నుండిరి.

ఇంతకంటెఁ గొప్ప కార్యము లతఁడు చేసెను. ఆథెన్సు పట్టణములోని పెద్ద దేవాలయములు, మంటపములు, చిత్రవస్తు ప్రదర్శనశాలలు మొదలగు భవనముల నతఁడు గట్టించెను. దేశదేశములనుండి పనివాండ్రా పట్టణములో వచ్చి చేరిరి. చిత్రకారులు, తక్షకులు, లేపకారులు, రజ్జుకారులు మొదలగు పనివారు వచ్చిరి. ప్రజల విహారాదులకొఱ కారామముల



నతఁడు వేయించెను. నాట్యశాలలు, గరిడీలు గట్టఁబడెను. సరోవరములు త్రవ్వఁబడెను. పట్టణమంతయు మహావైభవముతోఁ గూడి, 'గ్రీసు దేశమునకు నయన'మను ప్రఖ్యాతిని బొందెను. రాజ్యవ్యయము క్రింద లెక్క వేసి ఇన్ని గట్టించుటచేతఁ గొంద అతనిని దూషించిరి. అప్పు డతఁడు సభలో లేచి, "ప్రజల ధనము వ్యయము చేసి వీనిని నేను కట్టించితి నని మీకు తోఁచినపక్షమున వానికైన వ్యయమును నేను భరించి వాని మీఁద నాపేరు వ్రాయించెదఁ" నని చెప్పెను. అతని యౌదార్యమునకుఁ బ్రజలు సంతసించి, "తమ యిష్టానుసారము మా ధనము తమరు వ్యయము చేయవచ్చును; మీరు మంచిపనులు చేయించితి"రని ప్రతివచన మిచ్చిరి. అతనిని దూషించిన వారిలోఁ బ్రధానుఁడైన వానిని వారు దేశోచ్చాటనముఁ జేసిరి.

స్కంధత్రయము తెలిసి, రోగిని వైద్యుఁ డెటుల జూచునో యావిధమున త్రిశక్తులు కలిగిన 'పెరికిలీసు' ప్రజలను బరిపాలించెను. వారిని నడిపించు శక్తి యతఁడు బాగుగ గుర్తెఱిఁగి యుండెను. యంత్రకారుని చేతిలో యంత్రములు తిరుగునటుల, ప్రజ లతనియెడఁ బ్రవర్తించిరి.

ఈ కాలములో స్పార్టనులకు అథీనియనులకు యుద్ధమారంభమై సుమారు పదిపదునేను సంవత్సరములవఱకు జరిగెను. అథీనియనులయొక్కయు వారి రాజ్యముయొక్కయు

మహోన్నతపదవిని జూచి వారి నా పదవిలోనుండి దిగఁద్రోయుటకు వారి శత్రువు లీ యుద్ధము నారంభించిరి. పెరికిలీసు పూర్ణశక్తితో నీ యుద్ధమును జరిపెను. కొందఱి కతఁ డిష్టుఁ డయ్యెను. స్వదేశాభిమానముచేత, శత్రువులతో నతఁడుఁ బోరాడెను. రెండు కక్షులవారు సమరసన్నాహముఁ జేసిరి. క్రీ. పూ. సం॥ ౪౩౧ రములో నీ యుద్ధ మారంభమయ్యెను.

ఒక సంవత్సరము యుద్ధము జరిగెను. జయాపజయము లెవరికిని నిర్ణయము కాలేదు. రెండవ సంవత్సరమున, నగరములో మహామారి సంకటము ప్రవేశించెను. వేలకొలఁది జనులు రణములో మడిసిరి. హతశేషులు మహామారినోటిలోఁ బడిరి. నగర మల్లకల్లోలముగ నుండెను. ఎక్కడఁ జూచిన హాహాకారముతప్ప మఱియొకటి లేదు. ప్రజలందఱు పెరికిలీసును దూషించిరి. సేనాధిపత్యము నతఁడే వహించియుండెను. యుద్ధముమాత్రము వారు మానలేదు. మహామారి సంకట మతనికి వచ్చి క్రీ. పూ. సం॥ ౪౨౯ రమున నతఁడు కాలధర్మమునొందెను. అవసానకాలమున నతనియొద్దనున్న వా రతని మహత్కార్యములను జెప్పుకొనుచుండిరి. ఆ మాటలను విని, "అదృష్టముచేత వానిని జేయఁగలిగితిని. అందులో విశేషము లేదు. నే నెవరి కొంపతీసితి నని యెవరు చెప్పలేదు" అని పెరికిలీసు మందముగఁ బలికి యూరకొనెను.

ఈ యుద్ధమునకుఁ గారణములు తెలియవు గాని, పెరికిలీసు దానికిఁ గారకుఁడని చెప్పుదురు. ఈ నిందతప్ప మఱియొకటతనికి లేదు. ఇంతకాల మవిచ్ఛిన్నముగఁ జంచలబుద్ధిగల 'నథీనియనుల' నతఁడు పరిపాలించుటచేత నతనికి గుణాధిక్యత కలిగెను. ప్రజా రాజ్యముగ నున్న పట్టణమును మహారాజ్యాధిపత్యములోని నగరముగఁ జేయవలెనని యతఁడు యత్నించెను గాని వ్యవహారలోపములవలననో లేక మఱి యే కారణములచేతనో నది సాగలేదు. అది లేకపోయినను, నగరవాసులందఱు విద్యల నభ్యసించి పట్టణమునకుఁ గీర్తి ప్రతిష్ఠలను దెచ్చిరి. సాహిత్యనాటకాలంకారశాస్త్రములు పరిఢవిల్లెను. వక్తృత్వమును వా రభ్యసించిరి. కవులకుఁ గొదువలేదు. గాయకులు మన్ననలఁ బడసిరి. 'పెరికిలీసు రాజ్య'మని యతని ప్రభుత్వకాలము పేరొందెను.



# పాంపేయుఁడు

పాంపేయుని తండ్రి 'స్ట్రాబుఁడు'. తండ్రి దురాశాపరుఁడగుటచేత నతనిని రోమనులు గర్హించిరి. సన్నిపాతమువలన నతఁడు మృతినొందెను. స్మశానమునకు శవమును దీసికొనిపోవుచున్న సమయమునఁ గోపము బట్టలేక వారు దానినిఁ బీకి పారవేసిరి. తండ్రి నెంత నిందించిరో కుమారుని వారంత స్తుతించిరి. పాంపేయునిఁ బ్రేమించుటకనేక కారణములు గలవు. అతఁడు సంగర కేళీనిపుణుఁడు; శరశిక్షాశాలి; గురులకు భయస్థుఁడు; ఉదారుఁడు; దయార్ద్రహృదయుఁడు; శౌర్య ధైర్య గాంభీర్య ధురంధరుఁడు; వినయరతుఁడు; హృదయవిదుఁడు; మానధనుఁడు; ప్రజల పొత్తు నభిలషించువాఁడు. అతఁడు మఱియు సముచితసంభాషణంబులచేతఁ బ్రజల నరకించుటచే వారతని నభినందించిరి. చెలువంపు మేనును జెన్ను మొగంబును గలిగి, వారి నతఁడాకర్షించెను. నేత్రములలో నతనికి సిరియుండు. అతఁడు మహా అలెగ్జాండరును బోలియుండెను. మానసికముగ నితని పనుల నతఁడు స్మరించుచుండెను.

అతఁడు తండ్రితోఁ గూడఁ బోరాటమునకు వెళ్లియుండెను. శత్రువులతని స్నేహితుని వశము జేసికొని, స్కంధావారములో నతఁడు నిద్రించునపుడతనినిఁ బొడిచి చంపుమని స్నేహితునిఁ బ్రోత్సాహపఱచిరి. ఈ సంగతి భోజనకాలమందతనికిఁ దెలిసినను పాంపేయుఁడు యథావిధిగ స్నేహితునితోఁ గలిసి భుజించి యతనినిఁ బంపివేసెను. అతఁడా రాత్రి శిబిరములోఁ బండుకొనలేదు. స్నేహితుఁడు నిశాసమయమున శిబిరములోనికిఁ బోయి యతఁడు బండుకొనినాఁడని భావించి, కత్తితో నతని మంచముమీఁద నాలుగైదు స్థలములలో గంట్లు పెట్టెను. తదుపరి, సైనికులందఱు కలిసికొని సేనాధిపతియైన స్ట్రాబుని చంపుటకు యత్నించిరి. ధైర్యము గలిగి పాంపేయుఁడు వారి నివారించెను. కొందఱు మాత్రము శత్రుపక్షములోనికి వెళ్లిరి.

ఇంతలో స్ట్రాబుఁడు గతించెను. ఇతఁడు ప్రజలయొద్ద నపహరించిన సొత్తు పాంపేయుని యధీనములో నున్నదని ప్రజలొక వదంతి వేసి, యతనిని న్యాయసభలో విచారణకుఁ దెచ్చిరి. స్వదేశమునకు వచ్చులోపున శత్రువులతని గృహములోఁ బ్రవేశించి ధనము నపహరించిరి. అప్పుడతఁడు న్యాయసభలో ప్రాడ్వివాకుని (Proctor) యెదుట సమక్షమున న్యాయముగఁ బలికినందున నితఁడందులకు సంతసించి తన కుమారితె నతని కిచ్చి వివాహము జేయుటకు సమకట్టెను. ఈ సంబంధమునకు బ్రజలు సంతసించిరి. అతఁడు

'అంత్రస్థి' యను నామెను వివాహమాడెను. ఈమె న్యాయాధికారి కూఁతురు.

తదనంతర మతఁడు శత్రుపక్షమువాఁడైన 'సిన్నని' యొక్క శిబిరములోనికి వెళ్లెను. కారణము లేక యతనిని శత్రువు నిందించినందున నతఁ డక్కడనుండి వెడలెను. సైనికు లందఱు నతనిని 'సిన్నుఁడు' చంపియుండు నని యెంచి వా రతనితోఁ గలహించి వానిని జంపివేసిరి.

ఈలోపున పాంపేయుఁడు స్వగ్రామమునకుఁ బోయి యక్కడ బ్రజల సందఱిని రేపి కొంత సైన్యమును సమకూర్చెను. కొంతకాలమున కతని సైన్యము బహుళమైనందున రాజ్యాధికారు లందఱు మిగులభయపడిరి. సం॥ ౨౩ రముల వయసువాఁడై రాజ్యాధికారుల సెలవులేనిది యతఁ డీ సైన్యమును చేర్చెను. రాష్ట్రము పక్షమునఁ గొందఱు సేనాధిపతులు సైన్యములను దీసికొనివచ్చి యతనితోఁ బోరాడిరి. కాని వారి నందఱి నతఁడు సమరములోఁ బరిభవించెను. ఈ వార్తను విని రోముపట్టణములో నక్షుదర్శకుఁడును (Consul) న్యాయాధికారి యున్నైన 'సిపియుఁడు' దండుతో వెడలివచ్చెను. ఇతఁడుగూడ యుద్ధములో నోడి పగారియయ్యెను. ఇటుల మహాదండనాయకు లఖండంబుగ ఖండింపఁబడుటను విని 'సిల్లుఁడు' తన సైన్యమును గొని పోరాటమునకు వచ్చెను. ఇతఁడు పాంపేయుని యొక్క రథగజతురగపదాతులను జూచి వెఱఁగుపడి అతని



తోఁ గలహించుటకు వెనుకకుఁ దీసెను. అప్పు డుభయసేనాధిపతులు (సిల్లుఁడు, పాంపేయుఁడు) మిత్రభావమున సమావేశమైనపుడు పాంపేయుఁడతనిని సార్వభౌముఁడని (Imperator) గౌరవించి వందనముఁ జేసెను. తనకంటె చిన్నవాఁ డైనను పాంపేయుని సిల్లుఁడుగూడ నటులనే గౌరవించి మన్ననఁ జేసెను. అతఁడు వచ్చినపుడెల్ల సిల్లుఁడు ప్రత్యుత్థానముఁ జేసి యతనిని దీసికొని వచ్చి యాసనముపైనిఁ గూర్చుండ నియమించుచుండెను.

ఇటుల గౌరవములను బొందుచున్నను బాంపేయుఁడు గర్వించలేదు. సిల్లుఁ డతనిని ఫ్రాంసు దేశమునకుఁ బోయి యక్కడ సేనాధిపత్యమును వహించవలసిన దని నియమించెను. "అక్కడి సేనాధిపతినిఁ బనిలోనుండి తొలఁగించుట న్యాయముకా"దని పాంపేయుఁడు చెప్పెను. అందులకు సిల్లుఁడు సంతసించక పాంపేయుని సేనాధిపత్యము వహించుమని నిరోధించెను. ఆజ్ఞోల్లంఘనముఁ జేయలేక పాంపేయుఁడు సమ్మతించి ఫ్రాంసు దేశమునకుఁ బోయి యక్కడి సేనాధిపత్యమును వహించి సిల్లునియొక్క కార్యముల నతఁడు నిర్వర్తించెను.

కొంతకాలమునకు 'సిల్లుడు' నానా దేశములలోను సర్వాధికారియని ప్రఖ్యాతి వహించెను. అందుల కతఁడు సంతసించి ప్రత్యయుత దండనాయకులను సన్నుతించి, బహూకరించెను. పాంపేయునియొక్క సుగుణములకు ముదమంది

సిల్లుఁడతనితో సంబంధముఁ జేయుటకుఁ దలపెట్టి దంపతు లిరువురు నేకీభవించి తమ కోడలి నతని కిచ్చి వివాహముఁ జేయుటకు సమకట్టిరి. ఇంతకన్న క్రూరమైన కార్యము మఱి యొకటి లేదు. అతని మొదటి భార్య (అంతస్థి) నెలదప్పి యుండెను. అతనిమూలమున నామె తండ్రి మరణము నొందెను. ఈ దుఃఖమును బట్టలేక యామె తల్లి యాత్మహత్య చేసికొనఁబూని యుండెను. వీనికి తోడుగ పాంపేయుఁడు రెండవ వివాహ మాడుననువార్త వినవచ్చెను. అతఁడు వివాహమాడఁ దలఁచిన పడుచు గర్భముధరించి యుండెను. ఇంతలో 'అంతస్థి' ప్రసవమై పురిటిచావుఁ జచ్చెను.

తదనంతరము 'సిసిలీ'ద్వీపములోఁ గొందఱు రాజ్యాధికారులపైని తిరుగఁబడిరి. వారిని దండించుటకు పాంపేయుఁ డా ద్వీపమునకు వెళ్లి వారిని మాపివేసెను. ఇంతకు లోపున నాఫ్రికాఖండములో నుత్తరభాగమునఁ గొన్ని యల్లరులు పుట్టినందున వాని నణఁగఁగొట్టుటకు 'సెనేటు' సభవారును, సిల్లుఁడును, పాంపేయున కుత్తరువుచేసిరి. అతఁ డా ప్రకారము ఆఫ్రికాఖండమునకు దండుతో వెడలి వెళ్లెను. అక్కడ ఘోరాహవములో శత్రువులఁ దునుమాడి యతఁడు జయముఁ బొందెను.

ఇంతలో నతనిని సేనాధిపత్యమును విడిచి, రాజధానికి రావలసిన దని సిల్లుఁ డుత్తరములు వ్రాసిపంపెను. ఇందుకుఁ గారణ మతనికిఁ దెలియలేదు. ఈ సంగతి సైనికులు విని తమ్ము ను విడిచి పాంపేయుఁడు వెళ్లుటకు వారు సమ్మతించలేదు. సేనాధిపతియందు మిగుల బద్ధానురాగులైనందున వా రతనిని సేనాధిపత్యము విడువవల దని నిరోధించిరి. కాని వారి నతఁ డెంత సమాధానముఁ జేయఁ దలఁచినను వా రతనిమాటల సరకు సేయక, అతని నధికారుల యాజ్ఞకు వ్యతిరేకముగ నడువవలసిన దని ప్రోత్సాహముఁ జేసిరి. "నే నధికారుల యాజ్ఞకు వ్యతిరేకముగ నడువలేను. మీరు నన్నిట్టుల నిర్బంధముఁ జేసెన యెడల నే నాత్మహత్యఁ జేసికొని యెదనని" వారితోఁ జెప్పి దండును వెంటఁబెట్టుకొని రాజధానికిఁ బోవుటకుఁ బ్రయత్నముఁ జేసెను.

సర్వాధికారియగుటకు పాంపేయుఁడు ప్రయత్నించుచుండె నని రోముపట్టణములో వదంతి పుట్టినందున సిల్లుఁ డతనిని సేనాధిపత్యము వదలి పట్టణమునకు రావలసిన దని యుత్తరువుచేసెను. మహావైభవముతో పాంపేయుఁడు రాజధానికి వచ్చి జయప్రవేశముఁ జేయవలెనని యత్నించెను. అది పూర్వాచారమునకు విరుద్ధమని సిల్లుఁడు వాదించెను గాని, పాంపేయుఁ డందుకొల్లక నాలుగేనుఁగులచే లాగఁబడిన రథము నెక్కి జయద్వారముగుండఁ బట్టణములోఁ బ్రవేశించెను.

'దుందుభి ఖంజరి మర్దళ భేరీరవంబులు మిన్నుముట్టఁ

నీ గండరగండఁడిటుల మహాటోపముతోఁ బరిక్రమించినందుకు సిల్లుఁడు మొగంబు గంటు పెట్టుకొనెను. ఇంతలో నితనికి కాలము సమకూరెను. అవసానకాలమున నితరులను తన కుమారునికి సంరక్షకులుగ నియోగించి పాంపేయునిమాత్ర మితఁడు నిరసనఁజేసెను. సిల్లుఁడు కాలాంతరగతుఁడయ్యెను. బిరుదు నిశానీలతో నితనిని రుద్రభూమికిఁ దీసికొని వెళ్లునపుడు పాంపేయుఁడు గూడపోయెను.

కొంతకాలమునకు 'లెపిడస్సు' అను నతఁడు రోములో సర్వాధికారమును బొందుటకు సమకట్టి సైన్యములను గూర్చి, వానితోఁగూడ 'ఇటలీ' దేశపు టుత్తరభాగమును జయించి రోముపట్టణసమీపదేశము వచ్చిచేరెను. నాగరికు లందఱు గలతఁజెందిరి. పాంపేయుఁడు పైగానుండి శత్రుసైన్యము నోడించి, వారి భయమును బాపెను. 'లెపిడస్సు' దేశమును విడిచి పారిపోయి దుఃఖము భరింపలేక మృతినొందెను.

స్పానియాదేశము రోముప్రజారాజ్యములోనిది. అక్కడి రాజ్యాధికారి తిరుగుబాటు చేసి స్వాతంత్ర్యముఁ బొందవలె నని సమరసన్నాహముఁ జేసెను. అతనిని దండించుటకు రోమను అధికారులొక సేనానిని సైన్యముతోఁ బంపిరి. కాని యతఁడు వానిని శిక్షింప లేకపోయెను. అటుపైని వారు పాంపేయుని సైన్యముతోఁ బంపిరి. అతఁడు స్పానియాదేశముఁ బోయి దాడిలో వైరుల దునుమాడి జయమును బొందెను.



అతఁ డనంతరము రాజధానికి వచ్చినపైని 'వీరజయోత్సవమును' బ్రజలు చేసిరి. ఇది రెండవ యుత్సవము. తదుపరి పాంపేయుఁడు క్రాసస్సుతోఁగూడ 'అక్షుదర్శకుని' యుద్యోగమును నిర్వహించెను. వారిరువురు గొంతకాల మేకీభవించి పని పాటులను జక్కపెట్టిరి గాని తుదకు కలహించి వ్యవహారమును మానిరి.

అటుపైని పాంపేయుఁడు సభలో న్యాయవాదిగ నుండలేదు. కొన్ని సమయములలోమాత్ర మతఁడు బయటికి వచ్చుచుండెను. బయలుదేరినపుడు బంధుమిత్రపరివారములతోడఁ గూడి యతఁడు వాహ్యాళి సలుపుచుండెను. అనేకులు పరివారజనులకు వేతనము లిచ్చి పోషించుచు మహావైభవముతో నతఁడు జీవించెను. అతిపరిచయము మర్యాదకు లోపమని యెంచి పరుల కతఁడు దర్శనమిచ్చుటలేదు. మొదటినుండి, ప్రజారాజ్యములో జీవించుచు ప్రజలను బొడగన్న భృత్యుని కైవడి వారియెడల సంచరించి కాలపరిపక్వమున రణశూరుఁడని పేరుఁబొందినందు కతనికి గర్వము బలిసెను.

ఇంతలో మధ్యధరాసముద్రముమీఁద నోడదొంగలు విస్తరించి నావికాయాత్ర జేయువారిని వధించుచుండిరి. నావికాయాత్రఁ జేయుట కష్టమయ్యెను. వర్తకవ్యాపారములు నిలిచిపోయెను. రోమను లందుకు కోపించి వారిని దండించుటకు ౫౦౦ యుద్ధనావలను సమకూర్చి పాంపేయుని

నౌకాసేనానిగ నియమించిరి. వెంటనే యతఁడు నావలతో బయలుదేరి వారిమట్టు మాపెను. ఈ శుభవార్త రోమనులు విని మిగుల సంతసించిరి. రోమురాజ్యమునకు తూర్పుననున్న దేశముల కతనిని సర్వాధికారిగ వారు నియమించిరి. ఆ దేశములలో నతఁడు రోమకాధిపత్యమును స్థాపించుటకు మాతంగతురంగనరనికురంబబలంబులతోఁ గదలివెడలి వాని నతఁడు స్వాధీనముఁ జేసికొని రాజధానిం జేరెను.

అతని ప్రతాప మిటుల లోకవిశ్రుతమైయుండ స్వగృహచరితము లింపుగ లేవు. అన్ని దేశములు తిరిగి వేళకు భోజన భాజనములు లేక, కీర్తిని సంపాదించుటకుఁ గష్టపడి యతఁడు సుఖముగఁ గాలయాపనఁ జేయవలెనని యిల్లు చేరెను. అతఁడు పరదేశములో నున్నకాలమున నతని భార్య పరపురుషునితోఁ గూడెనని యతఁడు విని కలఁతఁ జెందెను. ప్రపంచకధర్మ మంతయు ద్వంద్వమే. మనుజుఁడు ద్వంద్వాతీతుఁడు కావలెను. అతఁడు దుఃఖపడి భార్యకు విడియాకు లిచ్చెను.

అతఁడు దేశములోనికి వచ్చి ప్రజల నెటుల త్రిప్పునో, రాజధానిలోఁ బ్రవేశించి నగరవాసుల నెటుల మన్నించునో, ప్రజారాజ్యముయొక్క నామరూపముల నేకరాజ్యాధిపత్యమునకు ఎటుల మార్చునోయని పలువిధములఁ బ్రజలు చింతించిరి. క్రాసస్సు తన సర్వస్వము తీసికొని పట్టణము విడిచిపోయెను.



పాంపేయుఁడు దేశములోనికి వచ్చి దళములు విడివడుట కుత్తరువు చేసెను. వీరజయోత్సవమునకు రాజధానికి రావలసినదని వారితో నతఁడు చెప్పెను. వారి వారి స్థానములకు వారినిఁ బొండని సెలవిచ్చి పంపివేసెను. అనంతర మతఁడు స్నేహితులతోను పరివారజనముతోను గూడి నగరమునకు వచ్చుచుండెను. ఈ వార్తను విని నగరములలోని ప్రజలు సంతసించి గుంపులు గుంపులుగ నతని వెంట నంటి రాజధానికి వచ్చిరి. 'సెనేటు'సభను తిరుగఁ ద్రోసి మహారాజ్యాధిపత్యమును స్థాపించుట కతనికి సమయము దొరికెను. కాని యతఁ డందులకుఁ బూనుకొనలేదు. అతఁడు దిగ్విజయము చేసి వచ్చిన తరువాత చేసిన యుత్సవములలో నిది మూఁడవ వీరజయోత్సవము. అతఁడు దేశములు కొట్టి తెచ్చిన ధనము రాసులు పోసిరి. స్వాధీనమైన దేశములనుండి ౨౧,౦౦౦ టాలంటులు (౧ టాలంటు=౧౫౩౬ కాసులు; ౧ కాసు=౧౪ రూప్యములు) రాఁబడి వచ్చెను. పధచాశ్వములు, భద్రగజములకు పరిమితి లేదు. పరాజిత రాజుల ప్రతినిధులనుగూడ నతఁడు వెంట దెచ్చెను. ఈ యుత్సవము రెండురోజులు రోమునగరములో జరిగెను.

ఇంతలో బాలసూర్యునివలె సీజరు బయలుదేరెను. క్రాసస్సు పాంపేయులకుఁ గల మత్సరములఁ బాపి వారిని సఖులుగఁ జేసి వారితో నతఁడు గలిసెను. ఈ ముప్పుర్వురేకీభవించి రాజ్యమేలుటవలన సీజరు లాభమును బొంది క్రమముగ నేకా

రాజ్యాధిపత్యమును స్థాపించుటకు దగిన సన్నాహముల నతఁడు చేసెను. నూతనసీమకుఁ బ్రజలను బంపుటకు సేద్యము లేని భూముల నరికట్టించుటకు సీజేరు యత్నించి పాంపేయుని సలహాతో సెనేటుసభలోఁ బ్రస్తావించెను. ఇందుకుఁ బ్రజలు సంతసించిరి.

సీజేరునం దభిమానము పాంపేయునికి లావయ్యెను. వా రిరువు రది నొకటేమాట. మాటలలోనె గాక క్రియలలోఁ గూడ వా రేకీభవించిరి. సర్వసేనాధిపత్యమును వహించుట చేతఁ బూనినకార్యములను వారు నిరంకుశముగ నెరవేర్చిరి. సీజేరుయొక్క కుమార్తె 'జూలియా'ను పాంపేయుఁడు వివాహమాడెను.

సీజేరు, పాంపేయుఁడు క్రాసస్సు వీరు ముగ్వురు రాజ్యమును మూఁడు భాగములుగఁ బంచుకొనిరి. వారి వారి రాజ్యములకు మిగిలినవారు పోయి వ్యవహారములను జూచుకొనుచుండిరి గాని పాంపేయుఁడు స్వరాజ్యమునకు వెళ్లక రోము నగరములోనుండి నూతనముగఁ గాపురమునకు వచ్చిన భార్యతోఁ గాలముఁ గడుపుచుండెను. ఒకవేళ నతఁడు గజములను బోరాడించును; మల్లులయుద్ధముఁ జూచును; నాటకములఁ జూడఁబోవును. ఈ మొదలగు వినోదములలో నతఁడు భార్యతోఁ గలిసి విహరించెను. దంపతు లిరువురుఁ గలిసి 'ఇటలీ' దేశములోని నగరములను జూచుచు యాత్ర జేసిరి. కొంత



కాలమున కామె గర్భిణియై, యకాలములో నొక స్త్రీశిశువును గని పురిటిచావుఁ జచ్చెను. ఆ శిశువుకూడ విశేషకాలము జీవించలేదు. తదనంతరము పార్థులతో యుద్ధముఁ జేయుచు చనిపోయిన కుమార క్రాసస్సుయొక్క భార్యను పాంపేయుఁడు వివాహమాడెను. ఆమె చక్కనిది. చక్కదనమునకుఁ దోడుగ నామె వీణవాయించఁ గలది; బీజగణితములో నామెకు ప్రవేశముండెను; తత్వజ్ఞానమును లెస్సగ గుర్తెఱిఁగియుండెను. ఇన్ని విద్య లున్నను నామె భర్తకు శుశ్రూషఁ జేయుచు మెలకువతో సంచరించెను. స్త్రీలు విద్య నేర్చిన, వినయవిధేయతలు లేక యమంగళకార్యములు సేయుదు రను మాట కామె వికృతముగ నడిచెను.

ఇంతలో పాంపేయుఁడు 'నేపిల్సు' పట్టణములో చావుసంకటముపడి దైవకృపవలన స్వాస్థ్యము నొందెను. అతఁడు మృత్యువువాతఁబడి లేచినందుకు పట్టణములలోను పల్లెలలోను దేశమంతటఁ బ్రజలు మహోత్సవముఁ జేసి యతనిని దర్శించుటకు వేనవేలుగ వచ్చిరి. ఈ మర్యాదలను బొందుటచేత నతనికి గర్వ మంకురించెను. ఇంతకుపూర్వము వినయవిధేయతగ నున్న పాంపేయునకు దర్పము బలిసి సీజేరును నిర్లక్ష్యముగఁ జూడనారంభించెను. "అతఁడు పక్షివంటివాఁడు. ఇతనిఁ బడఁద్రోయుట నిముషముపని" యని పాంపేయుఁడు ప్రగల్భములు పలికెను. ఈ మాటలమూలమున నతనికి

ముప్పువచ్చెను. కొండెగాం డ్రీ మాటలను సీజేరుతోఁ జెప్పి, వాని మాటలను పాంపేయునితోఁ బలికి వారికి మనస్పర్థలను రగిలించిరి.

సీజేరు, పాంపేయుఁడు, వీరిరువు రతిరథశ్రేష్ఠులు. సేనాధిపతులు. ఒకఁడు భూసైన్యములకు నాయకుఁడు; మఱియొకఁడు భూనావికాసైన్యముల కధికారి. వీరిరువురు రోమునగరము స్వాధీనముఁ జేసికొని మహారాజ్యాధిపత్యమును స్థాపించుటకు సమకట్టియుండినవారు. ప్రళయకాలమున మహాబలప్రేరితంబులై క్షుభితంబులగు మహాసముద్రంబులు చెలియలిగట్ట నతిక్రమించుట కుప్పొంగు విధమున ప్రత్యానీకసైన్యంబులు రెండును మార్కొని పోరాటము సలిపిరి. సీజేరుఁ జయముఁబొందెను.

పాంపేయుఁ డపజయముఁబొంది దారాపుత్రాదులతోఁ గొందఱు పరివారకులు వెంటరా నొక పడవనెక్కి పరదేశములకుఁబోయెను. ఏ దేశపురాజును జేపట్టి శత్రువును శిక్షించుటకు దగిన సైన్యమును లేవనెత్తుటకు వీలగు నని పాంపేయుఁడు చింతించెను. 'ఈజిప్టు' దేశము నేలుచున్న కుమారరాజు తన కాప్తుఁ డని యెంచి, యక్కడకుఁ బోవుట కతఁడు సమకట్టి కుమారరాజునకు వర్తమానముఁ బంపెను. అప్పు డితని మంత్రులు "ఏలినవారు పాంపేయునిఁ జేరఁదీసిన, సీజేరు మీకు శత్రు వగును; పాంపేయుఁడు యజమానుఁ డగును. మర్యాదఁ జేయక పాంపేయునిఁ బొమ్మనిన నతఁడు



కార్పణ్యము వహించును; దొరికినవానిఁబట్టి యప్పగించ నందుకు 'సీజేరు' కోపగించును. అందుచేత, నిరాయుధుఁడుగ నున్న పాంపేయుని మంచిమాటలతోఁ జేరఁదీసి యతనిని జంపుట మేలు. సీజేరుకు మీాయం దనుగ్రహము కలుగును. పాంపేయుఁడు మిమ్ముల నేమియుఁ జేయలేఁ"డని కుమారరాజునకు బోధచేసిరి.

నగరములోనికి విజయము చేయవలసిన దని కుమారరాజు వర్తమానముఁ బంపి నందున, పాంపేయుఁ డొక పర్యాయము భార్యను ముద్దులాడి, కుమారునిఁ గౌఁగిలించుకొని, యొక చిన్నపడవనెక్కి యొడ్డునఁజేరెను. మామగారైన సీజేరును నమ్మి యతని సముఖముననుండిన; దన చేయి క్రిందగు నని యెంచికదా, పాంపేయుఁడు పరదేశరాజును నమ్మి యతని చేతిలోఁబడెను. రెండు కత్తు లొక వరలో నిమిడియుండ లేవు. అతఁ డొడ్డునకు వచ్చిచేర, కుమారరాజు వచ్చి వందనము చేసెను. వందన ప్రతి వందనములైనపిదప పాంపేయుఁడు ప్రసంగించుటకు యత్నించుచుండ, హంతకులు వెనుకనుండి వచ్చి యతనిని బాకులతోఁ బొడిచి చంపిరి. మరణమునొందు సరి కతనికి ౫౯ సంవత్సరముల వయస్సు. ఈ యుపద్రవమును జూచి భార్య కుమారుఁడు మొదలగువారు భయపడి నావను గడుపుకొని పోయిరి.

అతని వెంటవచ్చిన పరివారకుఁ డొకఁ డాశవమును

దీసి, సమీపముననున్న యొడ్డునఁ బెట్టి దానిని దహనముఁ జేయఁ జూచెనుగాని కట్టెలు లేకపోయెను. శిథిలమైయున్న యొక పడవయొక్క బల్లలను ప్రోగుచేసి వానితో నతఁడా శరీరమును దహనముఁ జేసెను. పాంపేయుండు క్రీ. పూ. సం ౪౮ రములో మృతినొందెను.



# మార్కసు-బ్రూటసు

మార్కసు-బ్రూటసుయొక్క పూర్వికుఁడు 'రోము' నగరములోఁ బెద్ద యుద్యోగముఁ జేసెను. ఇతఁడే, నగరములోని ప్రజాపీడకుల సంహరించి, రాజ్యమునకు స్వాతంత్ర్యమును దెచ్చెను. ఇతని రూపమున, రోమకు లొక యిత్తడి ప్రతిమను నిరూపించి, నగరములో స్థాపించిరి. ఇతఁడు చదువుకొనినవాఁడైనను, మహా కఠినుఁడు. ఆ వంశములోనివాఁడైన మార్కసు-బ్రూటసు చదువుకొని నెమ్మదియైనవాఁడు; మెత్తని చిత్తముగలవాఁడు. జూలియసుసీజేరును చంపుటకు గూడిన కుట్రదారులలో నొకఁడైనను, దౌర్జన్యమును జేసినవాఁడు 'కాసియసు' యనువాఁడు గాని, యతఁడు కాఁడు. అతఁడుదారపురుషుఁడని వాడుక. అతఁడు కులీనుఁడని కొందఱు, కాఁడని కొందఱు చెప్పుదురు. ఏది ఎట్లున్నను, ఇతని పూర్వికులలో మూఁడు, నాలుగు తరములలోనివారు సర్కారుద్యోగము చేసినటుల కానవచ్చుచున్నది.

గ్రీకు వేదాంతియైన 'ప్లేటో' మత మతఁడవలంబించెను. లాటినుభాషలోఁ జదువ, వ్రాయ, నుపన్యసించుటకుఁ

దగినంత పాండిత్య మతఁడు సంపాదించెను. ముక్తసరిగ వ్రాయు
టయు, ప్రసంగించుటయు నతని వాడుక.

ఈ కాలములోనే, రోమునగరమును, రాజ్యమును
స్వాధీనపఱుచుకొనుటకు, సీజేరు, పాంపేయుఁడు ప్రతికక్ష
వహించి పోరాడుచుండిరి. తన తండ్రిని జంపినవాఁడని కార్ప
ణ్యము సహించక, పాంపేయునిపక్షమును బ్రూట సవలం
బించెను. శత్రుకక్షలోనివాఁడైనను, సీజే రతనిని ప్రేమించెను.
అనంతరము, సీజేరు, పాంపేయుఁడు పోరాడిరి. పోరాటములోఁ
బాంపేయుఁ డోడిపోయెను. బ్రూటసు వచ్చి సీజేరుపక్ష
ములోఁ జేరెను.

అతఁడు న్యాయమైన పనులకే సమకట్టును; సమకట్టిన
వానిని తుదముట్టించును; తుదముట్టినవానిలో జయమే గాని
యపజయము లేదు. ఒక పని, న్యాయము గాని యన్యాయము
గాని, చేయుమని పలుమా రొకరు చెప్పుటచేత, అతని మన
స్సొక్కొకవేళ తిరుగును గాని, యతఁ డటుల సాధారణముగ
మనస్సును తిరుగనియ్య లేదు. అతఁడు నిష్కర్షగ వ్యవహార
ములను జరిపెను. కొన్ని పరగణాలలో సర్కారుద్యోగస్థులు
ప్రజలను బీడించి సొమ్ము నపహరించుట గలదు. అతఁ డేపర
గణాలలో సర్కారుపనిఁ జేసెనో, యక్కడివారందఱు సుఖ
ముగ జీవించి, యతనిని బొగడిరి. అతనికి ధనదాహము లేదు.

‘ప్రేటరు’ద్యోగము లనేకములు గలవు. అందులో



రోమునగరములోని యుద్యోగము శ్రేష్ఠము. అందుచేత
నా పనికి, బ్రూటసు, ఇతని బావమరది ‘కాసియసు’ వీ రిరు
వురు దరఖాస్తుఁ జేసిరి. వారిరువురలో బ్రూటసు నా పని
లో సీజేరు నియోగించెను. వీ రిరుగురితో సఖ్యతగ నుండ
వలెనని సీజేరుయొక్క యభిప్రాయము. ఇతఁడు సమకూర్చు
చున్న యేకచ్ఛత్రాధిపత్యమునకు వీరుమాత్ర మిష్టపడ లేదు.
మరియొక యుద్యోగమిచ్చినను, ‘కాసియసు’ లోలోన ఘూర్ణి
ల్లుచుండెను. బావమరదుల కెప్పుడును వైరమె. బావమరది
చొరవరి, తొందరపాటుగలవాఁ డని యతనికి కోపము.

బ్రూటసు ‘ప్రేటరు’గ నుండుకాలములో, ‘ప్రజాపీడ
కుల నెఱుంగుము. ఎఱుంగకపోయిన, నీవు బ్రూటసువు
కావు’’ అని వ్రాయఁబడిన కాగితములచేత నతని న్యాయపీఠ
మలంకరించఁబడియుండెను. అంతలో సీజేరును జంపుటకు,
కాసియసు మొదలగువారు సమకట్టి, కొంచెము పేరుగలవాఁడు
కుట్రకులకు నాయకుఁడుగ నుండిన సలక్షణముగ నుండు నని
యెంచి, బ్రూటసును దమలోఁ జేర్చుకొనుట కాలోచించిరి.
ముందుగ నతని భావము గనుగొని, వా రతనిని గలుపుకొనిరి.
నాఁడుమొద లతఁడు స్వాస్థ్యము గోలుపోయి హాయిగ నిద్రిం
చుట లేదు; అతని గుండెలు బరువెక్కెను; నిదురలోఁ ద్రుళ్లిపడి
లేచుట సహజమాయెను; కళంక రహితునకు కళంకము తగి
లె. ముఖముఁజూచిన మీఁగాళ్లవాపు బయల్పడు ననులోకోక్తి

నిజమయ్యె; కచ్చేరిలో నతఁడు తన ముఖమును వికాసముగ నుంచ జూచెనుగాని అట్టిపని వీలుగాదయ్యెను. పనిపాటులు లేనిసమయములో నతఁడు మౌనముగ నుండును. అతని మనో వ్యథనుభార్య కనిపెట్టి, యతని నడుగుట యుచితముకా దని తలంచి, యొక పన్నాగము పన్నెను. పరివారకు లందఱను బొమ్మని, కత్తితో నామె తన చేతిమీఁద నొక గంటు వెట్టు కొనెను; రక్తము కారుచుండెను. అప్పుడు భర్తవచ్చి కారణమే మని యామె నడిగెను. ఆమె కారణముఁ జెప్పక "ఏమైన మీకేమి? నేను మీకు సహధర్మచారిణియని తోఁచిన, మీ మనోవ్యథను నాతోఁ జెప్పియుందును. అటుల చేయలేదు గనుక,...." అని యేడ్వసాగెను. ఆమె చదువుకొనినది; బుద్ధి మంతురాలు; ఆలోచన పరురాలు; 'స్త్రీలనోటిలో నూఁగింజ నాన'దను మాట తెలిసినను, నామెతో నతఁడు కుట్రసంగతిఁ జెప్పెను. ఆమె గాయముఁ జూపించెను.

అనంతరము సీజేరు సభలోనికి వెళ్లుటయు, కుట్రదారు లంద ఱతని నక్కడ బొడిచి చంపుటయు జరిగెను. కొంతవఱకు సీజేరు వారి నెదిరించెనుగాని, బ్రూటసు తనను బొడుచుట చూచి, 'అరే, బ్రూటసు, నీవుకూడానా' యని యతఁడు కండ్లు మూసికొని నేలఁగూలెను. శత్రువును సంహరించి, ప్రజారాజ్య మును నిలఁబెట్టినందుకు, సెనేటుసభవారు బ్రూటసు నభినం దించిరి; ప్రజలుగూడ సీజేరు మరణమునకు విచారించలేదు.



తదుపరి సీజేరుయొక్క దినవారములు వచ్చెను. అతనికి నపరకార్యములఁ జేయుట కతని స్నేహితుఁడు 'ఆంతోని' యారంభించెను. శవమును రుద్రభూమికిఁ దీసికొని పోవుటకు ముందు, మరణము నొందినవాని బంధువుఁ డొకఁడు ప్రే తోపన్యాస మొకటిసేయుట, రోమకులలో వాడుక కలదు. మరుచటిదినము 'ఆంతోని' ప్రజలయెదుట ప్రేతోపన్యాస ము నిచ్చెను. చనిపోవుటకు ముందు, సీజేరు మరణశాసన (విల్లు) మొకటి వ్రాసి, దానిలోఁ బ్రతి రోమకునకు సుమారు రు ౫౦ లిచ్చి, నగరమునకుఁ బైనున్న యుద్యాన వనములు తోఁటలు మొదలగువానిని ప్రజలు వాడుకొనవల సినదని శాసించెను. ఈ శాసనమును 'ఆంతోని' చదివి వారికి వినిపించెను. అదివఱకు సీజేరు మరణమునకు విచారించని వారంద ఱుద్రేకించి, కుట్రదారులను సంహరించుటకు సిద్ధ పడిరి. సీజేరుకు తగిలిన గాయముల నతఁడు వారికిఁ జూపించెను. వారు వానిని జూచి విశేషముగ కోపించి, బల్లలు కుర్చీలు మొదలగువానిని తగులబెట్టి, యా కొరకంచులతోఁ గుట్ర దారుల గృహములను దగులబెట్టుటకుఁ బోయిరి. ఈ సంగతి వారు విని గృహములు విడిచిపోయిరి. బ్రూటసు లేచి పారి పోయెను.

అనంతరము సీజేరుయొక్క మేనల్లుఁడు 'అగస్టసు-సీజేరు' నగరమునకు వచ్చెను. ఇతఁడు 'ఆంతోని'తోఁ గూడి, ‘లెపిడసు

యనువానితో సహా దేశమును బంచుకొనెను. బ్రూటసు 'ఆథెన్సు' నగరములో నివసించుచుండెను. లోలోపున నతఁడు 'కాసియసు' మొదలగు స్నేహితులద్వారా పనిచేయించి, సైన్యమును జేర్చెను. రోముకు దూర్పుననున్న దేశము లతనికి స్వాధీనమయ్యెను. అతఁడు సైన్యములను దీసికొని 'అగస్టసు' పైకి వెడలెను. ఒకనాఁడు వీరు విడిదిచేసిరి. అతఁడు విశేషముగ నిద్రపోవువాఁడుగాఁడు. రాత్రి భోజనముఁ జేసి, ౨౩ గంటల కాలము శయనించి, శేషించినకాలములోఁ జదువును; కొంతవర కుత్తరువులను వ్రాయును. స్కంధావార మా రాత్రి నిశ్శబ్దముగ నుండెను. శిబిరములో నతఁడొంటరిగ గూర్చుని వ్రాసికొనుచుండెను. అప్పుడు నిశిరాత్రి; ఒక ఛాయాగ్రహ మతని యెదుట నిలిచెను. "నీ వెవ్వఁడవు? నాతో నీకేమిపని?" యని యతఁడడిగెను. "నేను నీ దురదృష్ట దేవతను. యుద్ధములో నన్ను చూడగల"వని చెప్పి యా గ్రహము జారిపోయెను. అనంతరము పోరయ్యె. ఉభయసైన్యములు దార్కొని మిన్నుముట్టనార్చుచు, బొడుచుచు, దిక్కులు తెలియక, వెనుదియ్యక, పోరాడిరి. అగస్టసు జయముఁ బొందెను. కాసియసు మొదలగువారు మడిసిరి. బ్రూటసు మువ్వురు పరిచారకులతోఁ గూడి పరారియయ్యెను. వీరొక కొండ గుహను జేరిరి. స్నేహితులకు గలిగిన విపత్తునకు విచారించి, తనను జంపివేయవలసినదని యతఁడు సేవకులకు



వేఁడెను. వారిలో నొకఁడు కత్తియెత్త, దానిమీఁదఁబడి యతఁడు ప్రాణములు విడిచెను. సేవకు లాత్మహత్యఁ జేసికొనిరి. ఈ యుద్ధము క్రీ. పూ. సం॥ ౪౨ రములో జరిగెను. భర్త మరణము విని, యతని భార్య దుర్మరణము దెచ్చుకొనెను.

అతఁడు గ్రంథపఠనకుఁ దగినవాఁడుగాని, సర్కారు పనికిఁ దగినవాఁడుకాఁడు; ప్రజారాజ్యమును నిలబెట్టుటకు పాటుపడెను; స్వదేశాభిమాని యని పేరొందెను. ఆ కాలములో నతఁడు మంచినడవడికలవాఁడు; చదివిన చదువుల నతఁడభ్యాసములోనికిఁ దీసికొని రానందున, నవి నిష్ప్రయోజనములయ్యెను. మంచి జ్ఞాపకశక్తిగలవాఁడు. ప్రజానాయకుఁడగుటకుఁ దగిన త్రిశక్తు లతనికి లేవు. అందుచేత, నతఁడు మాటుపడెను.



# మార్కు-ఆంతోని

ఇతని తాత పేరు 'మార్కు-ఆంతోని'. ఇతఁడు 'సిల్లి' నీపక్షములోనివాఁడగుటచేత దుర్మరణమునొందెను. ఇతని తండ్రిపేరు 'ఆంతోని'. ఇతఁడు పెద్దయుద్యోగ్యములు చేసినట్లు కనఁబడదు. అయినను నితఁడు ధార్మికుఁడు; శాంతుఁడు; నెమ్మదిగఁ గాలముఁ గడిపెను. ఇతనియొద్ద కొక స్నేహితుఁడు డబ్బులేనందున, సహాయము చేయుమని కోరవచ్చెను. ఇతనివద్ద సొమ్ములేదు; లేదని చెప్పలేఁడు; అందులో, భార్యవద్ద భయము. కుమారుని బిలిచి, వెండిగిన్నెలో నీరుపోసి తెమ్మని చెప్పి, వాఁడు దానిని తెచ్చిన తరువాత, వానిని లోనికిఁ బంపివేసి, యాగిన్నెను స్నేహితునికిచ్చి వీనిని సంతోషపెట్టెను. తరువాత గిన్నె కనఁబడనందున, భార్య పరిచారకులను దండించుటకు సిద్ధమయ్యెను. అప్పుడితఁడామెతోఁ దాఁజేసిన సంగతిఁ జెప్పి, యామెను శాంతిపఱచెను.

తండ్రి మరణమునొందెను; తల్లి మఱియొకనిని వివాహమాడెను. పిదపఁగూడ నతఁడు తల్లి సంరక్షణలో నుండెను. సవతితండ్రి 'కాటిలీని' కుట్రలోఁ గలిసియున్నందున, శిశిరో యతనిని జంపించివేసెను. అందుచేత, శిశిరోకును, ఆంతోనికి





వైరముపుట్టెను. ఆంతోని మంచి చక్కనివాఁడు; శృంగారపురుషుఁడు. స్నేహితులతోఁ గలిసి మద్యపానముఁ జేయుచు, వారాంగనల పొత్తును బొంది కాలముగడిపి, ౨౫౦ టాలంటులు ఋణముచేసెను. ఈ సంగతి తండ్రి తెలిసికొని, కుమారాంతోనిని గృహము వెడలఁగొట్టెను. అతఁడు వెంటనె గ్రీసుదేశమునకుఁ బోయి, యక్కడ రణశిక్షను బొంది, వక్తృత్వమును నభ్యసించెను.

గ్రీసుదేశములో 'గబీనియసు' అనువాఁడు పాకుదర్శకుఁడు (Proconsul)గ నుండెను. ఇతఁడు సిరియాదేశమునకు యుద్ధమునకు వెళ్లినపుడాంతోనిని గూడ రమ్మనెనుగాని, యతఁడు సామికుఁడుగ వెళ్లుట కిష్టపడనందున, నతనిని రాహుత్తుల సేనానిగ నియోగించి వెంటఁదీసికొని వెళ్లెను. ఆంతోని మహాశూరుఁడు. సిరియాలోని పట్టణమును ముట్టడించినపుడు, ప్రప్రాకారగోడల నతఁడు ముందుగ నెక్కెను; శత్రువుల దునుమాడి, రోమకుల కతఁడు జయముఁ గలుగఁజేసెను.

తరువాత మఱికొన్నిదినములకు 'ఈజిప్టు' దేశపురాజు తనకు సహాయముఁ జేయుటకుఁ గొంత సైన్యమును బంపవలసినదని కోరినందున, 'గబీనియసు' ఆంతోనిని సైన్యముతో వెడలవలసినదని యుత్తరువుచేసెను. అతఁడచటికిఁ బోయి, రాజుయొక్క శత్రువులను దునుమాడెను. అతనిని స్నేహితుఁ డొకఁడు శత్రుపక్షమున పోరాడి పోరాటములోఁ బడినందున,

వాని శరీరమును దెప్పించి, దాని నతఁడు దగిన మర్యాదలతోఁ బాతిపెట్టించెను.

అతఁడు మహోన్నతపురుషుఁడు; విశాలఫాలముగలవాఁడు; వెడదయురమువాఁడు. భేతాళుని (Hercules) వంశమువాఁడని వాడుకగలదు. అతఁడు పెద్ద గడ్డము పెంచెను; పెద్దకత్తి పట్టుకొని తిరుగువాఁడు; సైనికులచేతఁ బ్రేమించఁబడెను. వారివలె నతఁడు భాషను వెట్టిమొట్టిగ మాటలాడుచుండెను; వారితోఁ గలిసి భోజనము జేయుటగలదు. అతఁడు శృంగారచేష్టలలోఁ దిరుగుటయేగాక, పరులను వానిలో దింపుచుండెను. అతఁడు మహోదాత; అడిగినవానికి లేదని చెప్పుటలేదు. ఈ సుగుణ మతని దుర్గుణములను గప్పివేసెను.

ఈ కాలములోఁ బాంపేయునకు, సీజేరుకు వైరము మెండయ్యెను. ఆంతోని, సీజేరుపక్షము నవలంబించెను. పాంపేయుఁడు యుద్ధములో నోడి, యీజిప్టు దేశమునకుఁ బోయెను; సీజేరు సర్వాధికారి (Dictator) యయ్యెను. ఇతఁడు, ఫ్రాన్సు, స్పానియా దేశములకుఁ బోవునపుడు, రోమునగరములో నాంతోనిని సర్వాధికారిగ నియమించి, తాను వెడలెను.

ఆంతోని 'ఫుల్వియా' యను నామెను వివాహమాడెను. ఆమె స్త్రీయైనను, పురుషలక్షణములు గలది. సేనాధిపతులను,



ప్రజాధిపతుల నామె లొంగఁదీసెను. ఆమె చేతిలో నాంతోని యేపాటివాఁడు? ఆమె మాట కతఁ డెదురునడుచుటకు వీలులేదు. ఆమెను లాలనఁ జేయఁదలఁచి, యామెచేత నతఁడు లాలనఁ జేయఁబడెను.

ఈలోపున సీజరు స్పానియా దేశమునుండి జయము బొంది వచ్చుచుండెను. ఇతని నెదురుకొనుటకై ఆంతోని వెళ్లెను. ఉభయులొక రథముమీఁదఁ గూర్చొనివచ్చిరి. వీరజయోత్సవములు చేయఁబడెను. రాజమర్యాదలు సీజేరు బొందెను; కాని అతఁడు రాజచిహ్నములను ధరించుటకు ప్రజ లియ్యకొనలేదు. మరి కొంతకాలము గడచినపైని, సీజేరు దుర్మరణము నొందెను.

ఈ సంగతివిని ఆంతోని చాల దుఃఖించెను; తన వాచాలత్వముఁ జూపి ప్రజల రేపెట్టెను. వారు కుట్రదారుల గృహములను దగుల బెట్టిరి; పట్టణము విడిచిపోఁ జేసిరి. తరువాత సీజేరుయొక్క మేనగోడలికొడుకు 'అగస్టసు - సీజేరు', ఆంతోనియొద్దకు వచ్చెను. ఇతఁడు చిన్నవాఁడని యుపేక్షించి, వచ్చినవాని ఆంతోని విశేషముగ మన్నించలేదు. అగస్టస్సు కోపగించి, దేశములోనికిఁ బోయి, సైన్యములను గూర్చ నారంభించెను. ఆ సంగతి 'ఆంతోని' విని బలములను బోఁగుచేయ సమకట్టెను. ఉభయసైన్యములు దారుకొని పోరాడెను. ఆంతోని పరాజయముఁ బొందెను.

అతఁడు మార్గములో నానాశ్రమలుపడి, 'ఆల్ప్సు'పర్వత

ప్రాంతములకు వచ్చెను. సేనాధిపతి 'లెపిడస్సు' సైన్యముతో నక్కడ విడిదిచేసియుండెను. అతనిని తనపక్ష మవలంబించమని ఆంతోని వర్తమానము బంపెను. అతఁడందులకు సమ్మతించలేదు; సైనికు లా మాటవిని, వెంటనె తిరుగుబాటుచేసి, వారంద ఱొక్కుమ్మడి ఆంతోనిని సేనానిగఁ బ్రకటనఁ జేసిరి. అతఁడు 'లెపిడస్సు'ను మర్యాదగఁ జూచి ఉపసేనానిగ నియోగించెను. పదివేల రౌతులకును పదునేడు దళములకును నతఁడు సేనాధిపతియయ్యెను. 'ఫ్రెంచి' దేశమును గాపాడుట కతఁడాఱు దళముల నక్కడ నుంచివేసెను.

'శిశిరో' ప్రజారాజ్యమును నిలబెట్టవలెనని కోరుచుండెను; 'అగస్టస్సు' అందుకు సమ్మతించలేదు. అందుచేత, నితఁడు 'ఆంతోని' పక్షము వచ్చిచేరెను. 'అగస్టస్సు', 'ఆంతోని', 'లెపిడస్సు' — వీరు ముగ్గురు 'రోము' రాజ్యమును మూఁడు సమభాగములుగఁ బంచుకొనుటకు సమకట్టి, యొడంబడికఁ జేసికొనిరి. మూఁడువందలమంది శత్రువులను వారు పరలోకమునకు బంపిరి. 'శిశిరో' కూడ దుర్మరణము నొందవలసి వచ్చెను.

ఉచ్చపదవి వచ్చినతోడనె, 'ఆంతోని' యథాప్రకారము విషయాసక్తుఁడై తిరుగుచుండెను. 'ఘనుఁడు పాంపేయు'ని గృహములో నతఁడుండెను; ప్రజల కష్టసుఖములు వినుటలేదు; అహోరాత్రములు వారాంగనలతోను, తుచ్ఛులతోఁ



గాలము గడుపుచుండెను. అతఁడు తన కూఁతురును 'అగస్టస్సు'కిచ్చి వివాహము జేసెను. ఈ సంగతులు చూచి ప్రజలు రోసిరి. వారు సైన్యములతో వీరిమువ్వురిమీఁద దిరుగఁబడిరి. ప్రజల సేనాధిపతులు 'బ్రూటసు', 'కాసియసు' మొదలగువారు రణములో హతులైరి.

'అగస్టస్సు'ను రోము నగరములో నుంచివేసి, 'ఆంతోని' కప్పములను బుచ్చుకొనుటకు 'గ్రీసు' మొదలగు దేశములకు బోయెను. ఇక్కడ రోములో 'అగస్టస్సు' పడుచున్న బాధలను గనిపెట్టక, విశేషముగ ధనమును బుచ్చుకొని, దానిని నతఁడు దుర్వినియోగము జేయుచుండెను. 'కాకులను గొట్టి, గద్దలకు వేయుట' యనునటుల, ప్రజలను బీడించి రాఁబట్టిన ధనము నతఁడు వేశ్యలకు, భట్రాజులకు నిచ్చుచుండెను. అతఁడు చక్కనివాఁడనని తెలిసి, రాజపత్నులు, సుందరాంగులు మహావిభవముతో నతనిని జూడవచ్చిరి. ఆ వచ్చినవారిలో 'ఈజిప్టు' రాణి 'క్లియోపాత్రా' కూడ నుండెను. ఈమె వలంపు టతనికి తగులుకొనెను. ఆమె వలలోఁబడి, దివారాత్రము లతఁడు గానరాకుండెను.

'జూలియసు సీజరు', 'పాంపేయుఁడు' — వీరి కాలములో నామె చిన్నది. ఇప్పటి కామెకు యుక్తవయస్సు వచ్చెను. ఆమె రెండవ రతీదేవివలె నుండెను. ఆమెకు నాలుగైదు భాషలలోఁ బ్రవేశము గలదు; సరసముగ మాటలాడునది. మహావైభవ

ముతో నామె 'ఆంతొని'ని జూడవచ్చెను. ఆమెకు జిక్కి, యతఁడు వ్యవహారములను విడిచిపెట్టెను. "అహో మోహాస్య దుశ్చేష్టితం!" విందులు, నాట్యములు, నాటకములు—వీనిలో వారు మునిఁగి తేలుచుండిరి.

అతని భార్య 'ఫుల్వియా' రోము నగరములో నుండెను. దుర్వ్యాపారములు గలవాఁడని, అతని పక్షము వారతనిని నిరసించి విడిచిపెట్టుదురను భయము కలిగి, యామె కొన్ని కుట్రలు పన్నెను. వీనివలన స్వపక్షము వృద్ధిఁ బొందునని యామె యెంచెనుగాని, కలహములు లావై, 'అగస్టస్సు', 'ఆంతొనీ' లకు వైరము పుట్టెను. ఈ సంగతులు విని, 'ఆంతొని' 'రోము' నగరమునకు వచ్చెను. ఇంతలో నతని భార్య మృతినొందెను. అతఁడు 'అగస్టస్సు'తో సఖ్యము జేసికొనెను. తూర్పు దేశములకు 'ఆంతొని', 'పశ్చిమ' దేశములకు 'అగస్టస్సు'—ప్రభువులైరి. 'ఆఫ్రికా' దేశమును 'లెపిడసు'నకు వారిచ్చిరి. భార్య చనిపోయినందున, 'అగస్టస్సు' యొక్క సవతియక్క 'ఆక్టేవియా'ను 'ఆంతొని' వివాహమాడెను. ఈ సంబంధము వారి మైత్రిని బలపరచెను.

'ఘనుఁడు పాంపేయుని' కుమారుఁడు 'సిసిలీ' ద్వీపములో ప్రభువుగ నుండెను. ఇతనితో మైత్రి జేసి, 'ఆంతొని' 'గ్రీసు' దేశమునకుఁ బోయెను. అక్కడ గరిడీయుత్సవములు చేయించుటలో నతఁడు కొంతకాలము గడిపెను. 'పార్థియులు'



తిరుగుబాటు చేసినందున, వారిని దండించుటకతఁడు తన సేనానిని సైన్యముతోఁ బంపెను. ఇతఁడు పోయి శత్రువుల నోడించెను.

ఇంతలో 'అగస్టస్సు' కొన్ని వ్యాపారములను వ్యక్తిలేక ముగించఁ జేయుఁదలపెట్టెనని విని, ౩౦౦ నావలను దీసికొని 'ఆంతొని' స్వదేశమునకు వచ్చెనుగాని, యోరేవు పట్టణములో నిలఁబడుటకతనికి వీలులేకపోయెను. అప్పుడతని భార్య నిజమైన సంగతిని గనుగొనుటకు తన యన్నయొద్దకు వెళ్లెను. బావమఱఁదులకామె సంధి చేసెను. భూసైన్యములో రెండు దళములు 'ఆంతొని'కిచ్చుటకు 'అగస్టస్సు' ఒప్పుకొనెను; ఇతనికి నూరు నావల నిచ్చుటకతఁడొప్పుకొనెను. పిల్లలను, గర్భిణితో నున్న భార్యను 'అగస్టస్సు'కప్పగించి, యతఁడు తూర్పు దేశములకుఁ బోయెను. 'కుమార పాంపేయుఁడు' తిరుగుబాటు చేసినందున, వానిని దండించుటకు 'అగస్టస్సు' 'సిసిలీ' ద్వీపము వెళ్లెను.

'ఆంతొని' కొంతకాలము గ్రీసులోను, కొంతకాలము 'క్లియోపాత్రా' సన్నిధిని గడిపెను. ఎక్కడనున్నను, నతఁడామెను స్మరించని దినము లేదు. ఇంతలో 'పార్థియుల'తో యుద్ధము తటస్థమయ్యెను. రోమకులు వారితోఁ బోరాడిరి; జయాపజయములు తెలియవు; నిలుచుటకు నీడ, తినుటకు తిండి, రోమకులకు లేకపోయెను. శత్రువులు దొంగయుద్ధము

జేయు నారంభించిరి. ముందు, వెనుక, ప్రక్కను ఎక్కడను శత్రువులే; దూరముననూ, సమీపమున వారలే; నిలిచి యుద్ధము సేయుడు. ప్రాణములు దక్కించుకొని, రోమకులు 'ఆంతోని'తో బయటవచ్చి పడిరి. ఎందఱు రోమకులు శత్రు దేశములో జనిపోయిరో చెప్పలేము.

"భ్రష్టస్య కావా గతిః." దుర్వ్యసనములలో బడిన మనుజునకు బుద్ధిమాంద్యము గలుగును. ఇటు లపజయము బొంది, బాధపడుచున్న నతని మనస్సు 'క్లియోపాత్రా' యందు ప్రసరించెను. ఆమెను జూచి యతఁ డమందానంద మొందెను. ఇంతలో నతని భార్య పిల్లలతో వచ్చుచున్నదని వర్తమానము బంపెను. కొంత సైన్యముతో నామె ధనమును, తినుబడి వస్తువులను, సైనికులకు దుస్తులను బట్టుకొని, బయలుదేరెను. ఈ సంగతి వినినతోడనే, 'క్లియోపాత్రా' మనస్సునను సవతి వైర ముదయించెను. ఒకప్పుడు సొక్కుచు, సోలుచు, భోజనము మాని కృశించి, భర్తృవియోగమును భరించలేని దానివలె నతని యెదుట నటించెను. అతని కామెయం దిరువురు పిల్లలు గలిగిరి. ఈమె వలపులకు జిక్కి, 'ఆథెన్సు' పట్టణములో నుండ వలసినదని భార్యకతఁడు జాబు వ్రాసిపంపెను. దేశములు దోచి తెచ్చిన ధనమునే కాదు, దేశములనే నతఁడు క్లియోపాత్ర కిచ్చివేసెను. ఆమె ఈజిప్టు దేశపు రాణి; ఇప్పుడు మఱి నాలుగు దేశములకు కూడ రాణియని ప్రకటింపఁబడెను.



ఇంతియ కాదు - ఆంతోనికి మొదటి భార్య 'ఫుల్వియా'కు కలిగిన బిడ్డలు, రెండవ భార్య 'ఆక్టేవియా'కు జనించిన వారు, 'క్లియోపాత్రా'కు బుట్టిన వారు కలరు. వీరిలో నాలుగువారి నతఁడు దేశములకు రాజులుగఁ జేసెను. అతని భార్య రోము నగరమునకు బోయి, యక్కడ భర్తృగృహములో నుండి, తన పిల్లలను సవతిపిల్లలను బెంచుచు, భర్తయొక్క గౌరవమును జెడగొట్టక, తమ్ముఁడైన 'అగస్టసు'కు భర్తపైని కోపము బుట్టకుండునటుల ప్రవర్తించుచుండెను. ఆమె యవస్థ జూచి, యందఱు దుఃఖాక్రాంతులై, రగులుచుండిరి. రోమునగరమునకు వచ్చినపుడతఁడు రాణి ననుసరించి తిరిగెను గాని భార్య నక్కఱ చేయలేదు.

అనంతర మతఁడామెతో 'ఈజిప్టు' దేశమునకు బోయెను. అతనికి, 'అగస్టసు'కు వైరము పుట్టెను. ఇరువురు సైన్యములను బోగుచేసిరి. ఆంతోనికి దైవబలము లేదు; దైవీ బలే దుర్బలే. అతని భూనావికా సైన్యములు గొన్ని యోడిపోయెను. మిగిలినవి 'అగస్టసు' పక్షమునకు వెళ్లెను. ఇటుల పరాభవము బొంది, 'ఆంతోని', 'క్లియోపాత్రా'లు 'ఈజిప్టు' వచ్చిచేరి, సంధిమాటలలో కొదిగిరి.

ఈ మాటలు విని, 'అగస్టసు' ఆమె కభయమిచ్చుటకు నిశ్చయించెను గాని, అతని దండించెదనని వర్తమానము బంపెను. సైన్యమును దీసికొని 'అగస్టసు' వారి పట్టణము

మీాదికి వచ్చెను. కొంతవఱకు కాంతోని శేషించిన సైన్యము సాయమున వారితోఁ బోరాడెను గాని కార్యము లేకపోయెను. ఇంతలో రాణి చెప్పిన ప్రకారమామె చనిపోయినదని భృత్యులతనితోఁ జెప్పిరి. అదివిని, యతఁడు కలఁతఁ జెంది, తనను కత్తితోఁ బొడిచి చంపవలసినదని దగ్గఱనున్న పరిచారకుని వేఁడెను గాని, వాఁ డటుల చేయలేక, కత్తితోఁ బొడుచుకొని చచ్చెను. వాని ధైర్యమునకు మెచ్చి, యతఁడు తల్వారు తీసికొని దానిని తన కడుపులోఁ గ్రుచ్చుకొనెను గాని, యతఁడు చావలేదు. శ్రమనివారణముఁ జేయవలసినదని పరిచారకుల నతఁడు వేఁడెను గాని, వారతనిని జంపలేకపోయిరి. రాణి బ్రతికియున్నదని చెప్పి, వారతనిని నామెయొద్దకు మోసికొనిపోయిరి.

ఇంతకు పూర్వమామె సునాయాసముగ మరణము నొందుటకుపాయములను బరికించి, వానిలో 'ఆస్ప్' యను పురుగుకాటు మంచిదని యెంచి, వానిని తెప్పించియుంచెను. అతని మరణావస్థను జూచి, యామె యా పురుగులచేతఁ గరిపించుకొనెను. కొంతవఱకు వారుభయులు మాటలాడుచు, నొకరిచేతులలో నొకరు ప్రాణములను విడిచిరి. వీరు క్రీ. పూ. సం|| 30 రములో స్వర్గస్థులయిరి.



# లైకర్గసు

ధర్మశాస్త్రజ్ఞుఁడైన 'లైకర్గసు'ను గురించి తెలిసిన సంగతులన్నియు వివాదాస్పదములయినవి. అతఁ డెప్పుడు పుట్టెనో, యెన్నఁడు గిట్టెనో; యే యే దేశములలోఁ దిరిగెనో; ధర్మశాస్త్రము నెటుల సమకూర్చి, రాజ్యతంత్రము లెటుల నిర్మించెనో—ఈ యంశములు పలువురు పలువిధముల వ్రాసిరి. ఇతఁడు గ్రీసు ద్వీపకల్పమునకు దక్షిణమున నున్న 'స్పార్టా' యను మండలములోని వాఁడు. కులీనుఁడు; క్షత్రియుఁడు; భేతాళుని (Hercules) వంశములోని వాఁడు.

తండ్రి సంతానములో నతఁడు రెండవ వాఁడు. అతని జ్యేష్ఠభ్రాత కొంతకాలము రాజ్యము చేసి స్వర్గస్థుఁడయ్యెను. ఇతని భార్య నెలదప్పియుండెను. లైకర్గసు తక్తు నెక్కెను. వదినెగారతని యందలి మక్కువ చేత గర్భస్రావము చేసికొనియెదనని చెప్ప, నతఁ డందుల కియ్యకొనక, పుట్టిన శిశువును చంపివేయవచ్చునని యామెకు సమాధానము పంపెనట. అతని మాటలామె నమ్ముకొనెను. ఆమె గర్భము దినదిన ప్రవర్థమానమై, నానాటికిఁ బ్రసవదినము లామెకు సంప్రాప్తమయ్యెను. ఆమె ప్రసవవేదన పడుచున్నదని భృత్యులు

వచ్చి రాజుతోఁ జెప్పిరి. సుపుత్రిక జననమందిన, దానిని దాసీల కప్పగించవలసినదనియు, సుపుత్త్రుఁడు కలిగిన దానిని తనయొద్దకుఁ దీసికొని రావలసిన దనియు వారి కతఁ డాజ్ఞ చేసెను. ఆమెకు పుత్త్రుఁడు కలిగెను. భృత్యు లా శిశువును రాజువద్దకుఁ దెచ్చిరి. ఆ శిశువే దేశమునకు రాజని ప్రకటన చేయించి, సంరక్షకుఁడను బిరుదుతో నతఁడు రాజ్యముఁ జేయుచుండెను. ఆ శిశువునకు 'చారులాసుఁ' డని నామకరణముఁ జేసిరి.

ఈ బాలుని జంపి, రాజ్యము నపహరించవలెనని యతఁడు కోరలేదు; అట్టికోరిక స్వప్నములోనైనను కలుగలేదు. బాలుని మేనమామ 'లియానిదాసుఁడు', యతని న్యాయపరిపాలనమున కోర్వలేక, యతఁడు బాలుని జంప సమకట్టుచుండెనని, నిందారోపణఁ జేసెను. అందు కతఁడు రోసి, బాలునికి వయస్సు వచ్చువఱకు దేశాటనఁ జేయుటకు నిశ్చయించి, రాజ్యసూత్రములను విడిచి, బయలు దేరిపోయెను.

అతఁడు మొదట 'క్రీటు' దీవికిఁ బోయెను. అక్కడి రాజ్యతంత్రముల నిర్మాణమును గనిపెట్టి, 'థాలీసు' అను వైణికునితో స్నేహముఁ జేసి, వానిని తన దేశమునకుఁ గాపురముబోయి యుండు మని చెప్పెను. థాలీసు వీణమీటించి కంఠమెత్తుసరికి, సభికులు పరవశు లగుచుండిరి. ఇతని కంఠస్వరము, వీణాస్వరములు రెండును సమ్మిళితములగుటచేత,



నేదియేదో సభికులు గుర్తెఱుగలేకయుండిరి. అవి షడ్రసములు జిలుకుచుండెను. అట్టివాఁడు తనదేశములో నుండిన, ప్రజలకు మేలుకలుగు నని యెంచి, లైకర్గసు నతనిని స్వదేశమునకుఁ బంపెను. థాలీసు స్పార్టనులను గొంత మార్గములోనికిఁ దెచ్చినపైని, లైకర్గసు వారిని సవరించుటకు వీలుపడెను.

ఆ ద్వీపమునుండి బయలుదేరి, 'ఆసియామైనరు'. 'ఈజిప్టు' మొదలగు దేశములకుఁ బోయి, యాయా దేశీయుల వేషభాషలను గుర్తెఱిగి, వారివారి రాజ్యతంత్రములలోని లోగుట్టులను గ్రహించుటలో నతఁడు గాలము గడుపుచుండెను.

ఇఁక స్వదేశముసంగతి యేమియు బాగులేదు. రాజు బాలుఁడు; రాజ్యతంత్రములను నేర్చుకొనుచుండెను; రాజ్యసూత్రములను బరులు వహించిరి. రాజుండినను, దేశ మరాజకముగ నుండెను. ప్రజలు ఘోష పెట్టుచుండిరి; రాజును, వాని సంరక్షకులను నిష్ఠురమాడుచుండిరి. అప్పుడు వారందఱేకీభవించి, 'లైకర్గసు'కు వర్తమానముఁ బంపి, యతనినిఁ దెప్పించిరి. అతఁడు వచ్చి, ప్రజలసమ్మతి పైని, రాజ్యతంత్రములను వారి కనుకూలముగ మార్చెను. అవతరించిన మార్పులలో 'సెనేటు,'యను సామంతుల సభయొకటి. రాజు, ప్రజలు —— ఒకరి నొకరు స్వబలముచేత మట్టివేయకుండునటుల వారిని సమశాంతముఁ జేయుటయే, యీ సభ వారిపని; ఉభ

యుల మర్యాదలను హక్కులను యథావిధిగ నిలబెట్టుచుండెను. ప్రజలు హర్షించి, యతనిని బొగడిరి.

ఆకాలమునాఁటికిఁ బ్రజలు భూములను సరిగా ననుభవించుటలేదు. కొంతభూమి సాగులేక పడియుండెను. సాగుబడియగుచున్నదానిలోనైన ప్రజలకు హక్కులేదు. కొందఱికి భూములు గలవు, కొందరికి లేవు. లైకర్గసు ప్రజలసమ్మతిపైని, ముందుజనాభా యెత్తించి, భూమిని కొలిపించెను. అప్పుడు దామాషాయిని భూమిని వారికతఁడు పంచెను. సాగులేని భూములను వరకట్టుట కతఁ డాప్రకారమె వారికిచ్చెను. వారిలో భాగ్యవంతుఁ డని బీదవాఁడని తారతమ్యము లేదు. సుగుణదుర్గుణములచేత నెవఁడైన బేరుపొందవలెను గాని, ధనముచేతఁగాదు. చరాస్తులనుగూడ సమానముగ పంచవలె నని యతఁడు గోరెనుగాని, ప్రజలందు కంగీకరించలేదు. అందుకతఁడు వారికి బుద్ధివచ్చునటుల నొకమార్పుచేసెను. టంకశాలలలో బంగారు వెండి నాణెములను ముద్రవేయింపించక, యినుప- నాణెములను ముద్రవేయింపించి, వీనిని చలామణిలోనికిఁ దెచ్చెను. ఈ నాణెము లెన్ని పోగుచేసిన, నొక బంగారు, వెండి నాణెముతో సమానమగును? అవి పెద్దవియగుటచేత, వానినైన సునాయాసముగఁ దీసికొని వెళ్లుటకుఁ బ్రజలకు కష్టముగనుండెను. అందుచేత వారికి తృష్ణపోయెను; వెండి బంగారములకు వారు దూరస్థులయిరి. సర్కారుద్యోగ



స్థులేమి లంచము పుచ్చుకొనియెదరు? వారెటుల పెద్దవేషములు వేయఁగలరు? వ్యవహారములలో వారమాయకులు. అందుచేతనే "స్పార్టను అమాయికత్వ"మని లోకప్రసిద్ధియయ్యెను.

ఈ మూలముననేగాక, మఱియొక విధమునగూడ వారికి విషయభోగములయం దతఁడు వారికి విముఖత గలుగఁజేసెను. ఆ బాలవృద్ధులందఱు కలిసి పంక్తిభోజనముఁ జేయవలసిన దని యతఁడు నియమించి, భోజనములోఁగూడ నిర్ణయించఁబడిన పదార్థములనె యుక్తముగ వారు భుజించవలయునుగాని, నిషేధింపఁబడినవానిని పుచ్చుకొనఁగూడదు. గృహములో భోజనముఁ జేసినవాఁడు గర్హ్యుఁడు. ఇటుల సహపంక్తిని వారు భుజించుటవలనఁ బొందిన లాభములను జెప్పనేల? యుక్తాహారమును మితముగ గ్రహించినందున నిరోగులై శరీరపాటవము గలవారై రని వచింపవలెనా? దేహబలమే మనోబలము కదా!

స్పార్టాలో మగశిశువు కలుగఁగానే, దానినందఱుఁ జూచి, మంచి యోపరి, దృఢశరీరము కలవాఁడగునని తోఁచిన, దానిని గృహములోఁ దల్లివద్దనుంచుదురు. ఆ శిశువే ముందుకు బలహీనుఁడు, కుసిష్ఠియగునని వారికిఁదోఁచిన, దానిని దీసికొని పోయి వారి సమీపముననున్న కొండమీఁద పారవేయుచుండిరి. గృహములో పెరిగిన శిశువు, తల్లివద్ద నేడుసంవత్స

రములవఱకుండి, తదనంతరము రాష్ట్రమువారు స్థాపించిన గరిడీ
శాలలోఁ బ్రవేశించును. అందులో వాఁడు తన యీడు
బాలురతోఁ గలిసి సాముఁ విద్యలను నేర్చుకొనును; ఎండ నీడ
యనక, ఆఁకలి దాహమనక, అన్ని కాలములలో నేకవస్త్రధారి
యై, గష్టపడును; ప్రాణములు నిలబడుటకుఁ దగిన యాహారము
మాత్రమే వాఁడు పుచ్చుకొనును. వాఁడెంత కష్టము భరించ
గలఁడో నిదర్శనముగఁ జూచుటకు పాధ్యాయులు వానిని
బెత్తముతో రక్తము వచ్చువఱకు గొట్టుటకలదు. వ్రాయను, చదు
వను మాత్రము వాఁడు నేర్చుకొనును. పెద్దచదువులు వారిలో
లేవు. మాటలలో వారు మితభాషులు. ముప్పదిసంవత్సరము
లు వచ్చువఱకు వారిలో నెవఁడు పెద్దవాఁడు కాఁడు. అప్పుడు
వాఁడు వివాహము జేసికొనుట కాజ్ఞఁబొంది వివాహమాడి
నను, భార్యతోఁ గాపురము జేయుటకు వానికాజ్ఞ లేదు; వాఁడు
గరిడీశాలలోనే యుండవలెను; సాముఁ విద్యలను జేయు
చుండును; సహపంక్తిని భుజించవలెను. ఇటుల అఱువదిసంవత్సర
ములు వచ్చువఱకు వాఁడు రాష్ట్రమునకై రక్తము ధారవోసి,
తదనంతరము గృహస్థాశ్రమధర్మములను జరుపుచుండును.
దీనినే స్పార్టనుశిక్ష యని లోకులు వాడుదురు.

ఇఁకను స్త్రీల విషయమై చెప్పవలెను. వారుకూడ రాష్ట్ర
ములోనివారు గనుక, గృహకృత్యములను జేయుటయేగాక,
రాష్ట్రమును నిలబెట్టుటకుఁ దగిన బలముగల సంతానము



నిచ్చువారు కావలెను. అందుచేత, వారుకూడ సాముఁ విద్య
లను నేర్చుకొని, మల్లయుద్ధము మొదలగువానిలో దేరి
పోరిరి. పురుషుల యెదుట వారీ విద్యలను గనఁబఱచుచుండిరి.
వారికి స్వాతంత్ర్యము గలదు. ఇరువది సంవత్సరములప్పుడు
స్త్రీ వివాహమాడినను, భర్తతోఁ గలిసియుండుట లేదుగాని,
రాకపోకలు మాత్రము గలవు. అన్యదేశపు కాంత యొకసారి
"మీలో స్త్రీలు పురుషుల నేలుదురని" లియోనుదాసుని
భార్యను వ్యధికరణముఁ జేయ "మా స్పార్టను స్త్రీలే పురుషు
లను కనియెదరని" యామె ఖండించెను. భర్తలను, కుమారు
లను శౌర్యము గనఁబఱచునటుల వీరు ప్రోత్సాహపఱచు
చుండిరి. యుద్ధమునకు కుమారుఁడు వెళ్లునపుడు, "నాయనా,
డాలు పట్టుకొని రమ్ము, లేదా దానిని పట్టుకొని పడిపొమ్ము" అని
తల్లి వానికుపదేశించును. స్త్రీపురుషు లాటపాటలలో గలిసి
మెలసి తిరుగుచుండిరి. బాగుగ నాట్యము జేసినవారికి బహు
మానమిచ్చుటకలదు. ఈ మార్పులన్నియు లైకర్గసు చేసెను.

ఇఁకను, స్పార్టనులు పైదేశములకు బోవుట కాజ్ఞలేదు;
విదేశీయులు వచ్చి వారిదేశములో నుండకూడదు. స్వదేశీ
యులు చెడిపోవుదురను భయముతో నతఁడీ నిబంధన జేసెను.
సమాధిస్థల మొకటి యేర్పఱచి, శవముల నక్కడనే సమాధి
జేయునటుల యతఁ డుత్తరువు చేసెను. ఇటుల నన్నివిధముల
రాష్ట్రము నుద్ధరించి, యతఁడు సంతసించెను. రాజ్యాధికము

లన్నియు సరిగా నడచుచుండెను. రాజును, సామంతులను సంసారులను పిలిపించి సభఁజేసి "నేను వీనికన్న విశేషమైనది మరియొకటి చేయఁదలఁచితిని. మీరు దానిప్రకారము నడుచుకొనియెద మని ప్రమాణముఁజేసిన, నేను దానిని నెరవేర్చెదను. మీ యభిప్రాయమేమి?" యని యతఁడు వారి నడిగెను. అతఁడు చేసిన నిబంధనల ననుసరించి నడచుటకు వారు ప్రమాణముఁ జేసిరి. తాను చేయఁబూనిన కార్యమునకు ముందు సోదె యడిగి మంచి చెడ్డలను కనుగొనుట కతఁడు 'డెల్ఫి' యను పట్టణమునకుఁ బోయెను.

గ్రీసుదేశములోఁ బ్రసిద్ధికెక్కిన 'అపాలో' యను సూర్యదేవాలయము 'డెల్ఫి' యను పట్టణములోనుండెను. పూనిన కార్యములయొక్క జయాపజయములు కనుగొనుటకు దేశదేశములనుండి ప్రజ లిక్కడకు వచ్చి సోదె యడిగి తెలిసికొనుచుండిరి. 'డెల్ఫిసోదె' యని లోకవిఖ్యాతమయ్యెను. ఈ దేవాలయములో మధ్య నొక బిలముగలదు. దీనిలోనుండి యొకవిధమైన వాయువు పైకి వచ్చుచుండును. సోదె చెప్పుటకుముందు, బిలముపై నొక ముక్కాలుపీట వేసికొని, దానిమీఁద సోదెకత్తె కూర్చుండును. ఆమె తల కా వాయువు యెక్కఁగానె, యామె స్మారకము తప్పి, సోదె చెప్పును. ఆమె పలికిన పలుకులను దగ్గఱనున్న యర్చకులు వ్రాయుచుండిరి. ఈ మాటలనే, 'అపాలో' దేవుఁడు భక్తులకు ప్రసన్నుఁడై, యామె ముఖత పలికె నని ప్రజలు విశ్వసించుచుండిరి.



ఇక్కడకు 'లైకర్గసు' వచ్చి, బలు లిచ్చి, సోదె యడిగెను. అతఁడు చేసిన పను లన్నియు శాశ్వతముగ నుండి, ప్రజలకు రాష్ట్రమునకుఁ గీర్తివచ్చు నని సోదె చెప్పిరి. ఆ మాటను వ్రాసి, యతఁడు స్వదేశమునకుఁ బంపెను. అతఁడు కష్టములు పడ లేదు; అన్నదూరుఁడు కా లేదు; మంచికాలములో నుండెను; రోగము లేదు; విచారము లేదు; అన్నివిధముల సుఖముగ నుండెను. అయిన; నతఁడు జీవించుట కిచ్ఛ లేక, యుపవాసములు చేసి శరీరమును గృశింపఁజేసి, కాలమునకు వశుఁడయ్యెను. అతఁడు నియమించిన నియామకముల ననుసరించినందున, నతఁ డేర్పాటుచేసిన రాజ్యాంగముల నయిదువందల సంవత్సరముల వఱకు స్పార్టనులు నిలఁబెట్టిరి.



# 'టైబీరియసు - గ్రాకసు'
# 'గేయసు - గ్రాకసు'

---

వీరిరువురు 'టైబీరియసు-గ్రాకసు' యొక్క కుమారులు. ఇతఁడు రోమునగరములోఁ బెద్ద యుద్యోగములు చేసి, ధర్మాత్ముఁడని పేరుఁ బొందెను. ఇతని భార్య 'కార్నీలియ'. ఒకనాఁ డతఁడు పండుకొని యుండ, రెండు సర్పములు వచ్చి యతని ప్రక్కనఁ బడుకొనెను. వానిని నతఁడు పట్టుకొని చంపఁ బోయెనుగాని, సోదెకాండ్రు గూడదని వారించిరి. పురుషసర్పమును జంపిన యతఁడు చచ్చునని, స్త్రీసర్పమును జంపిన యతని భార్య మరణము నొందునని వారు చెప్పిరి. అతఁడు పురుషసర్పమును జంపించి, రెండవదానిని విడిచిపెట్టెను. మఱి కొద్దికాలమున కతఁడు స్వర్గస్థుఁ డయ్యెను. సంసారము భార్య నిర్వహింపవలసివచ్చెను. ఆమెకుఁ బండ్రెండుగురు సంతానము.

భర్త మరణానంతరమున నామె సంసారమును జాగరూకతతో నిర్వహించుచుండెను. ఆమెను వివాహముఁ జేసికొనుటకు 'ఈజిప్టు' దేశపురాజు కోర్కిఁబడి, వర్తమాన మామెకుఁ బంపెను.





కాని, యామె యందుల కియ్యకొనలేదు. ఆమె సంతానమంతయు నశించి, యిరువురు కుమారులు, నొక కుమార్తెయును మాత్రమే యామెకు దక్కిరి. ఈ కుమారులే వీరిరువురు. వీరి జీవితచరిత్రములనే మనము వినఁబోవుచున్నాము.

అన్నదమ్ము లిరువురు మంచి గరిడీలు; రెండవవాఁడు స్వారీ చేయుటలో ఘనుఁడు. దాతృత్వము, వక్తృత్వము, ఔదార్యము, మితభోజనము, ధైర్యస్థైర్యములలో వారు సమానులే. రాజకీయ వ్యవహారములలో మాత్రము వారు భిన్నాభిప్రాయులు. పెద్దవాఁడు శాంతుఁడు; రెండవవాఁడు దుడుకు. స్థానము వదలక పెద్దవాఁ డుపన్యసించును; తమ్ముఁడు నాట్యముఁ జేయుచు ప్రసంగించును. జ్యేష్ఠుని ప్రసంగములు నిర్మలమై, విరివిగనుండును; కనిష్ఠునివి గంభీరమై మనస్సును గరగించును. అటులనే, వారికి భోజనములోగూడ ద్వైత్వము. ఒకఁడు మితభుక్కు; ఇతర రోమకులతోఁ బోల్చిన రెండవవాఁడు యుక్తాహారమును బుచ్చుకొనువాఁడైనను, పెద్దవానికంటె భోగియని చెప్పవచ్చును. ఒకఁడు ముందువెనుకలాలోచించి కార్యములను నెమ్మదిగఁ జేయును; రెండవవాఁడు తొందరపాటున మనస్సు కట్టలేక, దాని వ్యాపారములకు లోఁబడి, వ్యవహారములలో సాహసములను జూపుచుండెను. ఏకోదరు లిట్టి భిన్నవ్యాపారములు గలవారు.

మొదటివాఁడు చిన్నవానికంటెఁ దొమ్మిది సంవత్సర

ములు పెద్ద. ఇట్టి తారతమ్యము లున్నను, న్యాయవిచారణ లోను, నియామకముల ననుసరించుటలోను, శత్రువులను శిక్షించుటలోను, తదితర రాజకీయవ్యవహారములలో వారు సమానముగనుండిరి. ఈడులో నింత వ్యత్యాసము లేకపోయిన, వారు చేసిన కార్యములు విశేషముగ రాణించియుండును. ముందు పెద్దవాని చరితమును వ్రాయుచున్నాము.

పెద్దవాఁడు ధర్మాత్ముఁడు, శాంతస్వభావుఁడును గనుక, శకునజ్ఞుల (Augurs) కళాశాలలోఁ బ్రవేశించెను. వాని యోగ్యతనుజూచి, యా కాలములో రోమునగరములోఁ బెద్ద యుద్యోగముఁ జేయుచు పేరుఁబొందిన 'ఆపియసు-క్లాడియసు' తన కుమార్తె నతని కిచ్చి వివాహముచేసెను. అతని చెల్లెలిని 'చిన్న సిపియు'న కిచ్చి వివాహము జేసిరి. ఇతఁడు తేజోవంతుఁడు, పరాక్రమశాలి, రణవీరుఁడు. ఇతఁ డాఫ్రికాదేశములోఁ బోరాడుచున్నపుడు గ్రాకసు బావమఱఁదితోఁ గలసి పోయి, యుద్ధములోఁ దన బలపరాక్రమములను వెల్లడిచేసెను.

యుద్ధములో గెలిచి స్వాధీనముఁ జేసికొనిన భూములలోఁ గొన్ని రాష్ట్రమునకని, కొన్ని ప్రజలకని, యుంచి, మిగిలినవానిని రోమకులమ్మివేయుచుండిరి. కొంతకాలమునకు సామంతుల ప్రభ ప్రబలమై, భూములన్నియు వారె యాక్రమించుకొనిరి. అందుచేత, నైదువందల యెకరములకంటె హెచ్చుభూమి కెవఁడును ఖామందుగ నుండకూడ దని యొక



చట్ట మేర్పడెను. ఇందుమూలమున సామంతులు కొంతవఱకు లొంగి తిరుగుటకు వీలుపడెను.

చాలకాలము రోమకులు యుద్ధములలోఁ దిరుగుట వలన, పరదేశీయులు గాపురమువచ్చి వారి భూములను దున్నుచు భాగ్యవంతులయిరి. భాగ్యవంతు లయిన రోమకులు తమ భూములను హెచ్చు మొత్తమునకు కవులు వ్రాసినవారి కిచ్చుచున్నందున, నాదారుపడిన రోమకు లా మొత్తము లియ్య లేకపోయినందున, వీరు భూమినుండి తొలఁగించఁబడి, మోతుబరులైన పరదేశీయులు భూములను సాగుజేయుటకు నియమింపఁబడుచుండిరి. ఇటుల కొంతకాలము జరిగినపైని, రోమకులు డీలాపడి, నిలుచుటకు నీడ, తినుటకు తిండి, కట్టుటకు బట్ట లేక యుండిరి.

ఇంతలో 'టైబీరియసు' ప్రజానాయకుండుగ (Tribune) నియమించఁబడెను. అతఁడు వారి దురవస్థను జూచి, దానిని సవరణఁజేయుటకు సమకట్టెను. సామంతుల కది కష్టమయ్యెను; వారి లాభములు రాఁబడులు తగ్గును. వా రందఱొక్కుమ్మడి నతని నెదిరించిరిగాని, యతఁడు ప్రజల ప్రాపకము కలిగి యున్నందునఁ బూనిన కార్యమును నెఱవేర్చెను. భూములు కొలిపించి, వానిని రోమకుల కప్పగించెను. పరదేశీయులు భూములనుండి తొలఁగించఁబడిరి. ప్రజలందఱు సంతసించి, యతనిని వేనోళ్ల బొగడిరి.

అనంతర మతఁడు 'అక్షుదర్శకు'ని (Consul) యుద్యోగములోఁ బ్రవేశించెను. భూమి తగాయిదాలు తుద ముట్టలేదు. సామంతులను సంసారులను బొత్తుపఱుచవలె నని యతఁడుద్దేశించెను గాని, సామంతులు మొఱకుతనముచేసి, యతనిని జంపుటకు గుట్రపన్నిరి. ఒకరోజున నతఁడు 'సెనేటు'సభలో ముచ్చటించుచుండెను. అప్పుడు సామంతు లంద ఱేకీభవించి, యతనిపై తిరుగఁబడిరి. అతఁడు లేచి పారిపోయెను; అల్లరి బలమయ్యెను. సామంతులు ప్రజలు రాళ్లురప్పలతోఁ గొట్టుకొనిరి. అనేకులు చచ్చిరి. 'టైబీరియసు' దుర్మరణము నొందెను. ఆ శరీరమును దహనముఁజేయుటకు తమ్ముఁడు తీసికొని పోవుచున్నను, దానిని వారు బలవంతముగ లాగుకొని, 'టైబరు' నదిలోఁ బారవేసిరి. చనిపోవుసరికి, యతనికి ౩౦ సం॥ రములు లేవు.



# గేయసు - గ్రాకసు

అన్నగారు చనిపోయిన పిదప, గేయసు రాజకీయ వ్యవహారములలోఁ దిగుట కిష్టము లేక యుండెను. కొంతకాల మతఁడు గృహములో నుండిపోయెను. ఎంతకాలము నోమరిగ నుండగలఁడు? అందుచేత వక్తృత్వము నభ్యసించి, దాని మూలమునఁ బ్రజల దృష్టిలోనికి రావలెనని యతఁ డెంచెను. ఒక సమయమున నతఁడు సభలో వాదించినపు డతని వాచాలత్వమునకుఁ బ్రజలు సంతసించిరి. సామంతుల గుండెలు ఝల్లుమనెను. అతఁడు ప్రజానాయకుఁడు గాకుండునటుల వారు పన్నాగములు పన్నుచుండిరి.

అతఁడు 'సిసిలీ'ద్వీపమునకు, 'ఆఫ్రికా'దేశమునకు యుద్ధముఁజేయుటకు బంపబడెను. అతఁడు వీరుఁడు కాఁడని శత్రువు లనుకొనిరిగాని, వారి యూహ లబద్ధమయ్యెను. ఘోరముగ పోట్లాడి, శత్రువుల నతఁడు దునుమాడెను. రోమకసైనికులు దినుటకుఁ దిండి, కట్టుటకు బట్ట లేక బాధపడుచుండిరి. సెనేటుసభ వారికి వ్రాసినను, వారు వానిని బంపలేదు.

అతఁడు ప్రతి గ్రామమునకుఁ బోయి, తినుబడి సామగ్రులను వస్త్రములను, ధర్మార్థముగఁ గొన్ని, వెలయిచ్చి కొన్నవి కొన్ని దెచ్చి వారికి పంచిపెట్టెను. సైనికులతనిని శ్లాఘించిరి.

అతఁడు ప్రజానాయకోద్యోగములోఁ బ్రవేశించెను; ప్రవేశించినది మొదలు వారి విషయమై శ్రమపడుచుండెను. వారి క్షేమము నాలోచించి యతఁడు చేసిన కొన్ని చట్టముల నిందు బొందుపఱచుచున్నారము:—

(౧) ఏ న్యాయాధికారి నైన ప్రజలు పనిలోనుండి తొలఁగించినపుడు, వాఁడు తిరిగి యుద్యోగములోఁ బ్రవేశించుటకర్హుఁడు కాఁడు. (౨) ఏ న్యాయాధికారి యైన యేమనుజుని విచారణచేయక దేశోచ్చాటనకుఁ దీర్పు చెప్పిన యెడల, వాని నేరము న్యాయసభలో విమర్శింపఁబడునటులఁ జేయు బాధ్యత ప్రజలకునుండవలెను. సెనేటుసభవారి ప్రభ తగ్గించి, ప్రజల మాట ప్రబలముగునటుల, నతఁడు మరికొన్ని చట్టములను చేసెను. నూతన సీమల నేవిధమున నాక్రమించుకొనవలయునో, వాని నెటుల పరచుకొనవలయునో, వీని విషయమైనవి కొన్ని చట్టములు - యుద్ధమునకుఁ బోయినపుడు, కావలసిన దుస్తులు తినుబడి పదార్థములను సైనికులే తెచ్చుకొనుట కలదు. అతని చట్టముప్రకారము సర్కారువారు సైనికులకా వస్తువులను జత పెట్టవలసివచ్చెను. పదియేడు సంవత్సరములు ప్రాయము వచ్చు వఱకే మనుజుఁడు సైన్య



ములోఁ బ్రవేశించకూడదు; సర్కారువారేర్పఱచిన ధర ప్రకారము వర్తకులు సామగ్రుల నమ్మవలెనుగాని, హెచ్చువెలకమ్మఁగూడదు; ఈ నిబంధనల నతఁడు కల్పించెను.

ఎప్పుడు ప్రజల యెదుట ప్రసంగించినను, నతఁడు తన పుట్టు పూర్వోత్తరములను జెప్పుచుండెను. ముచ్చటించినపుడెల్ల, తన యన్న దుర్మరణము సంగతి యెత్తుచుండును; అప్పుడు వారు విచారించుచుండిరి. తన వాచాలత్వముచేత వారి నతఁడు పరవశులను జేయుచుండెను. కొందఱి నతఁడు నూతన సీమలకుఁ బంపెను. ప్రయాణములు సులువగుటకతఁడు బాటలు వేయించెను; నదులమీఁద వంతెనలను గట్టించెను; ధాన్యము నిలువఁజేయుటకు కొట్లు కట్టించెను. అతని వెంట పండితులు, రణవీరులు, పనివాండ్రు, రాయబారులు పోవుచుండిరి. యథావిధిగ నందఱిని మర్యాదఁ జేసి, వారితో నతఁడు మాటలాడుచుండెను. ఎంత పని చేసినను, శ్రమ లేదు; ఏ పని నైన నతివేగముగ గ్రహించును; దానికి తగినటుల ప్రత్యుత్తరములను వ్రాయును. అతఁడు రెండవ పర్యాయము ప్రజానాయకోద్యోగములో నియోగింపఁబడెను.

తదనంతర మతఁడు 'ఆఫ్రికా' దేశమునకుఁ బోయి, యక్కడ కొంతకాలముండి యా దేశమునకు స్వాస్థ్యము దెచ్చెను. అతఁడు నగరములో లేని కాలములో నతని చట్టములను రద్దుపఱచుటకుఁ గొందఱు సామంతులు ప్రయత్నించిరి

కాని, వారి పని సాగలేదు. ఇంతలో నతఁడు రాజధానికి వచ్చి చేరెను. సామంతులతనిని జూచి కటకట పడుచుండిరి. అందుచేత వారొక కుట్రపన్ని, యతనిని జంపించిరి. ఇటు లన్నదమ్ము లిరువురు ప్రజలవిషయమై పాటుపడి దుర్మరణము నొందిరి.



# సోలను



సోలను మంచివంశములోఁ బుట్టినవాఁడు. అతని తండ్రి ధర్మాత్ముఁడు; గొప్ప దాత. అతని మాతృవంశమువారు గూడ గొప్పవారనియే తెలియుచున్నది. దేహీయని వచ్చిన వానిని లేదనిచెప్పి తండ్రి పొమ్మన లేదు. అందుచేత నతనికి పిత్రార్జితము విశేషముగ లేదు. బ్రతికిచెడినవాఁడు గనుక, పూర్వము తమవలన నుపకారముఁ బొందినవారి సంరక్షణలో నుండుట కష్టమని యెంచి, యతఁడు పరదేశమునకుఁ బోయి, వర్తకవ్యాపారములలోఁ దిగెను. దేశసంచారముఁ జేసిసి మన స్సంస్కారము నతఁడు బొందెను. "వయస్సు ముదిరినకొలఁది నా బుద్ధి వికసించుచుండె" నని యతఁడు చెప్పెను.

ఆ కాలమున నేవ్యాపారమును ప్రజలు హీనతగఁ జూచుట లేదు; వానిలో వర్తకవ్యాపారమును విశేషము మన్నించిరి. వర్తకమూలమున నేకదా, పరదేశీయులతో సాంగత్యము, వారితో నిచ్చిపుచ్చుకొనుట, రాకపోకలు జరుగుచుండును? దేశీయులకు లావణ్యము, నడవడిలో సరళత—నాగరికము దేనిమూలమున వచ్చును? ఎందఱు వర్తకులు శతకుస్థాపన జేసి, వారి పేరున పట్టణములు గట్టించిరి!

సోలను మంచిభోగి. దేశాటనము జేసి కష్టపడినందున, నతఁడు మహావైభవముతో సుఖముల ననుభవించెను. అనేక దేశములు చూచినందున, భోగమునకు గావలసిన వస్తువుల నాయా దేశములనుండి యతఁడు దెప్పించుచుండెను. అతఁడు కొంచెము కవిత్వము చెప్పగలఁడు. విరమించు కాలములో నతఁడు సరసముగ నీతిబోధకములైన చరణముల నల్లుచుండెను; వానిలో రాజనీతులను బొందుపఱచుచుండెను.

అతఁడు 'అథీనియనుఁడు'. 'ఆథెన్సు' పట్టణములో 'ఆర్కను' యను పెద్దయుద్యోగము జేసెను. అక్కడి ప్రజల క్షేమమున కనేకశాసనములను నియమించినందున, నతఁడు ధర్మశాస్త్రవేత్తయనేగాక, ధర్మశాసనుఁడనికూడఁ బేరొందెను "ఈ నా శాసనముల ప్రకారము అథీనియనులు నడచుకొనిన వారికి శ్రేయస్సు గలుగు"నని యతఁడు హితోపదేశము జేసెను.

ఒకనాఁడతఁడు స్నేహితుఁడైన 'థాలీసు'తోఁ గలిసి భోజనము జేయుచుండెను. అప్పుడు స్నేహితుని జూచి 'నీవెందుచేత వివాహము చేసికొనలే'దని యతఁ డడిగెను. అందుకు స్నేహితుఁడు జవాబు చెప్పక యూరకుండెను. తరువాత నొక పరిచారకునికి గొన్ని సంగతులు బోధించి, 'థాలీసు' వానిని సోలనువద్దకుఁ బంపెను. స్నేహితులిరువురు కలిసి సంభాషించుచుండ, బరిచారకుఁడు వచ్చి "నేను ఆథెన్సుపట్టణమునుండి



వచ్చి పదిరోజులయినది" యని యజమానునితోఁ జెప్పెను. "ఆ పట్టణములోని విశేషము లేమి?" యని సోలనడిగెను. "ఒక గొప్పవాని కుమారుఁడు చనిపోయెను." "ఎవని కుమారుఁడు?" "జ్ఞాపకము లేదు." "సోలనుని కుమారుఁడా యేమి?" "అవును. అవును." ఆ మాట విని యతఁడు నెత్తి నోరు గొట్టుకొని యేడ్వసాగెను. "నీవంటి మహాత్ముఁడె మనోధైర్యము లేక బాధపడినప్పుడు, నావంటి దీనుల మాటఁ జెప్పనేల? అందుచేత, నేను వివాహమాడలేదు. పరిచారకుని మాటలు సత్యములు కావు. నీ కుమారుఁడు చనిపోలే"దని థాలీసు నమ్రతతో జవాబు చెప్పెను.

"సుఖస్యానంతరం దుఃఖం దుఃఖస్యానంతరం సుఖం." అనునటుల సుఖదుఃఖములు మారుచుండును. విషయభోగముల ననుభవించుటచేత మనస్సునకు గలుగు తుష్టియే సుఖము కాదు. మనోవ్యాపారముల నరికట్టి నిర్మలముగ నుండుటయే సుఖము. సుఖమునకు తగినంత దుఃఖమున్నది. యతికి బ్రతికియుండ నేమున్నది. అటులని లౌకికవ్యాపారములను మనము మానివేయఁగలమా? లోకములో నున్నంతవఱకు, పులుసు కారము మొదలగువాని నిదినుచున్నంతవఱకు మనమే వ్యాపారమును మానలేము. ధూమశకటము మీఁది ప్రయాణము ప్రమాదమే. అటులనే, పొగయోడ. వీనిమీఁద ప్రయాణము చేయుట మానివేయఁగలమా? తూచినటుల, ద్వార్ష

ద్వేషములన్నియు నడచుచుండును. పిచ్చివాఁడు గనుక, అతఁడు వివాహమాడ లేదు.

అథీనియనులు 'మెగారా'సెనియనులతోఁ బోరాడి వారిని జయించలేక విసిగిపోయిరి. వారితో యుద్ధము జేయవలసినదని యెవరైన తమతోఁ జెప్పిన, వారు వానిని దండించుచుండిరి. ఆ సంగతి సోలను తెలిసికొని, వారికి బుద్ధి జెప్పవలెనని యోచించి, వెఱ్ఱివానివలె నటించెను. మార్కట్టునకుఁ బోయి, యక్కడ వెఱ్ఱిచేష్టలు చేయుచు, శత్రువులను జయించలేకపోయినందున, నతఁడు 'అథీనియనులను దూషించెను. వారందఱు తెలివి దెచ్చుకొని శత్రువులపైకి దండెత్తిపోయి, వారిని జయించిరి.

అనంతరము నగరములో రాజ్యాఙ్గములు బాగుగ జరుగుట లేదు. ప్రజలు క్షోభపడుచుండిరి. రాజ్యసూత్రములను ధరించినవా రాత్మపోషణకు ధనమును స్వీకరించుటయే గాని, మనుజుల కష్టములను నివారించుట లేదు. వ్యవహారములు మాటుమణిగెను. వానిని ఋజుమార్గములోఁ బెట్టవలసినదని వారతనిని వేఁడిరి; 'ఆర్కను' ఉద్యోగమిచ్చిరి. కొందఱు ప్రజారాజ్యమున కియ్యకొనిరి; కొందఱు సామంతుల ప్రభుత్వము మంచిదనిరి; మఱికొంద ఱీ రెండు ప్రభుత్వములను సమ్మేళనజేసిన బాగుగనుండునని యోచించిరి. అన్ని సంగతులను నెమ్మదిగ వితర్కించి, యతఁడు రాజ్యాఙ్గములను మార్చి



వేసెను. పురాతనముగ వచ్చుచున్నవానిలో మంచివాని నన్నియు నతఁడు నిలవఁబెట్టెను; కొన్ని యశేషముగ మార్చివేసెను; మిగిలినవానిని సవరణఁజేసెను.

ఋణములను గొట్టివేసినందుకు సామంతులతనిని దూషించిరి; భూములను సమముగ పంచనందుకు బీదవారు నిందించిరి. లైకర్గను చేసిన ప్రకారమతఁడు చేయనందున కతనిని ప్రజలు గర్హించిరి. లైకర్గను ధనవంతుఁడు; పలుకుబడి కలవాఁడు; సమర్థుఁడు; అతఁడు చెప్పిన ప్రకారము చేయుటకు ప్రజలు సమ్మతించిరి. సోలను సంసారి; విశేషము పలుకుబడి లేనివాఁడు; అందుచేత నతఁడు వానివలెనే పనిచేయుటకు వీలులేకపోయెను. అందులో దేశకాలములను జూడవలెను. స్పార్టనులకు సరిపడిన రాజ్యాఙ్గములు, అథీనియనులకు సరిపడునని యెటుల జెప్పవచ్చును? కాబట్టి వారి శక్తికిఁదన శక్తికిఁ దగినటుల రాజ్యాఙ్గముల నతఁడు సవరణఁజేసెను; 'ఆర్యా..' సభ నొకటి స్థాపించెను.

అతఁడు వివాహముల విషయమై కొన్ని పద్ధతుల నేర్పఱచెను. స్త్రీలకు సారెచీరలిచ్చుట లేదు. "ధనము గలిగియున్నదనియూ, లేక గుణవంతురాలనియూ, యేమొ పురుషుఁడు వివాహమాడును?" అని యతఁడు చెప్పుచుండెను. ఎన్నఁడు నెవరును మృతినొందినవారిని దూషించకూడదనియు నిబంధన కలదు. వారిని నిందించిన, వారేమి వినవచ్చెదరు?

అందుకుఁ దగిన సమాధానము జెప్పఁగలరా? అటులనె, బ్రతికి యున్నవా రొకరి నొకరు సభలలోను, దేవాలయముల లోను, క్రీడలలోను, న్యాయసభలలోను నిందించుకొనరాదు. ఇంతకు పూర్వము వారు మరణశాసనము వ్రాసి వారి యాస్తులను పంచిపెట్టుట కధికారములేదు; అతఁడు వారి కధికారము కలుగఁజేసెను. స్థిరాస్తిని వారు బంధువుల కియ్యవచ్చును; సంతానము లేనపుడు స్నేహితులకుఁ గొంత యిచ్చుట గలదు. ఇష్టానుసారము వారు మరణశాసనమును వ్రాయఁగూడదు. ప్రయాణమైపోవునపుడు, కష్టములు వచ్చినపుడు, బలు లిచ్చునపుడు, స్త్రీ లెటుల ప్రవర్తింపవలయునో—వీనికి గొన్ని నిబంధనల నతఁ డేర్పాటుచేసెను. వారు ప్రయాణమై పోవునపుడు, బండికిముందు దివిటీ లుంచుకొనవలెను.

ఆథెన్సుపట్టణములోఁ బ్రాణధనములకు స్వాస్థ్యముండెను. అందుచేతనే, దేశ దేశములనుండి ప్రజలు వచ్చి యక్కడ గాపురముండిరి. అయినను, భూములు సాగుబడి అగుట లేదు; మనుజులు దరిద్రులుగ నుండిరి. వీనికిఁ దోడు, వర్తకవ్యాపారములు నిలిచిపోయెను. కనుక, పొట్టపోషించుకొనుటకుఁ దగిన వ్యాపారములోఁ గుమారుని తండ్రి ప్రవేశపెట్టనిపక్షమున, వృద్ధాప్యములోఁ దండ్రిని గుమారుఁడు పోషించ నవసరములేదని, యతఁ డొక నిబంధనఁ జేసెను. ప్రతి



మనుజుఁ డొక వ్యాపారమును నేర్చుకొనియుండవలెను; సోమరిగ నున్నవాఁడు కఠినశిక్షను బొందుచుండెను.

నగరమునకు సమీపమున సరస్సులుగాని జీవనదులుగాని లేవు. నూతులలోని నీరును వారు వాడుకొనుచుండిరి. వారు నూతులు త్రవ్వించుకొనవచ్చును; మొక్కలు పాతించవచ్చును. పండించిన పంటలనుగాని, భూమిలో దొరికిన వస్తువులనుగాని, వారు పై దేశములకుఁ బంపకూడ దని యతఁడు నిర్ణయముఁజేసెను. సరుకుల నెగుమతిచేసినవారు కఠినశిక్షను బొందుచుండిరి. ప్రజారాజ్యములోనివారు గనుక దేశమునకు క్షేమము శుభము నిచ్చు కార్యములు జరగినపుడు, సర్కారువారు విందులు చేయించుట గలదు. జరిగినపుడెల్ల విందులకుఁ బోయినవాఁడు తిండిపోతని వానిని శిక్షించుట గలదు; పిలిచినపుడొక పర్యాయమైన వెళ్లనివాఁడు శిక్షకుఁ బాత్రుండు.

సోలను చట్టములు నూఱుసంవత్సరములవఱకు అమలులో నుండెను. అతనిని జూచుటకుఁ బ్రతిరోజున గొప్పవారు బోవుచుండిరి; కొంద ఱతనిని శ్లాఘించిరి; కొన్ని చట్టములలో సవరణఁజేసిన బాగుగ నుండునని కొందఱు సలహో యిచ్చిరి; మంచివికావని తోఁచినవానిని రద్దుచేయవలసిన దని మఱి కొందఱు చెప్పిరి. ఎంత గొప్పకార్యమైనను సర్వజనశ్లాఘనీయముగ నుండదుగదా? అందఱను మెప్పించుట గష్టము. "ఒకరికి పులు

సుకూర, మఱియొకరికి ఇగురుకూర, యిష్టము". వచ్చిన ప్రతి వానికి సమాధానము చెప్పుట కష్టమని తోఁచి, పది సంవత్సరములవఱకు దేశమును విడుచుటకు వారివద్ద సెలవు పుచ్చుకొని, వర్తకమునిమిత్తమని చెప్పి, యతఁడు పై దేశములకు లేచి పోయెను.

ఈజిప్టు మొదలగు దేశములను జూచుచు "క్రీససు" యను నొక రాజతనిని నాహ్వానము చేయుటచేత, నితనిని దర్శించుటకు సోలను పోయెను. ఈ రాజు గొప్ప ధనవంతుఁడు; కుబేరుఁడని చెప్పవచ్చును. కుగ్రామమునుండి వచ్చిన వానికిఁ బట్టణములోని వివి యన్నియు విచిత్రముగ నగుపడునటుల, రాజధానిలోఁ బ్రతి వస్తువు నతనికి గన్నులపండువుగ నుండెను. అలంకరించుకొని మహావైభవముతో రాజుసముఖమునకుఁ బోవుచున్న ప్రతి సామంతప్రభువు నతఁడు రాజని భావించెను. తుదకతనికి రాజదర్శనమయ్యెను. నగరులోఁ జూచినవన్నియు బంగారువస్తువులే; అంతట నవరత్నములే; చీనిచీనాంబరములు తండోపతండములు. వీనిని జూచి, యతఁడు సంతసించలేదు; అతని మనస్సు చలించలేదు. వీనిని జూచి యతఁ డాశ్చర్యము బొందనందుకు, రాజాశ్చర్యపడి, ఖజానాకొట్లు నతనికిఁ జూపించవలసినదని, సేవకుల కాజ్ఞ జేసెను. బొక్కసములో నున్న ధనమునకు లెక్కలేదు; ధనరాసులు మూలుగుచుండెను. వీనిని గన్నులారఁ జూచి, యతఁడు రాజువద్దకు వచ్చెను. "నా



కంటె హెచ్చు సౌఖ్యము ననుభవించువానిని జూచితివా?" యని రాజతని నడిగెను. "చూచితిని. వాఁడు మా 'ఆథెన్సు' లోఁ గాపురము చేసెను. భాగ్యభోగ్యములు లేకపోయినను, సంతానవంతుఁడై, యన్నవస్త్రాదులకు లోపము లేకుండ సుఖముగ వాఁడు జీవించె" నని యతఁడు ప్రతివచన మిచ్చెను. ఆ రాజునకంటె సుఖముగ జీవించువారు పలువురు ప్రపంచములోఁ గలరని యతఁడు రాజునకుఁ దెలియఁజేసెను. "ఓ రాజా, మేము ప్రజారాజ్యములోనివారము. కొఱత లేకుండ మాకు దైవము మనోన్నద్ధకము లిచ్చియున్నాఁడు. మేము విషయేచ్ఛలను గోరువారము కాము. 'అంగనాపుత్రగేహారామవిత్తాదిసంసారసుఖముల దగిలి వర్తించము.' ఇవి క్షణభంగురములని బోధపఱచి యతఁడు లేచిపోయెను.

చంచలలక్ష్మి యనిని సార్థకనామమే. మఱికొన్నిరోజులకు పారసీకచక్రవర్తి 'కైరసు' దండెత్తిపోయి, క్రీససును యుద్ధములోఁ బట్టుకొని, మరణశిక్ష విధించి, యతనిని దగులబెట్టవలసినదని సేవకుల కాజ్ఞ చేసెను. కాష్టమువద్ద నిలువబడి "ఓ సోలనా, ఓ సోలనా" యని రాజు మొఱబెట్టెను. ఈ సంగతి విని, చక్రవర్తి పరుగెత్తుకొని వచ్చి; "ఓ రాజా, నీ వెవరి పేరును తలఁపక, సోలనును తలఁచితి వేమి? అతఁ డెవఁడని రాజ నడిగెను. "అతఁడు గ్రీకులలోఁ బ్రాజ్ఞుఁడు. అతఁడు నా సంపత్తును జూచి, దానిని ప్రేమించవలదని హితోపదేశము జేసె

‘కాలంబుతటి యెటింగి’ జీవింపుమని బుద్ధి జెప్పిపోయె’’నని రాజు సమాధానముఁ జెప్పెను. ఇతనికంటె బుద్ధిమంతుఁడు గనుక, చక్రవర్తి యతనికి మరణశిక్షను నాపివేసి, యావజ్జీవము రాజును బోషించెను. సోలనుయొక్క హితోపదేశ మిటుల నిరువురిని మహాయుత్తచిత్తులుగఁ జేసెను.

సోలను దేశములో లేనిసమయమున ‘అథీనీయనుల’ వ్యవహారములు చిందరవందరగ నుండెను. అతఁడు స్వదేశమునకు వచ్చిన వెంటనె, ప్రజలు మిగుల సంతసించి, వారి వ్యవహారములను జక్కఁబెట్టవలసిన దని కోరిరి. అతఁడు వృద్ధుఁ; దేహపటిమ తగ్గినవాఁడు. అందుచేత స్వయముగ విషయములను సంస్కరించలేక, సర్కా రుద్యోగస్థులకు మంచిమార్గముఁ జూపుటకతఁ డుపగమించెను. కాని, కొందఱు మొదట నతని మాటలకుఁ బెడచెవి నొగ్గి, యతనిని జంపించుటకు సమకట్టిరి. గడితేరినవాఁడు గాన, వారి బెదరింపులకు లక్ష్యము చేయక, చెడుమార్గమును వారు వదలునటు లతఁడు చేసెను. ఇటుల సర్వజన శ్లాఘనీయంబైన జీవితకాలమును గడిపి, యతఁడు పరమపదముఁ బొందెను.



## నూమా



‘రోము’ నగరమును స్థాపించి, సాంఘికసూత్రము లేర్పఱచి రాజ్యతంత్రములను నిర్ణయించి ప్రజలకు రణశిక్షను నేర్పిన మహాపురుషుఁడు ‘రోమ్యులసు’. ఆ నగరము మొదట నేక రాజ్యాధిపత్యములోనిది; అచ్చట రాజ్యమేలినవారిలో మొదటివాఁడు ‘రోమ్యులసు’. ఇతఁడు దేవాంశసంభూతుఁడు; ఇతఁడు గొంతకాలము పరిపాలన జేసి స్వర్గస్థుఁ డయ్యెను. అనంతరము ‘సెనేటు’సభవారు రోజు కొకరు చొప్పున వంతువేసికొని రాజ్యమును బరిపాలించుచుండిరి. నగరవాసులు ‘రోమకు’లని, ‘సాబీను’లని రెండు తెగలవారు. వారందఱు ఏకీభవించి, యొకనిని రాజుగ నేర్పఱచవలసిన దని సభవారిని గోరిరి. అప్పుడు ‘సాబీను’లలోనివాఁడైన ‘నూమా’ను వారు రాజుగఁ జేసిరి. అతఁడు రెండవ రాజు.

తండ్రికి గలిగిన కుమాళ్లలో నతఁడు నాలుగవవాఁడు. అతఁడు యేప్రిలు ౨౧ తేదీని పుట్టెను. ఆ దినము రోము నగరమునకు శంకుస్థాపన జేసిన దినము. మొదటినుండి, ధర్మమునందె యతని బుద్ధి ప్రసరించెను; త్రిగుణాతీతుఁడై, యతఁ

డెప్పుడు నిర్లిప్తతతో నుండెను. అంతశ్శత్రువుల నతఁడు జయించెనని వేఱె చెప్పనేల? ఆ కాలములో గుణములు సొబగులేక, యడవి మనుజులవలె మోటువారైన రోమకుల నరికట్టి వారిని సన్మార్గములోనికి దెచ్చి, నయమున భయమున వారికి హితోపదేశ మతఁడు చేసెను. రాజకీయవ్యవహారములను నిర్వర్తింపని కాలములో విషయసుఖములయందు మనస్సును ప్రవర్తింపనీయక, దేవతారాధనలయందు నిశ్చలభక్తితోఁ గాలమును గడుపుచుండెను; కాలమును గుర్తెఱిఁగి, యాముష్మికచింతతో నుండెను. రోమ్యులసుతోఁ గలిసి రాజ్యభారమును వహించిన 'తాతియసు' అనువాఁడు నూమా సుగుణసంపదకు మెచ్చి తన కూఁతురు 'తాతియా' నతని కిచ్చి వివాహము చేసెను. ఏకాంతస్థలములో నొడుదొడుకులులేక నిశ్చింతతో భర్తతోఁ గలసి కాపురము జేయుట కామె సమ్మతించెను గాని, యైహికభోగముల ననుభవించుచు పితృగృహమున నుండుట కామె యిష్టపడ లేదు. పదమూఁడు సంవత్సరములు కాపురము జేసి, యామె దివి కేగెను.

అనంతరము నూమా వనముల కేగెను. అచ్చట, 'అగీరియా' యను దేవత యతనికి ప్రసన్నమయ్యెను. ఆమె యతనిని ప్రేమించి, సమస్తవిద్యల నతని కొసఁగెను. ఆ దేవియొక్క ప్రసన్నత గలిగియుండ, నితర వ్యాపారములలో నతని మనస్సెట్టుల గలిసమగును? ఇట్లతఁడు కాలము గడుపుచుండ,



నలుబది సంవత్సరముల ప్రాయమువాఁ డయ్యెను. అంతలో రోమ్యులసు చనిపోవుట, సెనేటుసభవారు రాజ్యమేలుటయు జరిగెను. రోమకులంద ఱతనిని రాజుగ నేర్పఱచుకొనుటకు నిశ్చయించి, యతనిని ప్రార్థించి నగరమునకు రప్పించుట కిరువురు రాయబారుల నతనివద్దకు బంపిరి. సింహాసన మెక్కవలసిన దని కోరినపుడెవఁ డొల్లఁడని వారు తలంచి, యతనితో నొక్కి చెప్పలేదు. "విజనస్థలంబున విముక్తకాముఁడనై, కాలము గడుపుచున్న నాకు రాజ్యమేల? దేవాంశసంభూతుఁడైన రోమ్యులసువంటి మహాత్ములు మిమ్ముల బరిపాలించవలెను. నేను మనుష్యమాత్రుఁడను. నాలో మహత్తు లేదు. చతురోపాయములు తెలియఁగను. చతురంగబలముల నడిపించు పోడిమి లేదు; త్రిశక్తులు లేవు; అంగపంచక మెట్టిదో వినలేదు; చతుర్విధ సీమలలోని వారల నెటుల సంరక్షించవలయునో నేర్చియుండలేదు. ఈ నావంటివానితో మీ కేమి ప్రయోజనము? 'కామంబులేని నన్ను మీరు వంచింపనేల' యని యతఁడు పితృ, బంధు, మిత్ర, సోదరవర్గంబుల సముఖమున బలికి వారిని బొమ్మనియెను. ఈ మాటలువిని వారు నగరమునకు బోయిరి. ప్రజలు చేయుటకేమియుందోఁచక, తిరుగ నతనియొద్దకు మఱియొక రాయబారమును బంపి వారు వెనుకనుంచి వచ్చుటకు సిద్ధముగనుండిరి.

ఇంతలో తండ్రి కుమారుని జేరదీసి 'నాయనా! నీవు

సింహాసన మెక్కనలెను. దేవాంశయుండినగాని రాజు కాఁడు. దుర్లభమైన యట్టి పదవి సంప్రాప్తమైనపుడు, నీవు దానిని తిరస్కరించఁగూడదు. పురుషార్థములను యథావిధిగ నడపఁగలవు. శాశ్వతమైన సంతానములు నీకుఁ జేకూరును. 'యథా రాజా తథా ప్రజాః' అనునటుల నీవు సన్మార్గము నవలంబించి నందున, నీ ప్రజలు నిన్ననుసరించి బ్రతుకుత్రోవఁ గనఁగలరు. రాజుకు జనులే కుటుంబము. ప్రజలకు స్వాస్థ్యము గలుగఁ జేయుటకన్న హెచ్చు పుణ్యముండునా?" యని హితవచనములు చెప్పి కుమారుని పంచెను. అంతలో రాయబారులు వచ్చిరి. మారుమాట చెప్పక, 'నూమా' వారితోఁ గలిసి నగరమునకుఁ బోయెను. మార్గములోఁ బ్రజలతనిని తారసిల్లి పరమానందభరితులైరి. సెనేటుసభవారు మొదలగు సామంతులు వెంటనంటియుండ, నగరములో నతఁడు ప్రవేశించెను. ఊరేగింపు ముగిసిన తరువాత, నతనిని రాజభవనములోనికిఁ దీసికొని వెళ్లి, వారతనిని రాజచిహ్నములతో నలంకరించఁ జూచిరి. అతఁడు వారి నప్పటికి వారించి, సుముహూర్తంబున దేవిమాజ్ఞఁ గైకొని, దేవతార్చనములు చేసి, బలులిచ్చి, సింహాసన మధిష్ఠించి పట్టభద్రుండయ్యెను.

అతఁడు రాజ్యమునకు వచ్చుసరికి, రోమకులు ముష్కరులు. తెల్లవారి లేచినది మొదలు పోరేగాని మరియొకటి లేదు. పోరాటములోని పాటుపోటులవలన వారి శరీరము పూటుపడి



బిరుసెక్కెను. దయాదాక్షిణ్యములు వెతకిచూచినను వారిలోఁ గానరావు. వారి పొదలికి కత్తిపదును. వీరి నెటుల మచ్చిక చేయుట? ఇనుము కఠినమైనది. అగ్నిస్పర్శచేత మృదువు కాదా? వీరి మనోదేహకాఠిన్యములను బోఁగొట్టుటకు వేరు మార్గములు దోఁచక, దేవతారాధనలని, బలులని, దేవోత్సవములనెడు మొదలగు దేవతాక్రియలలో వారి నతఁడు ప్రవేశపెట్టెను. తనకు దేవి ప్రత్యక్షమగునని వారితో నతఁడు చెప్పుచుండెను. దేవాలయముల నతఁడు ప్రతిష్ఠఁ జేసెను. నిర్గుణబ్రహ్మమునకు ప్రతిరూపము నిచ్చి పూజించుటకిష్టము లేక, విగ్రహము లేకయే వారు దేవాలయములలో దేవతారాధనఁ జేయుచుండిరి. కర్మకాండ నతఁడు బహుళము చేసెను. అర్చకులు మెండయిరి. వారిమీఁద బెద్ద యర్చకుఁడొకఁడు నియోగించఁబడెను. శకునజ్ఞులు ప్రబలిరి. బలులిచ్చుటకుఁ దగిన తంత్రములు బలిసెను. ఒకచోట నవిచ్ఛిన్నాగ్నిహోత్రము నుంచఁబడెను; దానిని సంరక్షించుటకుఁ గొందఱు సతీతరుణులొప్పుకొనిరి. దేవతార్చన విధానములు పూర్వముకంటెను రెండింతలు పొడవయ్యెను. వీని నన్నియు రాజు స్వయముగఁ బరిశీలించి, ప్రతిదినము వానిని జరిపించుచుండెను.

అతఁడు రాజనగరొకటి కట్టించెను; పథకశుద్ధిఁ జేయించెను. అతని కాలములో యుద్ధములు లేవు. దుష్కరణమును

మాట లేదు. ఈతిబాధలు లేవు. పరమేశ్వరుని కటాక్షము గలదు గనుక, ధర్మమును స్థాపించి, ప్రజల కతఁడు మనోసంస్కారములిచ్చెను. నలుబదిసంవత్సరములతఁడు రాజ్యముచేసి జీర్ణించిన శరీరమును విడిచి, లోకాంతరగతుఁడయ్యెను.



# థేసియసు

థేసియసు, రోమ్యులసు, వీరిద్దఱును దేవాంశసంభూతులని చెప్పుదురు. వారి పుట్టుపూర్వోత్తరములు బాగుగఁ దెలియవు. ఇరువురు కానీనులు; మహావీరులు; దేహబలము, మనోబలము గలవారలు. మొదటివాఁడు 'ఆథెన్సు' నగరమును, రెండవవాఁడు 'రోము' నగరమును స్థాపించెను. ఉభయులు స్త్రీలను జెరబట్టుచుండిరి. తుదకు వారికి గృహకలతలు గలిగి బాధపడిరి. మొదట ప్రజలు వారి నంతగా గౌరవించిరో, తుద కంతగ గర్హించిరి.

థేసియసుయొక్క పితృవంశమునుగూర్చి బాగుగఁ దెలియదు; అతని మాతామహుఁడు 'ట్రొజినీ' పట్టణములోని రాజు. ఇతని కొక కూఁతురుమాత్రము గలదు.

ఆథెన్సునగరములోఁ గాపురము జేయుచున్న 'ఆజియసు' యను రాజు సంతానము లేక, సోదెవేయించి కనుగొనుటకు 'డెల్ఫి' గ్రామమునకు బోయెను. నగరమునకు బోవువఱకితఁడే స్త్రీముఖమును జూడఁగూడదని సోదె చెప్పిరి. ఇతఁడా మాట విని, తిన్నగా నగరమునకు బోవక, 'ట్రొజినీ' పట్టణము వచ్చి, 'పిథియసు' గృహములో బసచేసెను; ప్రసంగ

రీతిని నీ సోదెసంగతి నతనితోఁ జెప్పెను. అతఁడేమి యాలోచించెనో తెలియదుగాని, తన కుమారితె నితనియొద్దకుం బంపెను. అప్పుడు 'ఆజియసు' ఆమెను జూచి మోహించెను. ఆమె గర్భసంస్కారములు పొందెను. అతఁడా వృత్తాంతము గ్రహించి, యొక కత్తిని రెండు పాదరక్షల నొక బిలమున పదిలము జేసి, దానిమీఁద నొక బండరాతిని బొర్లించి, యా సంగతి భార్యతోఁ జెప్పి, కుమారుఁడు కలిగిన యుక్తవయస్సున్న వాఁడు వానిని ధరించి తనయొద్దకు వచ్చునటుల జేయవలసినదని యుత్తరువుఁ జేసి, నగరమునకుం బోయెను.

నాఁడామెకు నెలలు నిండి, యొక రోజున నామె సుఖప్రసవమయ్యెను. సుపుత్రుండు గలిగెను. శిశువునకు మాతామహుఁడు 'థెసియసు' యని నామకరణము జేసెను. పురిటి పిల్లఁడు పొత్తిళ్లపిల్లఁడై, మాసములయనములు సంవత్సరములు నిండి యౌవనసంప్రాప్తుఁడయ్యెను. మాతామహుని జూచి యతఁడు తండ్రియని భావించుచుండెను. స్నేహితులతనిని కానీనుఁడని పిలుచుటకు దుఃఖించి, తల్లియొద్దకు వచ్చి, తన తండ్రి యెవరో చెప్పవలసినదని యతఁడామెను గోరెను.

అప్పటికే, యతఁడాజానుబాహుఁడు. సాముविద్యల్ నేర్చుకొనినందున, నతని శరీరము కర్కశమయ్యెను. మదించిన వృషభమువలె నతఁడు నడుచుచుండెను. దేహాలా



వణ్యము జిక్కఁగఁ గారుచుండెను. అతఁడు కాముని హృదయభేదన నైపుణీకటాక్షవీక్షణములతో నొప్పుచుండెను. అతనియందు దేహసంస్కారములకు మనోసంస్కారములు జోడింపఁబడియుండెను.

అట్టి కుమారుని జూచి తల్లి కొంత మనోవ్యథను బొంది, "నాయనా! నీ తండ్రిగారు నీవు గర్భములోనున్నప్పుడే, నన్ను విడనాడి, ఆథెన్సునగరమునకుం బోయిరి. వారక్కడి రాజులు. ఆ బండరాతిక్రింద వారేమో నీ నిమిత్తము కొన్ని వస్తువులు దాఁచియుంచిరి. నీవు వానిని ధరించి, వారియొద్దకుం బొమ్మని" యతనితోఁ జెప్పెను. రెండు మూఁడు వందలమంది కదిలింపలేని బండరాతి నతఁడవలీలఁ గదలించి, ప్రక్కకుఁ ద్రోసి, లోపల బిలములోనున్న పాదరక్షలను చంద్రాయుధమును బట్టుకొని వచ్చి తల్లికిఁ గనపఱచెను. పాదరక్షలను దొడిగి, చంద్రాయుధమును ధరించి, యతఁడు తండ్రియొద్దకుం బోవుటకు సన్నద్ధుఁడయ్యెను. మాతామహుఁడందులకు సంతోషించి, నాటునఁ గాక సముద్రముమీఁద బయలుదేరి వెళ్లవలసినదని యతనికి సలహాచెప్పెను. తాతగారి మాటలను చెవిని పెట్టక, నాటునఁ బోవుటకే యతఁడు సిద్ధమయ్యెను.

ఆకాలమున రాధారిమార్గములు, బాటలు లేవు. అడవులు దాఁటుకొని మనుజులు ప్రయాణములు చేయుచుండిరి. మార్గములో దొంగలను తప్పించుకొని, దుష్టజంతువుల వాత

బడక, ప్రయాణమును సాంతముగ జేసినవారు లేరు. ఈ సంగతులు విని, పరాక్రమశాలి గనుక, మార్గములు నిష్కంటకములు చేయవలెనని కోరి, యతఁడు నాటున బయలుదేరెను. "రక్తములో దడిసిన యాయుధమును జూచిన తండ్రి సంతసించును గాని, తెల్లగ థళథళలాడుచున్నదానినిజూచి యతఁడామోదించునా?" యని తాతగారితోను తల్లితోను జెప్పి యతఁడు బయలుదేరిపోయెను.

మార్గములో 'పెరిఫేటీసు' అను పేరుగల యొక ముష్కరుఁడుండెను. వీఁడు గదాయుద్ధములోఁ బ్రసిద్ధికెక్కినవాఁడు. వీనితో నతఁడు గదాయుద్ధముఁజేసి, చంపి, వీని గదను బట్టుకొని, యక్కడినుండి బయలుదేరెను. అనంతరము, దేవదారువృక్షమును వంచినవాఁడని పేరుపొందిన పురుషునిఁ బోరాటములోఁ దునుమాడి, వాని కూఁతురును సంతోషపఱచి, యతఁడా స్థలమును విడిచిపోయెను. తదుపరి, 'మగారా' పొలిమేరనున్న యొక దొంగను బట్టుకొని, వాని నతఁడు కొండమీఁదినుండి క్రిందికిఁ ద్రోసి చంపెను. 'ఎడ్యాసిసు' అను గ్రామములో నొక మల్లుని నోడించి, వాని నతఁడు యమమందిరమునకుఁ బంపెను.

'ఆజియసు' 'మీడియా' యను నామెను వివాహమాడి, ఆథెన్సునగరములోనుండెను. థెసియసునగరములోఁ బ్రవేశించి, తండ్రిదర్శనమునకు వెంటనే వెళ్లలేదు. థెసి



యసు సవతికుమారుఁడని చారులవలన దెలిసికొని, కుమారుఁడని భర్త గ్రహించకమునుపె, యతనికి విందుచేసి, విషము పెట్టి చంపవలెనని 'మీడియా' యత్నించెను. అతఁడు తండ్రిగృహములోఁ బ్రవేశించెను. ఆనాఁడొక విందు జరుగుచుండెను. ఎవఁడో గొప్పవాఁడు వచ్చినాఁడని తలంచి, థెసియసును రాజాహ్వానము చేసెను. తన పేరు చెప్పకొనక, తండ్రి చూచునటుల చంద్రాయుధమును బట్టుకొని, యతఁడు కూర్చుండెను. ఇంతలో 'మీడియా' విషమును గలిపి, మద్యపాత్రను భర్తచేతి కిచ్చి, వచ్చినవాని కియ్యవలసిన దని కోరెను. రాజు దానిని బట్టుకొని, ప్రక్కకు దిరుగుసరికి, చంద్రాయుధమతని కంటపడెను. వెంటనే, దానిని ధరించినవాఁడు తనకుమారుఁడని యతఁడు గ్రహించి, సంతోషముచేతఁ బరవశుఁడై, పాత్రను జారవిడిచెను. రాజు కుమారుని గాఁగిలించుకొని, శరీరము దువ్వి, శిర మాఘ్రాణించి, యానందబాష్పములతో నతని శరీరమును దడిపెను.

'క్రీటు' ద్వీపములో 'మినోతారుఁ'డను రాక్షసుఁడొకఁడుండెను. వాని యూర్ధ్వభాగము వృషభాకారము; అధోభాగము మానవాకారము. తొమ్మిది సంవత్సరముల కొకపర్యాయము 'అథీనియను' లేడుగురు బాలురను, ఏడ్వురు కన్యలను, కానుక దీసికొని వెళ్లు టాచారము గలదు. ఆ రాక్షసుఁడు వీరినిఁ జంపి తినుచుండును. ఈ కానుకను దీసికొని

వెళ్లు సంవత్సరము వచ్చెను. నగరమంతట దీనాలాపములు నిండె; ప్రజలా బాలవృద్ధులు ముకుళితముఖారవిందులయిరి; వారి ముఖమున కత్తివేటుకు రక్తము లేకుండెను.

అప్పుడు థిసియసు వారి దుఃఖము వాపి, వారితోఁ దాను వెళ్లుటకు తండ్రి యనుమతిఁ బొందెను. అతనితోఁ గూడి యేడుగురు బాలురు కన్యకలు పడవనెక్కి, ద్వీపమునకుఁ బోయిరి. ఆ దీవికి రాజైన 'మినాసు' యొక్క సేనాధిపతిని యతఁడు ముందు జంపెను. అటుపైని కొన్ని గరిడీ విద్యలు జరిగెను. వానిలో నతఁడు తన ప్రావీణ్యత్వము గనఁబఱచెను. అప్పుడు రాజుకూఁతురు 'ఆర్యాద్ని', యతని దేహలావణ్యమునకు మెచ్చి యతని మోహించెను.

ఆమె వర్తమానము పంపినందున, నతఁడామె సముఖమునకుఁ బోయెను. పద్మవ్యూహమువలె నల్లుకొనియున్న యరణ్యములో నొక రాక్షసుఁడు నివసించియుండు ననియామె యతనితోఁ జెప్పెను. ఆమె యొక దారమతని చేతికిచ్చి, దానిని పట్టుకొని యరణ్యములోఁ బ్రవేశించి, వానిని జంపి రావలసినదని చెప్పి పంపెను. అతఁడాప్రకారము వ్యూహములోనికిఁ బోయి యా రాక్షసుని రూపుమాపి, దారము నల్లుకొనుచు వచ్చి, ఆర్యాద్ని సముఖముఁ జేరెను. అక్కడివారందఱు ముదమందిరి.

బాలికాబాలురతో నతఁడు పడవనెక్కి, స్వనగరము



నకు బయలుదేఱెను. తొందరలో వారు జయధ్వజమును పడవమీఁద నెత్తలేదు. అందుచేత కుమారుఁడు మృతినొందెనని యెంచి, ఆజియసు కొండమీఁదనుండి సముద్రములోనికి దుమికి చనిపోయెను. అనంతరము థిసియసు రేవులో దిగెను. నగరవాసులందఱు నతనిని వేనోళ్ల పొగడి విజయోత్సవములను జరిపిరి. తదుపరి, పితృవియోగమునకు దుఃఖించి, ప్రేతకార్యముల నతఁడు యథావిధిగ జరిపెను.

అనంతర మతఁడు రాజ్యమునకు వచ్చెను. ఇంతకు బూర్వము ప్రజలందఱు జెల్లాచెదరుగ గృహములు కట్టుకొని నివసించుచుండిరి. అందుచేత నతఁడు వారిని సమావేశము చేసి, యొక పట్టణము నిర్మించెను. ఆ పట్టణమే ఆథెన్సు. మహాదేహబలములుగలవాఁడు గనుక, థిసియసునే సేనాధిపతిగ ప్రజలు నియమించిరి. ప్రజలందఱు సమావేశమై, వ్యవహారములన్ని పరిశీలించుటకుఁ దగిన 'ప్రజామందిరము' నొకటి నిర్మింపించిరి. సామంతులని, కృషీవలులని, వర్తకులని వ్యవహారిక భేదములు తప్ప, జాతిభేదములు వారిలో లేవు. ప్రజలందఱు సమానులే. అందఱియెడల నొకటే దండనీతి ప్రవర్తించుచుండెను. వేషభాషలలోను, మతాచారములలోను వారు సమానులే; ఆటపాటలలోను భేదము లేదు. వారికి కావలసిన సాంఘిక సూత్రముల నేర్పాటుచేసి, రాజ్యమును స్థాపించి, థిసియసు స్వర్గస్థుఁడయ్యెను.

---

# థెమిస్టాకిలీసు

౮

---

ఏథెన్సుపట్టణములో, థెమిస్టాకిలీసుయొక్క వంశీకు
లంతగాఁ బేరుకెక్కినవారుగారు; అతని మాతాపితృవంశము
లలో నట్టివాఁ డొకఁ డైనను లేఁడు; తలిదండ్రు లవియు,
సామాన్యస్థితిగతులే.

బాలుఁడుగనున్న దినములలో నతఁ డేపని చేయుటకు
వెనుకతీయలేదు; మహా చొరవరి; పెద్దపనులను జేయుటకు
యత్నించెను. ఇతరబాలురవలె కాలము నాటపాటలలో వ్యర్థ
పుచ్చక, పాఠములను జదువుటయందో, ప్రసంగించుటయందో
సెలవుదినముల నతఁడు గడిపెను. "అబ్బాయి, నీవు సామా
న్యుఁడవు కావు. నీవలనఁ బ్రజలకు శుభమైన నశుభమైన
కలుగునని యుపాధ్యాయుఁ డనెను. సాహిత్యజ్ఞాన మతనికి
గష్టముమీఁదఁ గలిగెను; రాజనీతిశాస్త్రమును ధారాళముగ
నతఁడు జదివెను. అందులో నతని యీడుకు మించిన
బుద్ధికుశలతను గనఁబఱిచెను.

మొదట థెమిస్టాకిలీసు విచ్చలవిడిగ సంచరించెను; నడ
వడిలో నిలుకడ చూపలేదు; అతని గుణములు విపరీతములు;
అవియైనను కేవలము మంచి వని కేవలము చెడ్డ వని చెప్ప





రాదు. అతఁడు శృంగారపురుషుఁడు; కొంతకాలము విషయ
భోగములలో గడిపెను. అతని దుర్వ్యాపారములను జూచి,
తల్లి యాత్మహత్యఁ జేసికొనఁ బూనెను; తండ్రి కోపగించెను.
"దుష్టాశ్వములు మొదట వెఱ్ఱిగఁ దిరిగినను, శిక్షచేసి కళ్లెములు
తగిలించినపైని, మార్గములోనికి వచ్చి సాధువులగునని
థెమిస్టాకిలీసు చెప్పుచుండెను. ప్రజారాజ్యములోని ఆథెన్సు
పట్టణములో నుద్యోగము జేసి కీర్తిప్రతిష్ఠలను బొందవలెనని
యతఁడు వాంఛగలవాఁ డాయెను. ఏవిధమునైన, నేకార్య
మైనఁ జేసి, పెద్దల దృష్టిలోఁ బడవలెనని యతని కోరిక. అం
తియగాని, యతఁడు ముందు వెనుకలాలోచించక వ్యవహార
ములలో దిగుచుండెను. అందుచేత, నతనికి ఆరిస్టైడీసునకు
పరస్పరవైరము కలిగెను. ఇతఁడు దూరదర్శి; శాంతుఁడు;
వ్యవహారములలో తొందరపాటులేనివాఁడు. అతఁడు బ్రజలను
బెద్దపనులకు బురికొలుపును; ఇతఁడు వారిని శక్తికి తగినపను
లకు నియోగించును. థెమిస్టాకిలీసు చిన్నతనములో 'మారథాను
యుద్ధము జరిగెను. స్వబలపరాక్రమములు చూపించుట కవ
కాశము లేకపోయెనని యతఁడు చింతించెను. ఈ యుద్ధము
'పారసీకు'లకును 'అథీనియను'లకును జరిగెను; అందులో పార
సీకులోడిపోయిరి. ముమ్ముందుకు వారితో పెద్దయుద్ధములు జరుప
వలసియుండునని యతఁ డూహించెను. పూర్వాచారము ప్రకా
రము 'అథీనియనులు' వెండిగనులు త్రవ్వి, వెండిని తెచ్చుకొని,

తములో దాము దానిని బంచుకొనుట వాడుకకలదు. స్త్రీలు విశేషముగ నాభరణములను ధరించుచుండిరి. వెండి బంగారము నిలవచేయుటకు బదులు వానిని వ్యయపఱచి, నావలను కట్టిన, సముద్రముమీఁద పరదేశములతో వ్యాపారముఁ జేసి లాభములను బొందుటకు సమర్థత కలుగుటయగాక, స్వపరదేశీయులను లొంగదీసి, తమ ఔన్నత్యమును బొందుటకుఁగూడ శక్తికలుగునని 'అథీనియనుల'కు థెమిస్టాకిలీసు పదేశించెను. అతని యుపదేశముప్రకారము, వారు వెండి బంగారములను గర్చుపెట్టి, నావలను కట్టిరి. వారి యోడవర్తకము సాగెను; లాభమువచ్చెను. వారికి సముద్రమునిన భయము లేకపోయెను; వారు మంచినావికులైరి; నౌకాహవములో వారు శత్రువుల నోడించిరి.

అతఁడు మహావైభవముతో బ్రదుకుచుండెను. అందుకుఁ దగిన ధనముగావలెను గనుక, నతఁడు గొన్ని నీచపుఁబనులను జేసెను. అధికారి యని ప్రజలు తెచ్చియిచ్చిన కానుకల నతఁడు పుచ్చుకొనుచుండెను. ఈ కానుకలను బుచ్చుకొనుటలో నతఁడారితేరెను. ఒకరి వస్తువేదైన నతఁడు చూచిన, దానిని వారివద్దనుండి నయముననో భయముననో దెప్పించుకొనువఱకు నతఁడు నిద్రించుట లేదు.

కులము తక్కువవాఁడు గనుక, అతఁడు పేరుపొందవలెనని గోరుచుండెను. వైణికులు, గాయకులు, నటులు నతని మాట కడుగుతీయలేదు. ప్రతిదినము పండుగులవలె "బలింపుకు" క్రీడలలో నతఁడు ధనమును కర్చుపెట్టుచుండెను. అతనిని డాంబికుఁడని ప్రజ లనుచుందురు.

"ఆథెన్సుపట్టణములో నతఁడు పెద్దయుద్యోగమును సంపాదించెను. అతని శత్రువైన" ఆరిస్టైడీసు దేశోచ్చాటన నందెను. థెమిస్టాకిలీసు కోరిక నెరవేరెను. వ్యవహారములలో నతని నడ్డగించువారు లేరు. ఈ కాలములో పారసీకులు నావలతో బయలుదేరివచ్చిరి. సముద్రముమీఁద యుద్ధము జరగవలసె. గ్రీకులందఱు ఏకీభవించిరి. వారిలో నథీనియనులే విశేషముగ నావలు గలవారు. సేనాధిపత్యమును మొదట థెమిస్టాకిలీసు పుచ్చుకొనెను. కాని, తరువాత 'స్పార్టనులలో నొకని కిచ్చివేసెను. ఘోరముగ నౌకాహవము జరిగెను. పారసీకులు పెద్దకేకలు, బొబ్బలు పెట్టుటయె గాని, క్రియాశూన్యము. వీనికి గ్రీకులు భయపడుదురా? అందులో నథీనియనులు సముద్రముమీఁద నారితేరినవారు. యుద్ధములో జయాపజయములెవరివో తెలియకుండె. పారసీకచక్రవర్తి 'జెర్‌క్సీసు' కొంత భూసైన్యమును దీసికొని గ్రీకుదేశముపైకి దండెత్తివచ్చెను. ఇటుల గ్రీకులు రెండువైపులనుండి యెదురుకొనఁబడిరి. పారసీకులు "తెర్మాపొలెయి" యను కనుమగుండ వచ్చినగాని, గ్రీసుదేశములోనికి రాలేరు. కనుమముఖద్వారమున 'లియొనిడాసు'ఁడను సేనాధిపతి, ౬౦౦ స్పార్టనుసైనికులతో నిలిచి, పారశీకుల లక్షసైన్యము నెదిర్చెను. పారసీకుల శిరములు

తాటికాయలవలె వ్రాలుచుండెను. అంతలో గ్రీకులలో నొకఁడు పారసీకులకు కనుమలోని రెండవమార్గమును జూపి, వారి సైన్యమును త్రోవదప్పించి నందున, స్పార్టనులు రెండువాహినులచేత నొక్కఁబడి వీరస్వర్గము నొందిరి. సేనాధిపతికూడ రణములోఁ బడెను.

ఈ యపజయము గ్రీకులు వినిరి. చక్రవర్తి ఝారుఁడు ఫౌజులను నడిపించుకొనివచ్చెను. గ్రీకులకు వ్యవధి లేదు; ఏమిచేయుటకు తోఁచదయ్యె; బంధుమిత్రవర్గంబులను, గృహములను విడిచిపోలేరు; పట్టణములోనుండిన, మరణము నిశ్చయము. అప్పుడు థెమిస్టాకిలీసు ఇచ్చిన సలహాపైని యాబాలగోపాలము పడవల నెక్కిరి. స్త్రీ బాల వృద్ధులొక ద్వీపమునకుఁ బంపఁబడిరి. కరవు, దారిద్ర్యము, బంధువియోగము, శత్రుధాటియు వారికొక్కమారె కలిగెను. అథీనియనులు గరట నీరు పెట్టలేదు. పట్టణ మశేషము నిర్జన మయ్యెను.

శత్రువు వచ్చి యెదుట నిలిచియుండెను. గ్రీకులు వారిలో వారు గ్రుద్దులాడుచుండిరి. అథీనియనులా, స్పార్టనులా — వీరిలో నెవరు యుద్ధములో ముందునడువవలెనని వారు వాదులాడిరి. “ఎవరు నడిచిన నేమి? దేశము శత్రువునకు స్వాధీనమై, మనము వానికి లోఁబడకూడ”దని థెమిస్టాకిలీసు బుద్ధిచెప్పెను. దేశోచ్చాటన చేయఁబడినవారు, ఉత్తరువైనందున, వచ్చిచేరిరి. ఆరిస్టైడీసు గూడ వచ్చెను. కలహమునకుఁ



గాలముగాదని, వీరిసువు రేకమైరి. వీరి సలహాపైని, నౌకాహవముఁ జేయుటకు గ్రీకులు సమ్మతించిరి. అందుకు శుభశకునము లగుపడెను. సముద్రముమీఁద వారుండిన స్థలమున యుద్ధము జరిగిన, వారు జయము నొందుదురని వారితో థెమిస్టాకిలీసు చెప్పెను. మొదట వారందుల కంగీకరించిరిగాని, శత్రువుల యోడలను జూచినపైని, వారికధైర్యము గలిగెను. పారసీకుల యోడలొక వెయ్యియుండె; వీరివి నూటయెనుబదిమాత్ర ముండెను. అందుచేత స్పార్టనులు రాత్రి రాత్రియే బయలుదేరి వారి దేశమునకుఁ బోవలెనని సిద్ధముగనుండిరి.

గ్రీకులలో నెవరు వెళ్లిపోయినను దేశమునకు ముప్పువచ్చునని థెమిస్టాకిలీసు ఎంచి వారితో నెంతచెప్పినను స్పార్టనులు వినరైరి. మాటలతో గార్యము లేదని తలఁచి, తన యొద్దనున్న పారసీకపు మునిషీని పిలిచి, ‘నీవు చక్రవర్తి ఝారుని నద్దకుఁ బోయి, గ్రీకులు పారిపోవఁ దలఁచినారు. వారు పారిపోకుండునటుల పారసీకుల యోడలను నాలుగువైపుల కాపుంచుమని యతనితోఁ జెప్పిరమ్మ’’ని చెప్పిపంపెను. ఆప్రకారము మునిషీ చక్రవర్తియొద్దకుఁ బోయి, చెప్పెను. శత్రువుల యోడలు క్షణములో నాలుగువైపు లాక్రమించెను. గ్రీకులు పారిపోవుటకు వీలులేకపోయెను.

మరుసటిదినము సూర్యోదయము కాఁగానె, సముద్రముమీఁద యుద్ధమారంభమయ్యెను. గ్రీకుల పడవలు తేలి

కయినవి; శత్రువులవి, బగువు. వారు వానిని సులువుగ గడి
పిరి; గడుపుటకు వీరు కష్టపడిరి. వీ రుభయులు యుద్ధముచేసిన
చోటు సముద్రములోఁ ప్రదేశ బోటుఎక్కువ. శత్రువులు
గాలికి యెదురుగ వారి నావలను గడపవలసివచ్చెను. కొండ
చరియపైని యొక రత్నసింహాసనముమీఁద చక్రవర్తి గూర్చుం
డెను. అతనినిచుట్టి చరిత్రకారు లుండిరి. యుద్ధ మారంభ
మయ్యెను. ఇరుతెగలవారు మోటుగ పోరాడిరి. సాయంకా
లమువఱకు పోరాటము జరిగెను. పారసీకు లోడిపోయిరి.

"పారసీకులు జలసంధిమీఁద కట్టిన పడవల వంతెన విరు
గఁగొట్టి, వారిని సంహరించుట మే"లని థెమిస్టాకిలీసు చెప్ప,
"ఇదివఱకు వారేమి చేయుదు రోయను భయముతో నుంటిమి.
ఇప్పుడు వారు మన దేశమునుండి తరలిపోవు మార్గము చూడ
వలెను గాని, నీవు చెప్పినప్రకారమైన, వారు మన దేశములో
నే యుండి, మనలను మఱింత పీడింతు"రని ఆరిస్టైడీసు
సలహాచెప్పెను. పడవలవంతెనను విరుగఁగొట్టుటకు గ్రీకులు
సిద్ధముగ నుండి రను మాటను చక్రవర్తి విని, సైన్యముతో శీఘ్ర
ముగ బయలుదేరి దేశము విడిచిపోయెను. వైజయంతికమహో
త్సవములు గ్రీకులు సలిపిరి. వారి వారి స్వదేశములకు అంద
ఱును వెళ్లిపోయిరి.

ఆ సంవత్సరము జరిగిన 'ఒలింపిక' క్రీడలలో, థెమి
స్టాకిలీసుకు వీరకిరీటమును గ్రీకు లిచ్చిరి. అక్కడకు వచ్చినవా



ఱంద రతనినే చూచుచుండిరి. అతఁడు స్పార్టనుల దేశమునకు
వెళ్లెను; అక్కడ వారిచేత మర్యాదలను బొందెను. పరమో
చ్చపదవి నతఁ డధిష్ఠించెను.

"గ్రీకులంద ఱథీనియనులు చెప్పినమాటను గౌరవిం
తురు. అథీనియనులు నా మాటను మన్నింతురు. నేను నా
భార్యమాట వినుచున్నాను. నా భార్య నా కుమారుని మాట
విను"నని యతఁడు హాస్యముగఁ జెప్పెను.

ఒక సమయమున, నిరువురు నాగరకులువచ్చి, యతని
కూఁతురు నిమ్మని వేరు వేరుగ నడిగిరి. వారిలో నొకఁడు
బుద్ధిమంతుఁడు; మఱియొకఁడు ధనవంతుఁడు. "ధనములేని
పురుషునికే, నా కూఁతు నిచ్చి వివాహము చేసెదగాని,
ధనము కలవాఁడైనను పురుషుఁడుకానివాని కియ్యనొల్ల'నని
యతఁడు చెప్పెను.

ఆ థెన్సుపట్టణమున కతఁడు చుట్టు పరిఘను కట్టించెను.
పట్టణమునుండి రేవుకు పోవువఱ కిరువైపులను పెద్దగోడలను
కట్టించెను. శత్రువుల దాడికి భయపడి, గ్రీకులంద ఱొక సంఘ
ముగఁ గూడిరి. అందులో నథీనియనులు నాయకులుగ నుండిరి.
ఆ థెన్సును ఇంత గొప్పపదవిలోనికిఁ దెచ్చిన థెమిస్టాకిలీసును
ఆ పట్టణపౌరులు చిన్న నేరము మోపి దేశభ్రష్టునిఁ జేసిరి.

అతఁడు దేశము విడిచిపోయెను. అతఁడు లేనిసమయ
మున, పూర్వము జరిగిన యుద్ధములోఁ బారసీకులతోఁ గలిసి

స్వదేశ స్వాతంత్ర్యమును బోఁగొట్టఁదలఁచినాఁడని యెంచి, అథీనియను లతనికి మరణదండన విధించిరి. ఆ సంగతి తెలిసి, నిర్దోషి గనుక, అతఁడు పారసీక దేశమునకుఁ బారిపోయెను. షూరునికుమారుఁడు 'ఆర్తషూరుఁడు' చక్రవర్తియయ్యెను. ఇతనిని థెమిస్టాకిలీసు శరణు వేఁడెను. చక్రవర్తి యతనిని మన్నించి గౌరవించెను. థెమిస్టాకిలీసు పారసీకమున నుండిపోయె.

ఇంతలో గ్రీకులకును పారసీకులకును యుద్ధము తటస్థమయ్యెను. గ్రీకులపైకి యుద్ధమునకుఁ బొమ్మని చక్రవర్తి థెమిస్టాకిలీసున కుత్తరువు చేసెను. స్వదేశీయులతోఁ బోరాడుట కిష్టము లేక, విషముత్రాగి, ౬౫ సం॥ ముల వయస్సున, క్రీ. పూ. ౪౬౦ సం॥ రమున నతఁడు స్వర్గస్థుఁడయ్యెను.





# ఆరిస్టైడీసు

'ఆరిస్టైడీసు' బీదవాఁడని కొందఱు, కాఁడని కొందఱు చెప్పుదురు. అయిన నతఁడు గొంత స్థితిగలవాఁడని చెప్పవచ్చును. 'ఆథెన్సు' పట్టణములోఁ బ్రజారాజ్యమును స్థాపించిన 'క్లీస్తనీసు'తో నతనికి స్నేహముకలదు. స్పార్టనులలో ధర్మశాస్త్రవేత్తయైన 'లైకర్గసు' నతఁడు వినయముతో గౌరవించుచుండెను.

ఆరిస్టైడీసు సామంతుల పక్షములోనివాఁడు; థెమిస్టాకిలీసు సంసారుల కక్షలోనివాఁడు. అందుచేత వీరిరువురికి సహజ శత్రుత్వము. విద్యార్థులుగ నుండు కాలము మొదలు వీరు వైరముగలవారు. ఆటపాటలలో నెగాక, వారాలోచనాంశములలో భేదించిరి. ఆరిస్టైడీసు శాంతుఁడు; సాత్త్వికుఁడు; దూరదర్శి; హాస్యములోనైన బొంకులు లేనివాఁడు; గంభీరుఁడు; స్థిరుఁడు; ధార్మికుఁడు. థెమిస్టాకిలీసు తొందరపాటుకుఁ దోడు చలచిత్తముకలవాఁడు; చురుకు, నేర్పరి, కార్యములలోఁ దెగించువాఁడు. సరసమైనవాఁడు గనుక నెవిశేషముగ స్నేహితులను జాగ్రత్తచేసి, తద్వారా ప్రజారంజకుఁడై

గౌరవము పొందెను. "వాఁడు వీఁడని యెంచకపోయిన, నీవు 'అథీనియను'లను బరిపాలించి యుందు'వని యొక రతనితోఁ జెప్ప, "పరులకంటె నా స్నేతులకు హెచ్చుమేలు చేయలేక పోయినపక్షమున నా కీ యుద్యోగమువలన లాభ మేమి?"యని థెమిస్టాకిలీసు జవాబుచెప్పెను. ఆరిస్టైడీసు మాత్ర మటుల గాదు. వారు వీరని విచక్షణచేయక, న్యాయముప్రకార వ్యవహారములను విమర్శించుచుండెను. స్నేహితులకు కోపము వచ్చునేమోయని వారి యన్యాయములను న్యాయము లని యతఁడు తీర్పుచెప్పుట లేదు; అయినను, వారి మాటను త్రోసివేయుట లేదు. వారి మాట లెంతవఱకు గ్రాహ్యములో, యంత వఱకు వానిని విని యతఁడు వారిని సంతోషపెట్టుచుండెను. ముందు వెనుక లాలోచించక, ప్రజలకు మేలుకలుగునని, థెమిస్టాకిలీసు సభలోఁ గొన్ని యంశములను బ్రసంగించుచుండెను. వానిని 'ఆరిస్టైడీసు' ఖండించుట గలదు. వీ రిరువు రొకప్పు డైనను మిత్రభావమున నుండ లేదు; వీరికి నెప్పుడు పక్షాపక్షమె; "మమ్ముల నిరువురిని సముద్రములోఁ బడద్రోసినగాని, అథీనియనుల వ్యవహారములు చక్కఁబడ"వని ఆరిస్టైడీసు ముచ్చటించెను. రాజ్యతంత్రములను నడిపించు సమయమున నొకప్పుడు జయము, నొకప్పు డపజయము కలుగును. ఈ జయాపజయములలో నతఁడు మనస్సును కుదురుగ నుంచుకొని న్యాయము విచారించెను; బిరుదులు బొందవలెనను యభిలాష లేదు;



ధనముఁ గూడఁబెట్టవలె నను గోరికయు లేదు. బంధువు లని స్నేహితు లని మార్దవము లేక, శత్రువులని కార్పణ్యము లేక, యతఁడు నిష్పక్షపాతముగఁ బ్రజలకు న్యాయము నిచ్చుచుండెను. ఒక సమయమున నతఁ డొక నేరస్థుని నేరస్థుఁ డని నిరూపించిన పైని, వాని వాదము వినకయె, కోర్టువారు వానికి మరణదండన విధించిరి. అప్పుడు వాఁడు తనకు శత్రువైనను, వాని వాదము వినవలసిన దని కోర్టువారి నతఁడు వేఁడెను.

అతఁడు కోశాధ్యక్షుఁడుగ నియమింపఁబడెను. చిఠాలను తనిఖీచేసి చూచినపుడు, పూర్వపు కోశాధ్యక్షులు సొమ్ము నపహరించినటు లతనికిఁ దోఁచెను; అటుల తస్కరించిన వారిలో థెమిస్టాకిలీ సొకఁడు. నేరస్థాపనఁ జేసి, విషయమును విచారణలోనికి ఆరిస్టైడీసు తెచ్చెను. ఇతఁడు స్నేహితులు గల వాఁడు గనుక ఆరిస్టైడీసె సొమ్మపహరించె నని సభలో వాదము జేసి, యతనినె ప్రజలు నిందించునటులఁ జేసెను. అందులకతఁడు సైరించి, తన చేతిక్రింది యుద్యోగస్థులు స్వంతముకు సర్కారుసొమ్మును వాడుకొనుచున్నను, చూచి చూడనటుల నూరకుండెను. అందుకు వా రతనిని వేనోళ్ల శ్లాఘించి, యతఁడె కోశాధ్యక్షుఁడుగ నుండిన బాగుగ నుండు నని ప్రజలతోఁ జెప్పిరి. వీరు సంతసించి, యతని నా యుద్యోగములో నుంచిరి. అప్పుడు "లంచములు పుచ్చుకొని మీ సొమ్మును దిని వేయువారిని విచారణలోనికిఁ దెచ్చినపుడు, నేనన్యా

యముగ నిందింపఁబడితిని; ఇప్పుడు, వారిని సైరించుటవలన, నేను మంచివాఁడనైతి"నని యతఁడు ప్రజలతోఁ జెప్పెను. అతనిని వారు స్తోత్రముఁ జేసిరి.

ఈ కాలములోఁ బారసీకచక్రవర్తి 'డరయసు' గ్రీకుల పైకి యుద్ధముకు భూమికా సైన్యములను బంపెను. అప్పుడు, మిలిటియాడీసు, ఆరిస్టైడీసు— వీ రిరువురి నథీనియనులు సేనాధిపతులుగ నియమించిరి. వంతుప్రకారము రోజుకొకరు సేనాధిపత్యమును వహించవలసియున్నను, తనవంతారిస్టైడీసు మిలిటియాడీసునకే యిచ్చివేసెను. "సేనాధిపత్యమును నేను బాగుగ వహించలేను. అతఁడు తగినవాఁడుగనుక చూచుకొను"నని ఆరిస్టైడీసు చెప్పెను. తదనంతరము 'మరాథాను'వద్ద యుద్ధము జరిగెను. అందులోఁ బారసీకు లోడిపోయి, పడవల నెక్కి పరారు లయిరి. వా రాథెన్సుపట్టణమునకుఁ బోవుదు రను భయముచేత, నెనిమిది పటాలములను దీసికొని మిలిటియాడీసుపట్టణమునకుఁ బోయెను. యుద్ధములో దొరికిన ధనమును, శత్రువులను గాపాడుట కారిస్టైడీసుండిపోయెను. ఈ దొరికిన ధనమునకు విలువలేదు. అందులో నొక కాసైన నతఁ డపహరించలేదు సరేకదా, పరులనైనఁ దీసికొన నియ్యలేదు. అప్పటికిని, గొంద ఱతనికిఁ దెలియకుండ కొంత సొమ్మును దస్కరించుచు వచ్చిరి. ఈ యుద్ధము క్రీ. పూ. ౪౯౦ సం। రములో జరిగెను.



మరుసటిసంవత్సర మతఁడు 'అర్కను' పేరుగల పెద్ద యుద్యోగములోఁ బ్రవేశించెను. అతఁడు సమవర్తి యని పేరు బొందెను. ధర్మముగ ప్రజలను బరిపాలించెను. పరమేశ్వరుఁడు సకలగుణసంపన్నుఁడు: అమర్త్యత్వము, సమవర్తనము, ప్రభుత్వము కలవాఁడు. వీనిలో మొదటిది మనకు లభింపదు; మిగిలిన రెండును బొందవచ్చును. ప్రభుత్వము దొరికిన, క్రిందుమీఁదుఁగానక, విఱ్ఱవీగి, లోకకుటుంబములోనివారితో వైరముబొంది, కంటకము పడుదుము. అన్నిటికంటె యెక్కుడైన సమవర్తనమును బొందము. రాజాధిరాజులు సహితము 'సింహబలుఁ'డని, 'దిగ్విజయుఁ'డని, 'నరకాంతకుఁ'డని మొదలగు ప్రభుత్వము, పరాక్రమమును దెలియఁజేయు బిరుదులను బొందగోరెదరు కాని, సమవర్తనమును గలిగియుండవలెనని యభిలషించరు. శాశ్వతమైనదానిని విడిచి, యశాశ్వతమైనదానిని బట్టుకొని పెనుగులాడుచున్నాము. ఆరిస్టైడీసు సమవర్తనము నవలంబించి గీర్తిబొందెను. అది దిగంతములు నిండెను. అందుకుఁదోడు, ప్రజారాజ్యమును బోఁగొట్టి, రాజచిహ్నము లేకున్నను అతఁ డేక రాజ్యాధిపత్యమును వహించినాఁడని యెంచి థెమిస్టాకిలీసు ప్రజలతో మొఱబెట్టెను. అందుపైని వారందఱు కంటగించి, యతనిని దేశోచ్చాటనఁ జేసిరి.

దేశోచ్చాటనమునకు పాత్రులగువారు నేరస్థులనే నిర్ధారణ లేదు. శారీరస్నేహధనబలములు గలవాఁ డెవఁడైన ప్రజా

రాజ్యమునకు ముప్పు దెచ్చునని గ్రీకులకుఁ దోఁచిన యెడల, వానిని దేశమునుండి వెడలఁగొట్టుచుండిరి. వాఁడు పరదేశములోఁ బదిసంవత్సరము లుండి, తదుపరి స్వదేశమునకు రా వచ్చును. ఈలోపున వాని స్వామ్యము లేవియు పోకుండ గాపాడుట కలదు.

ప్రజలందఱు సమావేశమై, చీట్లు వేసికొని, వానిలో నెవని పేరున హెచ్చుచీట్లు వచ్చిన వానిని పరదేశమునకుఁ బంపుచుండిరి. అప్పుడొకఁ డారిస్టైడీసని తెలియక, యతని వద్దకువచ్చి, చీటిపైని 'ఆరిస్టైడీసు' పేరు వ్రాయుమని కోరెను. అందు కతఁ డాశ్చర్యమొంది, "నీ కతఁ డేమైన కీడుచేసెనా?" యని వాని నడుగ, "అతఁ డెవఁడో నేనెఱుఁగను. అతనిని సమవర్తి యని పిలిచిన పిలుపులు నా చెవులకు ములుకులవలె నంటుచున్నవి. అందుచేత, అతఁడు దేశమునుండి పోవుట మంచి దని నా యభిప్రాయ"మని వాఁడు బదులుచెప్పెను. అతఁడా ప్రకారము చీటి వ్రాసి వాని కిచ్చివేసెను.

ఇంతలోఁ బారసీకచక్రవర్తి ఝోరుఁడు యుద్ధమునకు వచ్చెను. సర్కారుత్తరువుప్రకారము దేశోచ్చాటనఁ జేయఁబడినవారందఱు పట్టణమునకు వచ్చిరి. ఆరిస్టైడీసు సహా వచ్చెను. అతఁడు, థెమిస్టాకిలీసు కలిసికొని, సఖ్యత జేసికొనిరి. ఒకఁడు దేహబలముచేత, మరియొకఁడు బుద్ధిబలముచేత,



'సలామిసు'వద్ద జరిగిన నౌకాహవములో నథీనియనులకు గ్రీకులకు జయముగలుగునటుల జేసిరి.

తదనంతరము, పారసీకులతోఁ బోరాడవలసివచ్చినప్పు డారిస్టైడీసి డిరువది పటాలములను దీసికొని, స్పార్టనులు మొదలగు గ్రీకులతోఁ బోయి, యుద్ధము జేసెను. ఇదియె 'ప్లెటియా' యుద్ధము. క్రీ. పూ. ౪౮౦-౭౯ సం॥రములో జరిగెను. ఇందులోఁ బారసీకు లోడిపోయిరి. గ్రీకు లందఱు అతనిని మన్నించిరి.

పారసీకుల దాడికి భయపడి, గ్రీకు లందఱు సమావేశమై, 'దేశసంరక్షణసంఘ'మను పేరున నొక సంఘమును స్థాపించిరి. అందులో, మొదట స్పార్టనులు పెద్దలుగ నుండిరిగాని వారి గర్వముచేత వారి నందఱు గర్హించి, ఆరిస్టైడీసుయొక్క సమవర్తనముచేత నతని మూలమున, అథీనియనులను వారు పెద్దలుగాఁ జేసిరి. సంఘమును నిలఁబెట్టుటకు దగిన సొమ్మును బ్రతివారు నిచ్చుచుండిరి. ఆ యిచ్చుటలో నెచ్చుతగ్గు లుండుటచేత, వారంద ఱారిస్టైడీసును కప్పమును సరిచేయవలసిన దని కోరిరి. అతఁడు న్యాయముగ వారి శక్తికిఁ దగినటుల పన్ను వేసెను. వారందు కంగీకరించి ముదమందిరి. ఎంత గొప్ప పనులను జేసినను, యతఁడు నిరుపేదవాఁడు. ఇటుల సంఘము వారందఱు చెల్లించిన కప్పముసొమ్ము 'డీలాసు' ద్వీపములోఁ

బెట్టి, సమయము వచ్చినపు డందఱి సలహాపైని వారు దానిని వాడుకొనుచుండిరి.

వ్యవహారములలో నతఁడు న్యాయముగనుండినను, స్వదేశాభిమానముండుటచేత, గొన్ని పనులలో నధర్మముగ బ్రవర్తింప వలసివచ్చెను. కొన్నిసమయములలో సర్వసమక్షమైన ధర్మములు పక్షము వహించుటచేత నధర్మము లగును. అవి కేవల మధర్మము లని చెప్పలేము. ధర్మ మతిసూక్ష్మము. సంఘమువారి సొమ్ము 'డీలాసు' ద్వీపమునుండి తెచ్చి, 'ఆథెన్సు'పట్టణములో నుంచవలెనని, యథీనియనులు మహాదేశీయుల సభలో ముచ్చటించిరి. అటుల చేయగాదని గ్రీకు లందఱు, చేయవచ్చునని యథీనియనులు, వాదించిరి. అటుల చేసినపక్షమున నథీనియనులా సొమ్ముతో భూ నావికాసైన్యములను బలపఱచి ప్రబలు లగుదురని గ్రీకులు భయపడిరి. అందుచేత వారు కూడదని వాదించిరి. అందఱి సొత్తుగభావింపఁబడినదానిని, యథీనియనులు తమ పట్టణమునకు దీసికొనివచ్చుటకు యత్నించుట యధర్మమైనను, ఆరిస్టైడీసందుల కంగీకరించెను.

విరోధియైన థెమిస్టాకిలీసుని నతఁడు తృణీకరించలేదు; ఇతని సుగుణములనే యెంచెను; పరోక్షమున నితని నెన్నడు నిందించలేదు; ఇతఁడు కష్టములపాలై, దేశోచ్చాటన జేయఁబడి, పరదేశములలోనున్న సమయమున, నితనిని దలఁచు



చుండెను. ఆరిస్టైడీసు దరిద్రుఁడైనను, భాగ్యవంతుఁడైన థెమిస్టాకిలీసు నీర్ష్యతోఁ జూచుటలేదు.

ప్రజలచేత మన్ననలు వొంది, పూర్ణాయుర్దాయుఁడై, క్రీ. పూ. ౪౬౮ సం॥ రములో ఆరిస్టైడీసు స్వగ్రామములో స్వర్గస్థుఁ డయ్యెను.



SADANANDA NILAYAM PRESS, MADRAS

# బెంజమిను ఫ్రాంక్లిను జీవన చరిత్రము

## మొదటి ప్రకరణము

### బాల్యదశ

అమెరికా దేశమునందుఁ బ్రసిద్ధికెక్కిన కార్యనిర్వాహకుఁడును, దేశాభిమానియు, తత్త్వజ్ఞుఁడును నైన బెంజమిను ఫ్రాంక్లినుగారి జీవనచరిత్రమును ఇందు పొందుపఱచుచున్నారము. ఇంగ్లాండులో 'నార్త్తాంప్టన్ షియరు' నందలి ఎక్టను పట్టణమందు క్రీ. శ. 1655 వ సంవత్సరమున, అతని తండ్రి, జోషయా ఫ్రాంక్లిను జననమొందెను. తన యౌవన కాలములో నితఁడు బట్టలకు రంగువేయు వ్యాపారము నవలంబించి, క్రమముగా దానియందే స్థిరపడి, 'ఆక్స్‌ఫర్డ్ షియరు' (Oxford Shire) నందలి 'బాన్ బరి' (Banbury) పట్టణములో నివసించియుండఁగా, 21 వ సం॥ రమున ఇతని కాగ్రామముననే వివాహమాయెను. ఈయన తమ్ముఁడు బెంజమిను ఆ గ్రామము నందలి పాదిరియొక్క కుమార్తెను వివాహమాడెను. బాన్ బరి పట్టణముతోడ దనసంబంధము జేసికొనెనని, అక్కడనే నే వ్యాపా

రము జేయుచున్న యీయిరువురు సోదరులు సోదరులకు సహజ మగు వైరములేక, దేశకాలభేదములను గమనింపక, తమ యన్యోన్యానురాగమును వృద్ధిపొందించుకొనుచు వచ్చిరి. బాన్బరిపట్టణమందు జోషయాకు ముగ్గురు పిల్లలు గలిగిరి.

ఆకాలమం దింగ్లాండు దేశపు రాజు రెండవ ఛార్లెసు. ఈయన విషయాసక్తుడై రాష్ట్రమును బాడుచేసి, దాంభిక దైవజ్ఞులను జేరదీసి, నిష్కపటులైన వారిని బారదోలుచు వచ్చెను. జోషయా ఫ్రాంక్లిను, వీరి సోదరుడు బెంజమిన్,—వీరి కుటుంబములో వీరిరువురే యని తోచుచున్నది—పారదోలబడిన పాదరీల పక్షము నవలంబించి, దైవజ్ఞుల సమాజములకు (Conventicles) వెళ్లుచు వచ్చిరి. ఈ సమాజములు నిషేధింపబడినవియైనందున, ఎప్పుడును స్వాస్థ్యము లేనివియై యుండె. ఎవరి కృపాకటాక్షము వర్తకునికి శ్రేయస్కరమో యట్టివారి యాగ్రహ మీ సమాజములకు వెళ్లువారియందు బ్రసరించుచుండెను. 1685 - సం॥ రపు ప్రాంతమున జోషయా ఫ్రాంక్లిను తన సోదరుడు బెంజమినుకును, నింగ్లాండునకును స్వస్తిజెప్పి భార్యను ముగ్గురు పిల్లలను దీసికొని, తన యిరుగుపొరుగువారును, సమాజమువారును వెంబడిరాగా, బోస్టను పట్టణమునకు గాపురము వెత్తివేసెను.



౫౬ - సం॥రములకు బూర్వము కట్టబడి, అప్పటికి అయిదాఱు వేల ప్రజాసంఖ్య గల ‘బోస్టను’ పట్టణము బ్రవేశించి, రంగు లద్దువ్యాపారమునకు దగిన ప్రోత్సాహము లేనందున, ‘జోషయాఫ్రాంక్లిను’ క్రొవ్వు కరిగించి, సబ్బు తయారుచేయు వ్యాపారమునందు బ్రవేశించెను.

బోస్టనుపట్టణమునం దితులు తన శాయశక్తుల వ్యాపారమును నడిపించుచు, నాలుగు డబ్బు లితడు సేకరించెను. ఇతని కుటుంబము సయితము నానాటికి వృద్ధిబొందెను. 1685 సం॥రం ఆగస్టు తే-23 దిని, ఇతనికొక కుమారుడు గలిగెను. వానికి జోషయా యని నామకరణ మొనర్చిరి. సముద్రమార్గమున పారిపోయి, చాలకాలము వఱకు దన క్షేమసమాచారములు దెలియజేయనందున, వీడు తల్లిదండ్రులకు దుఃఖము గలుగజేసినవా డయ్యెను. ఇతనిపోలిక ననుసరించి యితని కనిష్ఠభ్రాత, బెంజమిను అనువాడు గూడ నటులనే చేసెను. సం॥ 1687-రము జనవరి తే 5 దిని, జోషయా ఫ్రాంక్లినునకు ‘అని’ యనుకూతురు పుట్టెను. సం॥ 1688-రము ఫిబ్రవరి తే 6 దిని జోసెఫనువాడు పుట్టి, శైశవదశయందే స్వర్గస్థుడాయెను. తరువాత సం॥ 1689-రము జూను తే-30 దిని మఱియొక జోసెఫను కుమారుడు గలిగెను. ఏడుగురు బిడ్డలనుకని తనకు సం॥ 35-రములు వయసున్న జోషయా ఫ్రాంక్లినుగారి

భార్య స్వర్గస్థురాలాయెను. అప్పటికి పెద్దవాఁడు సం॥ 16 ముల ప్రాయమువాఁడు—చేతివాఁడు నెలలకందువ—కడమవారు లేఁ ప్రాయపువారలు—వీరలను బెంచి పెద్దవారిని జేయుభారము తండ్రిపైఁ బడెను. ఇట్టి యవస్థలో మఱియొక యాధారము లేనివాఁడై, తాను చెమట నూడ్చి కష్టార్జితముగ సంసారము గడపవలసినందున తన, పిల్లల సంరక్షణార్థమై, అతఁడు తిరుగ వివాహ మాడవలసి వచ్చెను. సంవత్సరము వెళ్లు పర్యంత మాపు చేయవలసిన యాచార మున్నను, నట్లుచేయక, వెంటనే అతఁడు ద్వితీయ కళత్రమును స్వీకరించెను. ఈ కళత్రమునకుఁ గలిగిన ప్రథమసంతానమునకును ప్రథమ కళత్రమునకుఁ గలిగిన కడపటి సంతానమునకును పదునెనిమిది మాసములే వ్యత్యాసము. 'నాన్టుకెటు' దీవిలోఁ బ్రథమవాసులలో నొకఁడైనఁ 'పీటరు ఫోల్ జరు' గారి చిన్నకూఁతురు 'ఆబయా' యను నామెయే ఈ రెండవభార్య. ఈమెను వివాహ మాడుసరికి నీమె సం॥ 22-రముల ప్రాయముగలది.

'పీటరుఫోల్ జరు' విషయమై మనము చెప్పవలసిన దేమనఁగా, బెంజమిను ఫ్రాంక్లినున కీయన తగిన మాతామహుఁడు; 'లెస్సగ చదువుకొని దైవభక్తిగలవాఁ' డని నితని సమకాలికుఁ డొకఁడు ఇతనిని స్తోత్రముఁ జేసెను; 'పశ్చిమరుయిండియా' భాషలను నేర్చుకొని, యా దేశపుబాలురకుఁ జదువను వ్రాయను ఈయన



నేర్పుచుండెను. 'పరిమాణశాస్త్రము' (Survey) నందుఁ బ్రవీణుఁడు గాన, నూతనవాసుల యాశ్రమములను వేర్వేరుగ స్థిరపఱచుటయందితఁడు ప్రయాసపడుచు వచ్చెను.

ముప్పదియయిదు సంవత్సరములవయస్సు, పెరిగిన యారుగురు పిల్లలు, క్రొవ్వు వ్యాపారము—ఇట్టి సంపత్తితో, పండితుఁడని మర్యాదగ కాలముపుచ్చుచున్న వాని కూఁతురును సం॥ 22-రముల వయస్సుగల స్త్రీని జోషయా ఫ్రాంక్లిను వివాహమాడి, యామెకుఁ దన పిల్లల నప్పగించి, వారి విషయమై యామె పాటుపడునట్లు చేసెను. అట్లు చేయక పోయిన పక్షమున వీరిదాంపత్య మనుకూలము లేక యుండి యుండును. ఇంపైన విగ్రహమును, సరసపు మాటలును, లౌకిక బుద్ధియునై కేవలము కుఱుచగాక, కేవలము పొడవుగాక, పటుత్వము, దార్ఢ్యము, బలముగలిగి జోషయా ఫ్రాంక్లిను పనులునేర్పుగ నెరవేర్చుచుండెను. ఆయన "యవయవములు" అతని పూర్వుల జన్మభూమి ఇంగ్లాండని తోఁపఁజేయుచుండెను. నీటుగ, తేటుగ, బొమ్మలను వ్రాయుటయందును, వీణెను జక్కఁగఁ మీటుటయందును అతఁడు నేర్పు గలవాఁడు. అతని కంఠము శ్రావ్యముగనున్నను, గొంచెము బొంగుగ నుండును; సాయంసమయమున, తన నిత్యకృత్యములను ముగించుకొని, వీణెవాయించి పాడుచు, తన జన్మదేశము

నందు రచింపఁబడిన పాటలను, కీర్తనలను గానముఁజేయుచు, దనవారి నందఱను ఉల్లసింపఁ జేయుచుండును. అతని కంఠస్వర - వీణాస్వరములు, పూర్ణాయుర్దాయుఁడై మనిన అతని కుమారునకు యావజ్జీవము వినఁబడుచు వచ్చి, తండ్రిగారితో నాట పాటలయందుఁ గడపిన సాయం సమయములు జన్మాంతము వఱకు జ్ఞప్తికి వచ్చుచుండెను. జాగరూకత, నూతన విషయములను దెలిసికొనుటయందాసక్తి, స్వచ్ఛమైన మనస్సు, వీనిని గలిగి, బుద్ధిమంతులును తెలివిగల వారును నగు స్నేహితులతో మెలఁగుచు, వారితో గోష్ఠిచేయుటయందిచ్ఛగలవాఁడై యుండెను. యుక్తాయుక్త విచక్షత, నిర్మలత్వము, సౌహార్దము కలవాఁడని మెప్పువడసినందున, నిరుగు పొరుగు వారేమి, పౌరవ్యాపారములలోను, దేవస్థానవిషయములలోను దిరుగుచున్న పెద్దలేమి ఇతని సలహాను గోరి వచ్చుచుండుదురు. శుద్ధుఁడు, శాంతుఁడు, దాంతుఁడునై, కార్యములను పూనికతోను, నేర్పుతోను, చాకచక్యముతోను ఇతఁడు నెఱవేర్చుచుండెను. కావుననే 'ఆబియాఫోల్జెరీ' యీయనను జేబట్టి, యీయన కార్య నిర్వాహక భారమునుగొంత తాను శ్రద్ధాభక్తులతో వహించెను.

ఈ దంపతులకు పదుగురు బిడ్డలైరి. సం॥ 1690 - రము డిశంబరున, జాను; సం॥ 1692 - రము నవంబరు తే - 22-వ దిని, పీటరు; సం॥ 1694 - రము సెప్టెంబరు తే - 22 దిని, మేరీ యను కూఁతురు; సం॥ 1697 - రము ఫిబ్రవరి తే - 4 దిని, జేమ్సు; సం॥ 1699 - రము జూలై తే - 9 దిని, సారా యనుకొమార్తె; సం॥ 1703 - రము డిశంబరు తే - 7 దిని, తామసు; సం॥ 1706 - రము జనవరి తే - 6 దిని, బెంజమిను ఫ్రాంక్లిను; సం॥ 1712 - రము మార్చి తే - 27 దిని, జేను యను కొమార్తెయుఁ బుట్టిరి. 'జేను' అందఱిలోను చాల చక్కనిది. అందఱికి ముద్దు బిడ్డ. బెంజమినునకు ముద్దు చెల్లెలు. వీరిరువురు అఱువదివత్సరములవఱకుత్తర ప్రత్యుత్తరములను జఱుపుచుండిరి.



'బెంజమిను ఫ్రాంక్లిను' ఆదివారమునఁ బుట్టెను. క్రైస్తవాలయమున కిరువది గజముల దూరములో వీరి గృహ ముండెను. తండ్రి ఈ శిశువును జేతులలోనుంచుకొని, ఆసమీపమున నున్న యాలయమునకుఁ దీసికొని వెళ్లి, ఆలయాధికారియైన 'డాక్టరు విలార్డు'చే, శిశువునకు జ్ఞానస్నానముఁ జేయించి 'బెంజమిను' అని తన తమ్ముని పేరిడెను.

పెద్దకుటుంబములో జన్మించి పెఱుగుట శిశువుయొక్క పురాకృత పుణ్యఫలమే గాని మఱియొకటి కాదు. చెడుమార్గములయందుఁ బ్రవర్తించుటకు శిశువున కవకాశములు తక్కువగ నుండును. తన్ను బ్రేమించువారు చాలమంది యనియు, తాను చాలమందిని బ్రేమించవలె ననియు తెలియును. పది మందిలో తానొక్కఁడనే భావమును బొంది, వారలకుఁగూడ

తనవలె చైతన్యము, స్వభావము, మమకారములు గలవని తెలిసికొన మార్గముండును.

ఈఁడు వచ్చి సంతానవంతుఁడైన పిదప, తండ్రితో సహ పంక్తిని కూర్చుండెడు పన్నెండుగురు సోదర సోదరీలను బెంజమిను ఫ్రాంక్లిను జ్ఞప్తికిఁ దెచ్చుకొనుచుండును. బాల్యావస్థలో తమ గృహమందుఁ బొందిన సౌఖ్యమునకు, నితఁడును, ఇతని చెల్లెలు జేనును, నిదర్శనులయి యున్నారు. "సంసార పక్షముగనున్న మన గృహములోఁ బెరిగితిమి. లెస్సగఁ దిండితిని, కోరిన వస్త్రములను గట్టుకొని, చలి కాచుకొనుచు, మనలో నేవిధమైన యంకిలి లేక, కలసి మెలసి యుండెడి వారము. పెద్దలంద అనుకూలముగనుండెడివారు. సర్వత్ర, వారు గౌరవమునుఁ బొందుచు వచ్చిరి" అని ఈమె వ్రాయుచున్నది.

బోస్టను పట్టణమందు నానాఁటికి వృద్ధిఁబొంది, జోషయా ఫ్రాంక్లిను ధనికుఁడాయెను. ఇంగ్లాండు దేశమందుండిన నితని తమ్ముఁడు, బెంజమిను, ధనికుఁడు గాలేదు. బంధువులకు స్నేహితులకు వాత్సల్యమును గనఁబఱచి, అతఁడు సుగుణసంపత్తులను గలవాఁడయ్యెను. కాని, సర్వకాల సర్వావస్థలయందు నుండ వలసిన కొన్ని గుణములు అందు ముఖ్యముగ రాజ్యక్రాంతి క్షోభలు సంభవించునెడ తాను స్థానభ్రంశమందకుండుటకు



వలసినవి ఈతని యందు లేకుండెను. దీనింబట్టియే "తన మేలుకు మించిన లౌకికుఁడు" అని ఇతని యన్న కుమారుఁ డితని విషయమై వ్రాసెను. దీనికి తోడుగ, సంసారదుఃఖము లితనిని బొందసాగెను. క్రమముగ, భార్య, తొమ్మండుగురు పిల్లలు వియోగమంద, నితని లౌకికవ్యాపారము లన్నియు నానాటికి క్షీణించెను. కాని, యెన్ని కష్టములు వచ్చినను, మనస్సును దృఢముగ నిలుపుకొని, చిదానంద స్వరూపుఁడై, తనకు లభించిన గ్రంథములను జదువుచు, కాలయాపనముఁ జేసెను. వ్యాసములు, మతబోధకవచనలు, మొదలగువాని కితఁడు సంపాదకుఁడుగ నుండెను. తన కాలమునందలి రాచకీయ విషయముల కనుగుణ్యముగ తాను చేసిన స్వరలయసాహిత్యమైన పాటలఁ బాడుటయందత్యధికాసక్తిఁ జూపుచు వచ్చెను. భార్యాపుత్రాదుల వియోగముఁ బొంది, స్నేహితులచే విడనాఁడబడి సహించి, తన యన్న కుమారుఁడు తన పేరు కలవాఁడనివిని సంతసించి, వాని యోగక్షేమము లఱయుచు వచ్చెను.

"జోషయా," "బెంజమిను" లిరువురును, తమ యోగక్షేమముల నుత్తర ప్రత్యుత్తరములచేఁ దెలిసికొనుచుండిరి. అవి వీరి వంశచారిత్రయందిమిడి యున్నవి. నానాఁడు తన యన్న కుమారునికి బెంజమిను బంపిన పద్యము లీ బాలుని జీవనము విషయమై తెలియఁజేయఁగల ప్రథమాంశముల కాధారములు.

ఇతఁడు పాఠశాలలో తగుమాత్రము విద్యనభ్యసించెను. పూజనీయుఁడైన తండ్రి, ప్రేమాస్పదయైన తల్లి వీరిరువురు పురుషార్థములకయి జఱపిన గృహస్థాశ్రమము, ప్రత్యక్షకాలవిస్ఫారితవిషయావలోకనము, తండ్రిగారి పుస్తకములు, స్నేహితులు, వీనిని మించి పినతండ్రి బెంజమిను పంపిన యమూల్యనీతిబోధక లేఖలు, చిన్ని బెంజమినునకు మార్గసూచకము లయ్యె.

బుద్ధిని వికసింపఁజేయు నీ విషయములు, బెంజమినునకు సం॥ 9-రములు ప్రాయము వచ్చువఱకుఁ బ్రసరించెను. బాలుఁడు మందబుద్ధియైన పక్షమున నివి శ్రేయోదాయకము లయినవో, కానివో, విమర్శించుటకు ఎడముండియుండును. కాని సహజముగ సూక్ష్మబుద్ధిగలవాఁడై, నూతనవిషయ పరిగ్రహణేచ్ఛ గలిగి, మేధావియైన బెంజమిను విషయమై, యివి శ్రేయోదాయకము లని వేఱుగ చెప్పనేల?

ఈయన బాల్యావస్థలో జఱిగిన ఒక్క యంశము సర్వజనసామాన్యముగ తెలిసినదే. "నే నేడు సంవత్సరములు ప్రాయముగల వానిగ నున్నప్పు" డొక పండుగ రోజున నా స్నేహితులు నాజేబునిండ డబ్బులు వోసిరి. వెంటనే, నేను పిల్లలాడుకొను వస్తువులు దొరకు దుకాణమునకుఁబోయి, యక్కడ యాకస్మికముగ నొక బాలుని చేతిలోనున్న యీలనుజూచి, దాని ధ్వనిని విని సంతసించి, నా జేబులోని



డబ్బులన్నియు ఆ బాలుని కిచ్చివేసి, యాయీలను బుచ్చుకొంటిని. దానినిఁ బట్టుకొని, యింటికివచ్చి, మహోల్లాసముగ నీలఁగొట్టుచు, నింటినాలుగు వైపులు తిరిగి నందున, నింటివారందఱు చికాకుపడిరి. నాయన్నదమ్ములు, చెల్లెండ్రు, నేను గొన్న వస్తువును జూచి నవ్వి, దాని ఖరీదు కంటె నాలుగు రెట్లు హెచ్చుసొమ్ము నిచ్చినా నని చెప్పి, పరిహాసముఁజేసినందున, నాకు విచారము గలిగి, యీలకొనిన సంతోషము లేకపోయెను. హెచ్చుగ నిచ్చినసొమ్ముతో దీనికంటె మంచివస్తువులను గొనుటకు వీలుపడియుండు ననుట నా మనస్సును సదా నొప్పించుచున్నందున, నుత్తరోత్తర మిది నాకు మేలును గలుగజేసెను. ఎన్నడైన, ననుపయోగమైన వస్తువును గొనుటకు నుద్యుక్తుఁడనైనప్పుడు, ఈలకువలె హెచ్చు సొమ్ము నిచ్చివేయుదు నేమోయని జ్ఞప్తికిఁ దెచ్చుకొనుచు, ధనమును వృధావ్యయము జేయుట మానివేసితిని" అని ఫ్రాంక్లిను తన స్వీయచరిత్రయందు వ్రాసియున్నాఁడు.

చిన్ననాటనుండి, బెంజమిను పుస్తకములు చదువుటయందాసక్తిఁ జూపుటచే, నితనినిఁ గ్రైస్తవ ధర్మమునకై నియోగింపవలె నని తండ్రి యాలోచించెను. ఈ నియోగమును పినతండ్రి బెంజమినుగూడ నంగీకరించి, తనవద్దనున్న ప్రాచీన మతోపన్యాససంపుటములను నితని కిచ్చెను. జోషయాయను

నతఁడు తప్ప, ఇతని యితర సహోదరులు స్వానుగుణోచిత వ్యాపారములయందు ప్రవేశించిరి. బెంజమిను శిశువుగ నుండినపుడే, "జోషయా" యను యన్నగారు సముద్రముపైని దేశాంతరగతుఁ డయ్యెను.

సం॥ 8 - రములు ప్రాయ మప్పుడు, 'బోస్టను వ్యాకరణ పాఠశాలలో'' బెంజమిను ప్రవేశ పెట్టఁబడెను. మొదటి సంవత్సరమున, ఇతఁడు తన తరగతి బాలుర నతిక్రమించి, పై తరగతి చదువునకు యోగ్యతాపత్రికను పుచ్చుకొనుసమయమున, కుటుంబ భార మత్యధికమై నందున ఇతనితండ్రి, పై చదువు చదివించుట తనస్థితికి మించిన పనియని యాలోచించి, కుమారుని చదువు మాన్పించెను. కొంతకాలమునకు పిదప బోధన, లేఖన, గణితములందు ప్రవీణుఁడని పేరొందిన "జార్జిబ్రౌమువేలు" పెట్టిన పాఠశాలకు బెంజమినును బంపిరి. ఒక సంవత్సరపర్యంత మా పాఠశాలలోనుండి బాగుగ వ్రాఁత వ్రాయుట నేర్చుకొనెను గాని, గణితము మాత్ర మతనికిఁ బట్టువడలేదు. పదిసంవత్సరముల ప్రాయము వచ్చుసరికి, విద్యాభ్యాసము సరిపోయినది. నాఁటనుండి వ్యాపారములోదిగి, తండ్రికి సహాయముఁ జేయుచు, మూసలలో కఱగిన క్రొవ్వునుపోసి వత్తులను దింపుచు, దుకాణము వద్ద సరకుల నమ్మి, జాబులను వ్రాయుచు వచ్చెను. ఈ వ్యాపారమెంత యసహ్యకరమైనను, శ్రద్ధాభక్తులతో దానిని జేయుచు,



"తనయాశ్రమ ధర్మమెవఁడు పూనికతో నడపునో, వాఁడు మూర్ధాభిషిక్తుల సాన్నిధ్యమును బొందును; తుచ్ఛులను బొందఁడని," రాజర్షియైన సాలమను చెప్పిన నీతివాక్యమును తండ్రి తన స్మరణకు సదా తెచ్చుచుండెనని తన స్వీయచరిత్రలో ఫ్రాంక్లిను వ్రాసియున్నాఁడు. ఏబది సంవత్సరములు గడచిన వెనుక డాక్టరు ఫ్రాంక్లినని పేరువహించి, రాజన్యుల సాన్నిధ్యముననుండి, యీ నీతివాక్య మితఁడు స్మరణకు దెచ్చుకొనుచుండెనఁట.

పనులు పుచ్చుకొనుటయందంతగా కాఠిన్యమును తండ్రి వహింపనందున, బాలక్రీడలయందు విహరించుటకును, పుస్తకములు చదువుటకును బెంజమినున కవకాశము దొరకుచుండెను. సముద్రతీరమున నివసించుటచే, జలక్రీడలయం దామోదము బెంజమినునకు కలుగుట సహజము. చిన్నపడవలను నడపుటయందే కాక, యీఁదుటయందుఁగూడ, ప్రావీణ్యమును ఇతఁడు కొద్దికాలములోనే సంపాదించెను. ఈతయందత్యధిక మోహము గలవాఁడై, వయస్సు ముదిరినను దానిని ప్రేమతోఁ జూచుచుండెను. నేర్చుకొనదగిన ముఖ్యాంశములలో దీనిని నొకదానిగ నెంచి, తన యభిప్రాయమును స్థిరపఱుచుటకై యనేక వ్యాసములను వ్రాసెను.

"ఒకరోజున గాలిపటమును వినోదార్థమెగరవేసి, దరిదాపుగ మైలువెడల్పుగల యొక సరస్సు సమీపమునకు వచ్చి,

యొడ్డున నొక కొయ్యకుఁ బటముయొక్క దారమునుగట్టి, నేనీదు
టకు నీటిలో దిగి, యంత రాళమున నెగురుచున్న పటమును జూచి
సంతోషించుచుంటిని. ఎగురుచున్న పటముఁ బట్టుకొని, యీఁద
వలెనను అభిలాషతోఁ నొడ్డునకువచ్చి, దారమును విప్పి, చేతఁ
బట్టుకొని, నీటిలోనికి వెళ్లి, వెలికిలఁబండుకొని, చేతులతో
దారముఁ బట్టుకొని నందున, నీటిమీఁద మనోహరముగ లాగ
బడితిని. నావస్తులనవతలి గట్టునకుఁ దీసికొని రమ్మని నా స్నేహి
తునితోఁ జెప్పి, సునాయాసముగను, చెప్పనలవి కాని మనోల్లా
సముతోను లాగఁబడి, సరస్సును దాఁటితిని" అని తన స్వీయ
చరిత్ర యందొకచో నీతఁడు లిఖించియున్నాఁడు.

నీటిభయము లేకపోవుటకుఁ దోడు, తండ్రి యొక్క వ్యాపా
రమునందు రోఁతపుట్టుటచేత సముద్రముపై యాత్రజేయుట
యందితని కభిలాషకలిగినందున, తండ్రికి మనోవ్యాకులము
విశేషమయ్యె. దైవికముగ, సం॥ 1715-ర ప్రాంతమున, నితని
పినతండ్రి బెంజమిను తన జీవితకాలావశేషము తన యన్న
గారివద్ద వ్యయపఱచుటకు నుద్దేశించి, యమెరికా దేశమునకు
వచ్చెను. ఇట్లు చేరిన యన్నదమ్ముల కుటుంబములు రెంటికిని
స్నేహము కుదుర, సహోదరు లిరువురును కలిసి నొక్కచెప్పి,
చిన్నిబెంజమినునకు సముద్ర ప్రయాణముపదలి యుత్సాహ
మును విఱిచివేసిరి.



అనేక కావ్యములను, సంక్షిప్త మతబోధకోపన్యాసములను
ఇతని పినతండ్రి యింగ్లాండు దేశమునుండి తీసికొని వచ్చెను.
అతఁడు సూచీభావసమన్విత విమర్శనాయత్త చిత్తంబున కపట
రాహిత్య మనోవ్యాపారముల నాపాదించు సరసోల్లసిత చతుర
భాషణంబులచే యుక్తియుక్తముగ తన పేరింటిగానికి బుద్ధులు
గఱపి, సంకేతలిపిని నేర్పి, తనకుంబలె సన్మార్గప్రచారణేయు
నిగఁజేసి, యతని నీటిప్రయాణసన్నాహమును నిషేధింపించెను.
నాలుగు సంవత్సరములు దనయన్నగారి గృహమందు నివసించి,
తనకుమారుఁడు, సామ్యుల్, వివాహమాడి, వేరుకాపురము పెట్టి
నందున, పినతండ్రి బెంజమి నక్కడ నివసించుటకుఁ బోయెను.
ఇతఁడు సం॥ 77-రములు జీవించి, సం॥ 1727-రమున లోకాం
తరగతుఁడయ్యెను.

యౌవనవంతుఁడైన బెంజమినుయొక్క విద్యాసక్తి, యౌవన
వంతులచేఁ బఠింపఁదగిన గ్రంథములయందుఁ బ్రసరించుటయే
గాక, జ్ఞానోదయోద్దేశ సద్గ్రంథ పారాయణమును సహితముఁ
బ్రేరేపించెను. బనియను వ్రాసిన "యాత్రికుని సంచారము"
అను గ్రంథము, ప్లూటార్కు వ్రాసిన "మహానీయుల జీవన
ములు" ను నతనికి ప్రోత్సాహదాయకములయినవి.

"నేను చదువుకొను దినములలో" "మా తండ్రిగారివలన
వ్రాయఁబడినదని నే ననుకొనుచున్న 'సన్మార్గోపదేశవ్యాసము

లను పేరుగల గ్రంథము నాకు దొరకినది. ఈ గ్రంథమిదివఱకెవరిదో, వారు దీనిని నిరాదరణతోఁ జూచుచుండి రనుటకు తార్కాణముగ, దీనియందు కొన్నిపత్రములు చినిగి యున్నవి; అయినను, శేషించిన పత్రములను జదువుటవలన, నాయోచనావృత్తి నూతనపథాన్వేషణ విముఖియై, యావజ్జీవము నన్ను సన్మార్గప్రవర్తకునిగఁ జేసెను. కీర్తిదాయకములైన వ్యాపారము లన్నిటిలోను, సత్కర్మనిరతుల నడవడిక లమూల్యములని తోఁచుచున్నది. తమరనుకొనుచున్నప్రకారము, నేనే సర్వజనోపకారినైన యెడల, నేనటు లనిపించుకొనుటకుఁ గారణమీ గ్రంథమేయని యూహించవలెను" అని లేఖను వ్రాసెను.

మతాచారముతోను నిష్ఠతో నితనినిఁ బెంచిరి. విధిప్రకారము సోదర సోదరీలతో నితఁడు క్రైస్త్వాలయమునకు వెళ్లవలసియుండెను. అన్యోన్యానురాగముతో బిడ్డలు 'తలిదండ్రులయెడ శ్రద్ధాభక్తి వినయపూర్వకముగ నడచుచుండిరి. భోజనాద్యంతములఁ జేయుప్రార్థన చాలకాలము బట్టుచున్నందున, నది మనసకరించక, "నాయనగారు దైవప్రార్థన నొకమాఱు సేసిన, కాలాతిక్రమణము జరుగదని" బెంజమిను నుడివెను.

మొత్తముమీఁద, బెంజమిను బాల్యావస్థ సౌఖ్యముగ జరుపఁబడెను. జీవితాంతమువఱకే బోస్టనుపట్టణమందలి యువస్థనే నతఁడభిలషించుచుండెను; సం॥ 82 రములు ప్రాయ



మప్పుడు సహితము తన జన్మస్థానము నత్యాదరముతో స్మరించుచు వచ్చెను. నిర్మలహృదయముతో స్వచ్ఛందముగ క్రీడలయందు విహరించిన ప్రదేశములందుఁ దిరుగసంచరించుట కెంతయుఁగోరికోరి, యలభ్యమనియెంచి, బోస్టను పురవాసులతో సంగమించి, సావకాశమైనపు డెల్లవారితో నతఁ డిష్టాగోష్ఠిని కాలము జరపుచు నామోదించుచుండెను. "బోస్టనుపట్టణాచారములు, అక్కడి సమాసావృత్తులు, మాటధోరణి, కంఠసరళత యివి యన్నియు సంతోషదాయకములై, నన్ను పునరోద్ధారణచేయునవిగా తోఁచెడిని" అని బెంజమిను వ్రాసెను.

---

రెండవ ప్రకరణము.



బోస్టను పట్టణము - శుశ్రూష.

రెండుసంవత్సరములవఱకు బెంజమిను తండ్రికి సహాయముఁ జేయుచు వచ్చెను. తన జ్యేష్ఠభ్రాత జాను ఫ్రాంక్లిను, చిన్న నాఁటనుండి తండ్రికి పనిలో సహకారియై యుండి, రెండవసంవత్సరాంతమున వివాహమాడి, 'రోడు' దీవికి కాపురము వెళ్లి, సబ్బు, కొవ్వు వత్తులు, తయారు చేయుచుండెను. ఈ కారణము చేత, బెంజమినుసహాయము తండ్రికి ముఖ్యావశ్యకమై, తన కిష్టములేని పనినుండి తప్పించుకొనుటకు మార్గము లేవియు బెంజమినుకు గానరాకుండెను. ఈ సూచనవలవల్ల చాల దుఃఖాక్రాంతుఁడై, యసంతుష్టి జెందినందున, నతఁడు సముద్రయానముఁ జేయుటకుఁ బ్రయత్నించునేమోయని భయపడి, యతనికి మనస్కరించిన వ్యాపారమునందు నియోగించుటకు తండ్రి యుద్యుక్తుఁడాయెను. వడ్రంగులు, తరిమెన పట్టువారు, కంచరివాండ్రు—వీరియంగళ్లకు తండ్రి కుమారుని క్రమముగఁ దీసికొనివెళ్లి, యేవ్యాపారమునం దితనికి మొగ్గుకలదో, దానియందతనిని బ్రవేశపెట్టి, యోడప్రయాణమును మానిపింపవలెనని తండ్రి యాలోచించెను.



లండను పట్టణమం దచ్చుకొట్టుటను నేర్చుకొనిన బెంజమినుయొక్క జ్యేష్ఠభ్రాత, జేమ్సు ఫ్రాంక్లిను, బోస్టను పట్టణమునకు వచ్చి స్వాంతముగ ముద్రాక్షరశాలను బెట్టెను. ఒక సంవత్సరమునకు పైగా నితని కచ్చుపని లేక యుండెను. వర్తకులకు చిన్న పుస్తకముల నచ్చువేసి యిచ్చుటయు, స్త్రీల కుపయోగమైన పట్టు, నార, చీట్లమీఁద ముద్రించుట, మొదలుగాఁగల పనులఁ జేయుచు వచ్చెను.

తండ్రి కుమారులు కార్ఖానాలను క్రమముగఁ దిరిగి చూచినపుడు, ముద్రకుని వ్యాపార మంతగ వీరికి నచ్చినట్టు కనఁబడదు. ఎందుచేత నన, ఈ వ్యాపారముఁ జేయుచున్న జేమ్సు కంతగా లాభము లేనందున, కుటుంబములో నిదివఱకే యొకఁ డావ్యాపారముం జేయుటయే, చాలు నని తండ్రి యెంచెను.

జేమ్సు ఫ్రాంక్లిను వ్యాపార మారంభము చేసిన రెండవ సంవత్సరమున, బెంజమినుకు గ్రంథపారాయణయందుండు నపరిమితాభిలాషను తల్లిదండ్రులు చూచి, చాల యాలోచనపైని, ముద్రకుని వ్యాపారమును నేర్చుకొనుటకై, జేమ్సుకు శుశ్రూష చేయునట్టులు బెంజమినును నిర్ణయించిరి. ఓడప్రయాణాభిలాష మనోగతమైనందున, నీ గురుకులవాసమునకు బెంజమినును మొదట శంకజేసెనుగాని, తుదకు సమ్మతించి, దీని పూర్వోత్తర మతఁడు తన చరిత్రలో వ్రాసికొనెను.

“నేను సం॥ 12-రముల ప్రాయము వాఁడను. నాకు సం॥ 21-రము వచ్చువఱకు నేను శుశ్రూష చేసి, యాఖరుసంవత్సరమున కూలివాని వేతనములను బుచ్చుకొనవలయునఁట. కొద్ది కాలములోఁ బనిని బాగుగ నేర్చుకొని, నాయన్నకెంతో సహకారిగ నున్నాను” అని స్వీయచరిత్రలో బెంజమిను వ్రాసెను.

ఇతను శుశ్రూషచేయు కాలములో, నిప్పటివలె, బోస్టను పట్టణము పుస్తకములకు, విద్యకు స్థానమని ప్రసిద్ధికెక్కినది. బెంజమిను పుట్టుటకిరువదిసంవత్సరములు పూర్వము, పుస్తకములమ్మువారయిదుగురు మాత్ర మీపట్టణమునందుండిరి. ఈనాఁటికి పదిమంది పోగయిరి. కావలసిన పుస్తకముల నింగ్లాండునుండి తెప్పించి, నిలవచేయుటయేకాక, మతోపన్యాసములు, వివాద గ్రంథములు, పంచాంగములు, నారుపాటలు, (Ballads) చిన్నపుస్తకములు మొదలగువానిని ముద్రింపించి ప్రచురించుచుండిరి. వీరికి దైవిక గ్రంథములే మూలాధారమయినవి. అయినను మాతృదేశమందు బుధులు పఠనచేసెడు ముద్రిత నూతన గ్రంథములన్నియు, నూతనసీమలకుఁ (Colonies) దేఁబడి, యక్కడి పట్టణములందలి సాహిత్య విద్యానైపుణులచే ధారాళముగఁ జదువఁబడుచుండెను.

పుస్తకములు గొనుట కశక్తుఁడైనందున, పుస్తకములమ్మువారివద్ద పనిచేయువాని సహవాసమూలముగ వానిని



సంపాదించి బెంజమిను చదువుచుండెను. యజమానుఁడు పుస్తకము లేకపోవుట వలనఁ గోపగించు నేమోయను భయముగలిగి, సాయంత్ర మరువుగఁ దెచ్చిన పుస్తకమును మరుచటి యుదయమున నిచ్చివేయవలసిన ధర్మము గనుక, రాత్రి చాలభాగము మేలుకొని దాని నతఁడు చదువుచుండెను. “కొంతకాలము గడచిన పిదప, వివేకియు, సూక్ష్మబుద్ధిగల యొక ‘మాత్యూ ఆదామ్సు’ పేరుగల వర్తకుఁడొకఁడు పుస్తక భాండాగారముగలవాఁడై, మా ముద్రాక్షరశాలకు తఱచుగ రాకపోకలు కలిగి, నన్ను తన భాండాగారమును జూచుటకు రమ్మనుమని వేఁడి, చదువుటకు నేను గోరిన పుస్తకములను బదులిచ్చుటకు సంతసించెను” అని ఫ్రాంక్లిను వ్రాసెను.

నవీన సుహృదులు తన కప్పుడప్పుడిచ్చుచున్న కావ్యములు చదువుటచే తన పినతండ్రి బెంజమినునుబోలె, యతఁడుకూడ కవనముఁ జెప్పుట యందభిరుచికలవాఁడై, యంత్యానియమముతోఁ గూడిన చరణములనేకములుగఁ జెప్పెను. ఈ రచనాశక్తిని సార్థకముగ వినియోగింపవలెనని, నితనియన్న, జేమ్సునకాలోచన పుట్టెను. ఆ కాలమునందు వీథులలో నారుపాటలు పాడుట వాడుకయై యుండెను. సముద్రపుదొంగల సాహస కృత్యములు, నరఘాతకుల నురిదీయు కథలు, దారికొట్టుదొం

గల పరాక్రమములు, భయావహమైన యోడల విధ్వంసనములు, ఘోరమైన పాపములు, తదితర తత్కాల సంప్రాప్తానుభవాధిక్య విషయములు, నివి యన్నియు శోకరసాశ్లిష్ట ఛందోనిబద్ధకావ్యస్వరూపాలంకృతంబులై, గ్రామపురసీమలయందమ్మఁబడుచు వచ్చినవి. అన్నగారి ప్రోత్సాహమున, బెంజమిను సర్వజన సమ్మోదసఫలైకరచనాయత్త చిత్తుండయ్యెను.

తన కవనము రసవిహీనమైనదని బెంజమి నొప్పుకొనెను. ఇతనియన్న లక్షణ విరుద్ధము లయిన కావ్యములను ముద్రింపించి, చెల్లుబడికై పై గ్రామములకు బంపుచువచ్చెను. అయినను, కుమారుని సద్బుద్ధినిరక్షింపవలయునని, అతని రచనాలోపములను జూపించి, యిట్టి లక్షణ విరుద్ధకవులు దరిద్రులగుదు రని చెప్పి, యీ కవనరచనయం దెన్నటికిని యాధిక్యతను బొందుట కష్టమని బెంజమినుకుఁ జూపించి, దాని నతఁడు విడుచునటుల తండ్రిచేసెను. తండ్రిగారి విమర్శనల మూలముగ, బెంజమిను శృంగార రచన గద్యశైలిని వ్రాయుట కుద్యుక్తుఁడాయెను.

వాదప్రియుఁడు, మాటకారియు, గ్రంథపఠనలోలుఁడైన 'జానుకాలిన్సు' అను నతఁడీతని కీ సమయమున సహకారియైయుండెను. పితృసంబంధ వివాద వైదిక గ్రంథపఠన మూలమున, ఫ్రాంక్లిను కూడ వివాదోద్ధత చిత్తుఁడైనను, తుదకీ



దుర్గుణాతీతుఁ డయ్యెను. శాస్త్రాభ్యాసము స్త్రీల కెంతవఱకు సార్థకమో యనెడి వాదము స్నేహితు లిరువురికి జరిగెను. శాస్త్రజ్ఞానము స్త్రీలకు గలుగదని కాలిన్సు, గలుగునని ఫ్రాంక్లిను, వాదించిరి. మంచివాగ్ధోరణి లేనివాఁడుగాన, వాదములో స్నేహితుఁడు చెప్పిన హేతువులకంటె, నతని వాక్ప్రవాహమే తనను నోరు మూసికొనునటుల చేయుచున్నదని బెంజమి నభిప్రాయపడెను. ఇదమిద్ధమని నిర్ణయింపకయే, స్నేహితులకు వియోగము కలిగెను. కొంతకాలమువఱకు వీరు కలిసికొనుటకు వీలులేకపోయినందున, తన వాదములయొక్క సారాంశములను వ్రాసి బెంజమిను కాలిన్సుకు పంప, నతను వానినిఁ జదివి బ్రత్యుత్తర మిచ్చెను. ఈ యుత్తర ప్రత్యుత్తరము లొకనాఁడు తండ్రిచూచి, వాదాంశము నెత్తక, ప్రతివాదియొక్క నిర్దుష్టశైలిని స్తుతించెను. వర్ణక్రమమందు, వాక్యవిరామస్థాన నిబంధనయందు, బెంజమిను నిర్దోషియని చెప్పి, స్పష్టత, సొంపు—యీ రెండును ప్రతివాది శైలిలోఁ గనఁబడుచున్నవని నిదర్శన వాక్యములను తండ్రి సూపించెను. తండ్రి చేసిన యాక్షేపణ న్యాయమనితోఁచి, నాఁడు మొదలు బెంజమిను తనశైలిని జక్కఁబెట్టుట కుద్యుక్తుఁడాయెను.

నానావిధ గ్రంథపఠనమునకు, శుశ్రూషచేయుచున్న బెంజమినుకు కాలమెట్టుల సమకూరెను? సాయంసమయముల విరామ

ముండె కాఁబోలును. ఇది లేకపోయిన, దీపములు పెట్టిన తరువాత విశ్రాంతికాలముండెను. ఇతను మాంసభక్షణమాని, శాకభక్షకుఁడై, తనకు వంటచేయువారి కెంతయుఁ గష్టముఁ గలుగఁ జేయుచు వచ్చెను. భోజనమునకై యిచ్చుచున్న ద్రవ్యములో సగమే సరిపోవునని బెంజమిను చెప్పినందున, అన్నగారెంతయు సంతసించి సగమే యిచ్చుచు వచ్చిరి. అతను (బెంజమిను) శాకభక్షకుఁడైనందున, నీ సగము సొమ్ములో సగము భోజన పదార్థములకు వినియోగించి, మిగిలిన సొమ్ముతో పుస్తకములను కొనుచు, ముద్రాక్షరశాలయందు భోజనము చేసి, విరామకాలములో వానిని జదువుచు వచ్చెను. ప్రాతఃకాలమున వేగముగ లేచి, పనియారంభమునకు ముందొక గంటవఱ కతఁడు చదువుచుండెడివాఁడు.

---

## మూఁడవ ప్రకరణము.



### వార్తాపత్రిక - పరారి.

ఇట్లు, గ్రంథావలోకన కుతూహలాయత్త చిత్తుఁడై, కాలమును బెంజమిను గడుపుచుండ, నాస్తికాభిప్రాయములు కొన్ని యబుద్ధిపూర్వకముగ నితని నాక్రమించెను. ఇవి మనస్సును వ్యాకుల పెట్టినందున, మిక్కిలి దుఃఖాక్రాంతుఁడై, కాలక్రమమున యుక్తాయుక్తవిచక్షణ సంపన్నుఁడై, వీనిని వదలి పెట్టెను. ఇట్లు మనస్సును శుద్ధిచేసి మతమున కెట్టియుపద్రవము రాకుండ, కల్లోలావృతమైన యౌవనకాలమును దాఁటించినందున కితఁడెంతయు కృతజ్ఞత కలవాఁడై, వృద్ధాప్యమునుగూడ పరమేశ్వరుని ధ్యానించుచుండెను.

జేమ్సు ఫ్రాంక్లిను వ్యాపారము నానాఁట వృద్ధిపొందసాఁగి, సోదరు లిరువురికి యుత్తరోత్తర మైహిక సుఖములను సంఘటించుకాలము సమకూరెను. బోస్టను పట్టణమందలి 'తపాలా ఫీసు' యజమాని యొక వార్తాపత్రికను బ్రచురింపించి ప్రకటన చేయుచుండెను. అచ్చట వ్యవహారరీతి చే మనస్పర్థలు కలిగినందున, నతనిని యా యుద్యోగమునుండి తొలఁగించి, కొందఱు ప్రముఖులు తమ శ్రేయస్సును బురస్కరించుకొని, మొదటి

పత్రికకు ప్రతిగా, మఱియొక పత్రికను తమ వ్యవహారానుకూల
ముగ ముద్రింపించి ప్రచురించుటకు పూనుకొనిరి. తపాలాఫీసు
యజమానత్వమునకు క్రొత్తగ వచ్చినవానిని వీరు ప్రోత్సాహ
పఱచుటకు నిశ్చయించుకొనిరి. ఇదియంతయు బెంజమిను
పనిలోఁ బ్రవేశించిన రెండవసంవత్సరమున జరిగెను. ఈ వార్తా
పత్రికకు తనను సంపాదకునిగ నియోగించెద రని నితనియన్న
యువ్విళ్లూరుచుండి తుదకు విఫలమనోరథుడై "బోస్టను గెజెటు"
అను పేరుతో, నూతనముగ వార్తాపత్రికను సిద్ధపఱచుటకై
చాలధనమును వ్యయపఱచెనుకాని, అచ్చట తుదకు స్వల్ప
కలహములు తటస్థింప దానినిగూడ విడువవలసిన వాఁడాయెను.
తక్కుఁగలవారు ఈ పత్రికను మఱియొకనిచే నడిపింపసాగిరి.
వారటులుచేయుట ద్రోహమనియెంచి, జేమ్సు తన స్నేహితులు
యెంత చెప్పినను వినక, కార్పణ్య బుద్ధి వహించి, యొక పత్రికా
ప్రచారమునకే యెడములేని సందర్భమున మూఁడవ పత్రికను
బ్రచురించుట కుద్యుక్తుఁడై, సం॥ 1721-రము ఆగస్టు తే 17-ది
సోమవారమున, "న్యూయింగ్లాండు కోరాంటు" అను వార్తాపత్రిక
యొక్క ప్రథమసంచికను స్వాంతముగ ప్రచురముఁ జేసెను.

నూతన సీమలలోఁ బ్రచురింపఁబడు పత్రికలయందుఁ
బ్రముఖమై, లోకోపకార బుద్ధిగలిగి, సాహసముతోను సరస
ముగాను చదువరులకు ప్రకరణములను ప్రదర్శించుచున్నందున,



'కోరాంటు' పత్రికను నలుగురు శ్లాఘించుచుండిరి. కడమ పత్రిక
లేకరీతిని నుండుటచే విరసములై యంతగ శ్లాఘనీయములై
యుండలేదు. "కోరాంటు" పత్రిక లోకవార్తలను, వ్యాసము
లను, కట్టుకథలను, ప్రకటించుచు తాత్కాలిక వ్యవహార
ములను నిష్పక్షపాతముగ విమర్శించుచుండెను. ఇట్లు ధైర్య
స్థైర్యములతోఁ గూడిన దగుట, నిది పురవాసులకు అనుకూల
ప్రతికూల విషయములను చర్చింపునెడ వారికి క్రమముగ
హర్షరోషములను బుట్టించుచుండెను.

ఇక్కాలమంతయు మన బెంజమిను యక్షరములకూర్చుచు,
వివాదాభిలాషియైనను, యే విధమైన వివాదములలోను దిగక,
తన పనిని చూచుకొనుచుండెను. సోదరభావ మంతఃకరణ
పూర్వకము కానిదిగా, సోదరుఁడితనిని కూలివానిగఁ జూచుచు,
మనస్సులు కలియనందున, మాటలను వ్యయపఱచుచు, నొక్కొ
క్కప్పు డితనిని గొట్టుచువచ్చెను. మఱి కొన్నిసమయములయం
దన్నదమ్ముల వివాదములను దండ్రి బరిష్కరించి బెంజమిను
పక్షమున తీర్పు చెప్పుచుండును. ఈ దుర్భావము కలవాఁడై,
తమ్ముని యభిలాషలను చదువును గుర్తెఱుంగలేనందున, సం॥
16-రముల యీడు రాక పూర్వమే, బెంజమిను యించుమించుగ
శైలిలోను ధోరణిలోను అడిసనును బోలి వ్యాసములను
వ్రాయుశక్తిగలవాఁడను సంగతి యన్న తెలిసికొనఁజాలఁడయ్యె.

పత్రికలో నొక ప్రకరణమును వ్రాయనిశ్చయించి, బెంజమిను రహస్యముగ వ్రాసి, శాలాధికారి కార్య స్థానమున బడవేసెను. ప్రభాతానంతరమున సమావేశమైన పత్రికాలేఖకు లందఱు క్రమముగ తనవ్యాసమునుచూచి విమర్శించి సంతసించినందున, నతఁడును మిక్కిలి యుప్పొంగి కన్నుల నానందబాష్పములను విడిచెను. తదనంతరమది వార్తా పత్రికయందు ముద్రిత మయ్యెను.

రానురాను, 'కోరాన్టు' వార్తాపత్రిక మహాతుంటరియై, పాపాత్ముల కానందసంధాయియై, ధర్మాత్ముల కాగ్రహజనితమై, విచ్చలవిడిగ బోస్టను పట్టణాధికారుల చర్యలు, చట్టములు, సిదాంతములు, పరువును సహితము పరిహసించినందున, నధికారులు కాలమునకు నిరీక్షించి 12 మాసము లూరకుండిరి. తుదకు వారి శాంతమును పోఁగొట్టునంతటి వ్యాసమొకటి ముద్రితమైనందున, వారు దానినిజూచి పత్రికాధిపతియైన జేమ్సు ఫ్రాంక్లినును విచారణకుఁదెచ్చి, విమర్శనానంతరమున నతనిని కారాగ్రహవాసిగఁ జేసిరి. కారాగృహమునం దొకవారము వాసముచేసి, తన మూర్ఖత్వము, కుభావము నొప్పుకొని, వినయవిధేయ పూర్వకముగ నపచార క్షమాపణ పత్రికను వ్రాసి, దొరతనమువారికిఁ బంపుకొనెను. వారు కటాక్షించి, విడుదలకాజ్ఞనొసఁగ, కారాగృహ విమోచనమై, ఇతను బయ



టికి వచ్చునప్పటికి నెలదినములాయెను. మఱికొన్ని యంతః కలహములచేఁ బత్రిక తుద కంతరించెను.

తదనంతర మన్నదమ్ముల కలహమధికమైనందున, బెంజమి నన్ననుండి విడిపోయి, సమీపముననున్న 'న్యూయార్కు' పట్టణమునకుఁ బోవుటకు ప్రయత్నించెను. తన పూర్వపు స్నేహితుఁడు "జానుకాలిన్సు" తాను పడవమీఁద బోవుటకుఁ దగిన యేర్పాటుచేసినందున, బెంజమిను కొన్ని పుస్తకముల నమ్మి, యాసొమ్ముతోఁ బడవచీటిని గొని ప్రయాణమైపోయెను.

ఈ ప్రయాణములో నొక వింత జఱిగెను. పడవ గడపు వారందఱు 'కాడు' చేపలను బట్టుకొని, వానిని మూఁకుడులో వేసి వేయింపసాగిరి. శాకభక్షకుఁడైన బెంజమినుకు వాని వాసన సోఁకెను. అంత నతఁడు మతిచెడి, దీక్షకు వ్యతిరిక్తముగ, వానిని తినుటకుద్యుక్తుఁడయ్యెను.

ప్రయాణము చేయునాఁటికి, బెంజమిను సం॥ 18-రముల వయస్సుగలవాఁడు. మూఁడురోజులు ప్రయాణముచేసిన పిదప, న్యూయార్కు పట్టణమున కతఁడు వచ్చెను; పట్టణమం దెవరి నెఱుఁగఁడు; చేతిలో డబ్బులేదు; ఎవరినిఁ జూచుటకును తనవద్ద యోగ్యతా పత్రికలు లేవు.

7, 8 వేల జనసంఖ్య గల న్యూయార్కు పట్టణములోఁ జూచునది వినునది యంతయును 'హోలాండు' మయమై

యుండెను. అందుచే నక్కడి ముద్రాక్షరశాలలం దాంగ్లేయుల కంతగఁ బనిలేదు. సం॥ 1723-రమున నీపట్టణమునకు బెంజమిను వచ్చునరి కక్కడ పుస్తకాలయ మనునదియే లేదు. పేరుకు మాత్ర మొక ముద్రాక్షరశాల కలదు. ఇతను శాలాధ్యక్షుని జూచుటకు వెళ్లి, తన పూర్వోత్తరములను జెప్పుకొని, తన నేపనిలోనైన నియోగింపమని వేడెను. సమయమున కే పనియు లేదని శాలాధికారి చెప్పి, ఫిలడల్ఫియాలో నొక ముద్రాక్షరశాలాధికారిగ నున్న తన కుమారుని కొక పనివాఁ డత్యావశ్యకముగఁ గావలసి యుండునని చెప్పి, బెంజమినును బంపివేసెను. ఇప్పటికి, సముద్రపు ప్రయాణమునందలి యుత్సాహము తీరినందున, నింటికి తిరుగు ముఖమగుటయో లేక పని నిమిత్త మన్యపట్టణమునకు బోవుటయో యను మీమాంసలో నతఁడు బై గ్రామమునకుఁ బోవుటయే యుక్తమని యెంచి, తన వస్తువులను తూపించిపడవలోవేసి తానొక పడవనెక్కి బయలుదేరెను.

ఈ పడవ శిథిలమై చిటిగిపోయిన తెరచాపతో, యొక కళాసుచేగడపఁబడుచుండెను. తప్ప త్రాగి మైమఱచిన హాలాండువాఁ డొకఁడు బెంజమినుతో వచ్చుచుఁ బడవలోనుండి నీటిలోఁ బడగా, వాని జుట్టు పట్టుకొని పైకి లాగి బెంజమిను వానిని బడవలో వేసెను. ఇటులు గొంతదూరముపోయి, 'లాంగ్ ఐలెండు" దీవి యొద్దున ప్రబలముగ గాలి వీచుచు, కెరటములు భయంకరముగ గొట్టుకొనుచున్నందున, పడవ గుద్దుకొనునను భయము కలిగి, దానిని జాగ్రతతో గడపి, యీ రొడ్డున వచ్చి చేరిరి. సముద్రపు టొడ్డునకు కొందఱు మనుజులు వచ్చుట వీరు చూచి, గట్టిగ కేకలువేసి వారిని వీరు పిలిచినను, కెరటముల ధ్వనిచే, వారు వినలేదు. 'రం' సారాబుడ్డి తప్ప, పడవలో తినుబడి పదార్థములేవియు లేనందున, యీ రాకలికొనినవారైనను, గాలి తగ్గువఱకొడ్డున గూర్చుండవలసి వచ్చెను. పడవలో నిదురపోవలెనని వీరు ప్రయత్నించిరిగాని, గాలి హోరున వీచుచు, కెరటముల తుంపరలు మీఁద పడుటవలన, రాత్రి యంతయు నిదుర లేక శ్రమతో గడిపిరి. మఱునటి దిన ముదయమున నే గాలి తగ్గినందున, పడవను దీసి గడపుట కారంభించి, యపరాహ్ణము తిరిగిన పిదప, 'అంబాయి' యను పట్టణమును జేరిరి. ముప్పది గంటల కాలము నిద్రాహారములు లేక గాలి దెబ్బలు తిన్నందున, బెంజమిను దేహమంతయు బడలి సలసల లాడెను. ఉష్ణము వచ్చుటకు పూర్వము శీతలోదకమును విస్తారము బుచ్చుకొనిన తగ్గునని చదివిన సంగతి బెంజమిను జ్ఞప్తికిఁ దెచ్చుకొని, చల్లని నీరు సంతుష్టిగ త్రాగి, విశ్రమించి, నిదురపోయి, మఱుచటి దినముదయమున నుష్ణపుచిహ్నములు స్వస్థతతో లేచెను.

డెలవేరు నదీతీరముననున్న 'బర్లింగుటను' పట్టణము అంబాయి పట్టణమునుండి, యేబది మైళ్లదూరము. ఈ పట్టణమునకు వెళ్లుట కుద్యుక్తుండై, మరుచటి దిన ముదయ ప్రభృతి ఝోణి పాతముగ వర్షించుచున్నను, బయలుదేరి, దినమంతయు నడిచి, సాయంత్రమునకు దారిలోనుండిన పూటకూలియింటిలో బసచేసెను; ఇన్నిదినముల కితని మనోధైర్యము చెడి, స్వగృహ మెందుకు విడిచితినని బెంజమిను విచారించెను. పరారియై వచ్చిన తననెవరైన నిరోధింతు రనుభయము కలిగి, వ్యాకులచిత్తుండయ్యెను. తానుధరించిన వస్త్రములు వర్షములోఁ దడిసి నలిగిపోయినందున, బెంజమిను కర్తవ్యాంశము తోఁపకయుండెను. వికసితముఖారవిందము, శరీరసౌష్ఠవము గలిగి, భవిష్యదుద్యోగార్హుండైనను, ప్రస్తుతము దురవస్థలోఁ జిక్కెను.

మఱునటి దినము బయలుదేరి పోయిపోయి, సాయంత్రమునకు బర్లింగుటనుకు పదిమైళ్ల దూరములో బసచేసి, రెండవ దినము శనివార ముదయమున పట్టణము జేరెను. ఫిలడల్ఫియాకు పదునేడుమైళ్లు మీఁదుగ, బర్లింగుట నున్నది. నదీతీరమునకుం బోవలెనని వీధుల వెంబడి బెంజమిను వెళ్లెను. ఏ ముదుసలిదానివద్ద తినుటకు రొట్టెను కొనెనో, నామె, జీర్ణవస్త్రధారియైన బెంజమిను మహాత్ముకలవాఁడని, యెంచెను. నదీతీరమునకుం బోయి, ప్రతిశనివారమును ఫిలడల్ఫియాకు వెళ్లు



పడవ బయలుదేరి పోవుటవిని, బెంజమిను ఖిన్నుండై, ఏమియుఁ దోఁచక, తిరిగి యాముదుసలిదానివద్దకువచ్చి, జరిగిన సంగతి నామెతోఁ జెప్పెను; అతఁడుండు మంగళవారము వఱకు తన గృహమున బసచేయుమని యామె కోరినందున, మార్గాయాసముచే బడలిన బెంజమి నందుకు సమ్మతించెను.

ఒకనాఁడు సాయంకాలమందు, నదీతీరమున విహరించుచుండ, దైవికముగ, రాదారి మనుజుల నెక్కించుకొని ఫిలడల్ఫియాకు బోవు పడవను బెంజమిను చూచెను. ఇతనిని తీసికొని వెళ్లుటకు పడవవా రంగీకరించినందున, పడవలోనికి బెంజమిను వెళ్లెను. గాలిలేనందున, వీరు పడవను నడుపవలసి వచ్చెను. ఆదివార ముదయమున, 8, 9 గంటలకు "ఫిలడల్ఫియాకు" పడవచేరెను. ఇతని వద్ద కొన్ని రాగిడబ్బులు, మూఁడురూప్యములు' మాత్ర ముండెను. ఇతనుకూడ పడవను గడపినందున, నితని వద్ద రుసుము పుచ్చుకొనుటకు కళాసు లిష్టపడకపోయిరి. అయినను, వారిని నిర్బంధముచేసి, తన రాగిడబ్బు లన్నియు బెంజమిను వారి కిచ్చివేసెను. "ధనము కలిగియున్న సమయములలోఁగాక, ధనములేని సమయములలోనే, మనుజుఁడు తన యౌదార్యమును జూపించును. తనవద్ద కొంచెము ధనమున్నదని నితరులకు తెలియకుండుటకు కాఁబోలు వాఁడిటులు చేయును" అని బెంజమిను వ్రాసెను.

క్షుద్బాధాయుతుఁడై కడుడస్సి, నిదురలేక నీరసించి, రేవులో బెంజమిను దిగెను. పట్టణమునకుఁ బోవుచు, రొట్టెను బట్టుకొని వచ్చు బాలు నొకనిని దారిలోఁ జూచి, వానివలన రొట్టె లమ్మఁబడు స్థలమును గనుగొని, వెంటనే నక్కడకుఁ బోయి మూఁడు రొట్టెలను గొని, వానిని తన జేబులలోఁ బెట్టుకొనుటకు వీలు లేక, రెండు పొట్లములు గట్టి చంక క్రిందనుంచుకొని, మిగిలిన దానిని తినుచు, మార్కెటు వీధిని బోవుచుండెను. ఇట్లు పోవుచు, రీడు దొరగారి యింటిమీఁదుగ నతఁడు నడచుట తటస్థించెను. అప్పుడు ద్వారమువద్ద నిలుచుండిన 'కన్యక రీడు' బెంజమిను వైఖరిని జూచి, యాశ్చర్యమొందెను. ఈమెకు సం॥ 18-రముల వయస్సు. ఈమె ముందుకు గృహిణి ఫ్రాంక్లిను కాఁగలదు. కాని ఈమె చూపులను బెంజమిను గమనింపక 7000 వేల ప్రజాసంఖ్య కలిగి, ఉత్తమక్షేత్రగృహారామములతో వెలయుచున్న ఆ పట్టణమును విలోకించుచు బోయెను. వీధులన్నియుఁ దిరిగి తిరిగి, రేవునకు వచ్చి, బెంజమిను తన దారిని నిరీక్షించుచున్న ముదుసలికి, దాని కుమారునకు, శేషించిన రెండు రొట్టెల నిచ్చివేసెను.

అక్కడినుండి తిరిగి వచ్చునపుడు, మార్కెటు వీధిని బెంజమిను రాఁగా, దారిలో మతపరిషత్తునకుఁ బోవు వారిని గలిసి, వారితోఁ బోయి, సభలోఁ గూర్చుండి, నిశ్శబ్దముగ నుండు



టచే నిదురపోయెను. సభ ముగిసినతరువాత నొకఁ డతనిని లేపినందున, నతనితో బెంజమిను గలిసిపోయి, యతఁడు చూపించిన పూటకూలియింటిలో బసచేసెను. పనిపాటలు లేక పదునొకండు దినములు బెంజమిను వ్యయముఁ జేసెను.



---

## నాల్గవ ప్రకరణము.



### లండనుకు ప్రయాణము.

ఉదయమున లేచి, వస్త్రములను ధరించి, యోగ్యతా పత్రికను బట్టుకొని, ముద్రాక్షర శాలాధికారియైన, 'బ్రాడుఫర్డు'ను జూచుటకు బెంజమిను వెళ్లెను. అతఁ డితనిని మర్యాదచేసి, మాటలాడి, భోజనము చేయు మని నిరోధించెను. తదనంతర మతఁడు, తనశాలలోఁ బనిఁజేయువాఁ డప్పటి కనావశ్యకమని జెప్పి, 'కీమరు' అను నతఁడు నూతనముగ ముద్రాక్షరశాలను స్థాపించినందున, నతనికిఁ బనివాండ్రు గావలసియుండు నని నుడివి, యతఁడు గూడ జరుగురులేదనిన పక్షమున, తాను బెంజమినుకు బసయిచ్చి, చిన్నచిన్న పనులలో నప్పుడప్పుడు నియోగించుట కిష్టపడెను.

కాలాతీతము కానీయక, వెంటనే కీమరును జూచుటకు బెంజమిను వెళ్లెను. ప్రాఁతగిలి శిథిలమైన అచ్చుయంత్రమువద్ద, నరిగిపోయిన యక్షరపూసలతోఁ బనిని జేయుచున్న 'కీమరు'ను కచ్చేరిగదిలో బెంజమిను దర్శించెను. వచ్చిన వానినిజూచి, కీమరు కొన్ని ప్రశ్నలువేసి, బెంజమినుయొక్క పనినేర్పును పరిశోధించి, తనకు జరుగురులేదని చెప్పి, యతనిని బంపివేసెను.



బెంజమిను చాలదినములవఱకు బ్రాడుఫర్డు గృహములో బస చేసి, కొంచెము కొంచెము పనిఁజేయుచు వచ్చెను. తుదకు బెంజమినుకు కీమరు కబురుపంపి పిలిపించి, పనిలో నియోగించెను. నూతనముగ ముద్రించుట కుపయుక్తము లగు సామగ్రులను దెప్పించినందున, చిన్న పుస్తకములను ముద్రింపించి, కీమరు వానిని బ్రచురించుచుండెను. తనకు ప్రతికక్షులోఁ జేరిన 'బ్రాడుఫర్డు' గృహములో బెంజమిను బసచేయుటకు సమ్మతింపక, కీమ రితనిని రీడుధొరగారింటికి తీసికొనిపోయి, యక్కడ బసయేర్పాటు చేసెను. ఆ నాఁ డాదివారమున నితను రొట్టెను దినుచు వీధివెంబడిని బోవుచుండ, గుమ్మములో నిలబడి, బెంజమినుయొక్క వికారవైఖరినిజూచి యాశ్చర్యమును బొందిన 'కన్యకరీడు' యొక్క తండ్రియే యీరీడు ధొరగారు.

దినదిన ప్రవర్ధమానముగ, మంచి వేతనములను బెంజమిను సంపాదించుచు, తగుపాటి స్నేహితులతో సాయంసమయముల గ్రీడించుచు, తనయన్నగారి నిరంకుశాధికారముచే బోస్టను పట్టణమం దసహ్యాము కలవాఁడై, తన పూర్వపు స్నేహితుఁడు, జానుకాలిన్సుతోఁ దప్ప, తదితరులతో నుత్తరప్రత్యుత్తరములు లేక యుండెను.

కొంతకాలమునకు స్వగృహమునుండి క్షేమవార్త వచ్చెను. బెంజమిను చెల్లెలు[illegible] బోస్టను డెలవేరు పట్టణముల మధ్యస్థముగ

తిరుగు సామాను పడవనాయకుఁడైన, 'రాబర్టు హోమ్సు'ను వివాహ మాడినటులు దెలిసెను. ఫిలడల్ఫియాకు 40 మైళ్లు క్రిందుగనుండు పట్టణములోఁ గాపురము జేయుటచే, పరారియైన బావమఱఁది ఫిలడల్ఫియాలోనున్న సంగతి దెలిసి, బెంజమినుకు హోమ్సు జాబువ్రాసెను. అందులో తలిదండ్రు లితని విషయమై దుఃఖాక్రాంతులై యుండిరనియు, నితనిని వారి యొద్దకు వెళ్లుమనియు, వెళ్లి వారిని సంతోషపఱచుట ఇతనికి శ్రేయోదాయకమనియు వ్రాయఁబడియుండెను. బోస్టను పట్టణమును విడుచుటకుఁ గారణము విరివిగ వ్రాసి, తాను ఫిలడల్ఫియాలోనుండుటకు నిశ్చయించినట్లు, బెంజమిను తన బావమఱఁదికిఁ దెలియజేసెను.

ఈ యుత్తరము బెంజమినుకు లాభకరమాయెను. దీనిని హోమ్సు చదువుచున్న సమయమున, 'పెన్సిలువానియా' పరగణాగవర్నరు 'సర్ విల్లియంకీతు,' తన వద్దనుండినందున, బావమఱఁది వ్రాసిన నిర్దుష్టశైలిగల లేఖను గవర్నరుకుఁ జూపించెను. వీరిరువురా లేఖను జూచి సంతోషించి, యామాదిరి నితరులు వ్రాయలేరనియు, 'బ్రాడుఫరు' డజ్ఞానావృతుఁడనియు, కీమరు మూఢుఁడు దొంగయనియు, తమలోఁ దాము బలుకుకొనిరి. బెంజమినును ప్రోత్సాహముఁ జేయవలెనని యెంచి, ఫిలడల్ఫియాలో నతనిచే స్వంతముగ ముద్రాక్షరశాలను స్థాపింపఁజేయు



టకుఁ దగిన సన్నాహముఁ జేయ వారిరువురు యత్నించిరి. ఇందుచే, హోమ్సు బావమఱఁదికి వెంటనే ప్రత్యుత్తరము వ్రాయలేకపోయెను. కొన్ని మాసములు గడిచినపిదప, బావమఱఁదు లిరువురు గలిసికొనిరి.

ఒకరోజున, బెంజమిను యజమానితోఁ గలిసి శాలలోఁ బనిచేయుచున్న సమయమున, నిద్దరు పెద్దమనుష్యులు అచ్చాఫీసులోనికి రాఁగా, వచ్చిన వారిలో నొకఁడు గవర్నరుకీతు, రెండవవాఁడు 'కర్నలుఫ్రెంచి' గా, వీరిరువురిని తెలిసికొని, తన నిమిత్తము వచ్చినవారని గ్రహించుకొని, మేడదిగివచ్చి, వారిని కీమరు మర్యాదచేసెను. కొంతవఱకు కూర్చొని, గవర్నరు ఎవరు ఫ్రాంక్లినో కీమరువలన తెలిసికొని, బెంజమినుతో మర్యాదగ మాటలాడి, యతనిని స్తోత్రముచేసెను. అంత కాలమువఱకు తనను బెంజమిను చూడనందుకు నిష్ఠురమాడి, యొక విరామస్థలమున కతనిని రమ్మనుమని చెప్పి, కర్నలు ఫ్రెంచితో గవర్నరు లేచి వెళ్లెను. ఫ్రాంక్లిను, కీమరు, లుభయు లాశ్చర్యమగ్నులయిరి. కోరిన ప్రకారము వారిని దర్శించుటకు బెంజమిను వెళ్లెను. వారితనితో కొంతవఱకు మాటలాడి, తుదకితని నేవ్యాపారమునందు నియోగించుట యని యోచించిరి. తండ్రి సహాయముచే బెంజమిను స్వంతముగ నొక ముద్రాక్షరశాలను స్థాపించుట; గవర్నరందులకుఁ

దగిన సహాయముఁ జేయుట; గవర్నరు వ్రాసియిచ్చిన శిఫారసు ఉత్తరమును బట్టుకొని తండ్రియొద్దకు బెంజమిను వెళ్లుటయు మొదలగు సంగతులను వీరుమాటలాడిరి. ఈ సంగతులను రెండవవానికి తెలియనీయక, యథాప్రకారము కీమరు యొద్దనే బెంజమిను పనిఁజేయుచు, సాధ్యమయినంత వేగముగ బోస్టనుపట్టణమునకు వెళ్లవలసినదని వీరు నిర్ణయించిరి. అప్పుడప్పుడు గవర్నరు తన గృహమునకు బెంజమినును భోజనమునకు బిలుచుచుండెను.

సం॥ 1724-రము యేప్రిల్ నెలాఖరున నొక పడవవచ్చినందున, బెంజమిను దానిమీఁద బయలుదేరి వెళ్లెను. తలిదండ్రులను జూచివచ్చెద నని నలుగురితోఁ జెప్పెను. రెండువారములు తుపానులో ప్రయాణముచేసి, బోస్టను పట్టణముచేరెను. అన్నయైన జేమ్సుకు తప్ప, మిగిలిన వారికి సంతోషము కలుగునట్టులు బెంజమిను స్వగృహముఁ జొచ్చెను.

పెన్సిలువానియా పరగణాలోని విశేషములను బెంజమినువలనవిని, ఇతని పూర్వపు స్నేహితుఁడు కాలిన్సు తపాలాఫీసులోని పనిని విడిచిపెట్టి, వెంటనే తన సామానును పడవలో వేయించి, నాటున వాఁడు బయలుదేరి వెళ్లెను.

శిఫారసుత్తరమును జదివి, యేమియుఁ జెప్పక, తండ్రియూరకుండెను. ఇంతలో, హోమ్సువచ్చి, గవర్నరునుగుఱించి



తెలిసినసంగతులను మామగారితోఁ జెప్పెను. సం॥ 18-రములు వయస్సుగలిగి, యుక్తాయుక్త విచక్షణ తెలియని బెంజమినును స్వతంత్రముగ వ్యాపారమునందు ప్రవేశపెట్టింపుమని వ్రాసినందుకు, గవర్నరంత తెలివికలవాఁడుగ కనపడఁ డని తండ్రి పలికెను. అల్లుఁడెంత దూరము బావమఱఁది విషయమై నొక్కి చెప్పినను, జోషయా ఫ్రాంక్లిను చెవి నొగ్గలేదు. కుమారుని యోగ్యతను గవర్నరు శ్లాఘించినందుకు, తండ్రి సంతసించెను. సం॥ 21-రము వఱకు ఫిలడల్ఫియాలోఁ బనిచేసి, కొంతధనమును గూడ బెట్టినపిదప, కొఱత పడినసొమ్మును దా నిచ్చుట కంగీకరించి, తదనంతరము కుమారుఁ డచ్చుయంత్రమును కొని స్వతంత్రముగ జీవింపవచ్చునని, తండ్రి సలహా యిచ్చెను. కుమారుని విషయమై గవర్నరు స్తోత్రముగ వ్రాసినందుకు మన్నించి, వానిసలహా ప్రకారము నడచుట కప్పటి కవకాశము లేదని క్షమాపణ పూర్వకముగ వానికి తండ్రి జాబువ్రాసి పంపెను.

ఈ సమయములో నొక ముచ్చట జరిగెను. ఆముచ్చటను, సం॥ 60-రముల వయస్సున బెంజమిను, కాటను మేథరుగారి కుమారునికి జాబువ్రాసి పంపెను. "సం॥ 1724-ర ప్రారంభమున, నేను మీతండ్రిగారి నాఖరుపర్యాయము సూచితిని. ఆ సమయమున నేను పెన్సిలువానియాకు మొదటిమారు వెళ్లి

వచ్చితిని. వారు నన్ను మర్యాదఁజేసిరి. వారి పుస్తక భాండాగార ముండిన గదిలో మేము గొంతవఱకు మాటలాడితిమి. నన్నంపకము పెట్టుటకు వారు నాతో వచ్చునపుడు, నేను వారితో మాటలాడుచుంటిని. మాటలసందడిని, దారిలోనున్న దూలమును నేను చూడనందున, వారు 'శిరస్సువంచు, వంచు, మని' ప్రక్కనుండి నాతోఁజెప్పిరిగాని, నాశిరస్సు దూలముఁ దాఁకి దెబ్బ తినువఱకు, నేను వారిమాటను గ్రహింపలేకపోతిని. సమయోచితముగ బుద్ధిని గఱపువారుగాన, 'నీవు బాలుఁడవు, ఈ ప్రపంచములో శిరస్సువంచుకొని, నీవు తిరిగిన, ననేకములుగ దెబ్బలు తినవ'ని నాతో వారు చెప్పిరి. ఈ సలహా నాశిరస్సున నాటినందున, నేను బాగుపడితిని. శిరస్సు లెత్తుకొని, తమకు శృంగభంగము జరిగి, విపత్తుల ననుభవించువారిని చూచినపుడు, నాజ్ఞప్తికి సలహా వచ్చుచుండె"నని బెంజమిను వ్రాసెను.

తలిదండ్రుల దీవనలుపొంది, జ్ఞాపకార్థమై వారిచ్చిన వస్తువులను బట్టుకొని, వారి సెలవుగైకొని, బెంజమిను పడవ నెక్కెను. ఆ పడవ 'న్యూపోర్టు' పట్టణమునకు వచ్చెను. అక్కడ బెంజమిను పడవదిగి, తనయన్న 'జాను'ను జూచుటకు వెళ్లెను. అన్నదమ్ములు కలిసికొని, పరస్పరాహ్లాదముతోఁ గొంతమాటలాడిరి. 6, 7-సంవత్సరములకు బూర్వము వీరిరువురు దండ్రికిఁ బనిలో సహకారులై యుండిరి. ఇట్లు, న్యూపోర్టులో గొంతకాల



ముండుటవలన, బెంజమిను ముందుకు నష్టమును బొందవలసి వచ్చెను. పెన్సిలువానియాలో, 6,7 కాసులు ఋణముక్రింద నియ్యవలసిన వానియొద్ద నాసొమ్మును బుచ్చుకొనవలసిన దని, తనయన్న స్నేహితుఁడు 'వెర్నను' అనువాఁడు బెంజమినుకుత్తరమిచ్చెను. తానుదిరిగి వ్రాయువఱకు వసూలుచేసిన సొమ్మును బెంజమినునే జాగ్రత్తచేయుమని వెర్నను చెప్పెను. ఈ పనిని జేయుటకు బెంజమి నొప్పుకొనెను.

'న్యూపోర్టు' పట్టణము వదిలి 'న్యూయార్కు'కు వచ్చునప్పటికి, బెంజమినుతోఁ గలిసి ఫిలడల్ఫియాకు బోవుట కితని స్నేహితుఁడు, కాలిన్సు, యెదురుచూచుచుండెను. గృహమునుండి వెలువడివచ్చినది మొద లతని నడవడి చెడిన దని స్నేహితునివలన వినినందు కెంతయు బెంజమిను విచారించెను. సోమరియై, కాలిన్సు త్రాగుబోతాయెను. ఇతను న్యూయార్కులోఁ జేసిన ఋణములను దీర్చుటయేగాక, ప్రయాణములో నితని కర్చులకుఁగావలసిన సొమ్మును బెంజమిను పెట్టెను. ఇందుకు, బెంజమిను ముందుకు విచారింపవలసివచ్చెను. బెంజమిను తలఁచుకొనదగినదియు, యతనికి బ్రీతికరమగునదియు నగు సంగతి యొకటి న్యూయార్కుపట్టణములో జరిగెను.

నూతన సీమలలో నుండువారికి పుస్తకాపేక్ష, యన్యోన్యానురాగము నాపాదించునని తలంపవచ్చును. ఆ కాలమునందు

పుస్తకములు విశేషము వెలగలవి; సర్వజనోపయోగముగల పుస్తకభాండాగారములు లేవు; గృహస్థులు తగుమాత్రము స్వోపయోగమునకు వానిని సంపాదించుటకలదు; మతగ్రంథములను దప్ప, తదితరగ్రంథములను పఠనఁజేయువారులేరు. బెంజమిను యొక్క చిన్నతనములో, గ్రంథపారాయణచేయువాఁడనినను, యేఁబదిసంపుటములను సంపాదించినవాఁడనినను, అట్టివానిని గౌరవముగ నితరు లెన్నుటకలదు. మొదటినుండి, పాండిత్యమును నూతన సీమలవాసు లెన్నికతోఁ జూచుచుండిరి.

సం॥ 1724-రమున 'విల్లియంబర్నెటు' అను నతఁడు న్యూయార్కుపట్టణమున గవర్నరుగనుండెను. 'పనిముందు, తరువాత నాలోచనఁ' జేయువాఁడీగవర్నరు. నూతన సీమలలోని యధికారులతోఁ జిరుకలహములాడి, గవర్నరు తనమంచిప్రాయమంతయుఁ బోఁగొట్టుకొనెను. స్థాపింపఁబడిన పుస్తకభాండాగారములలో మంచి దొకటి గవర్నరుకు గలదు. పుస్తకములనిన, వానిని జదువువారనిన, నితనికిఁ బ్రాణము. బోస్టనునుండి వచ్చుప్రయాణికులలో నొకఁడు కొన్నిసంపుటములు గలవాఁడని, నతఁడు పడవలోనుండెనని, పడవయధికారివలన గవర్నరు వినెను. అతనిని తనయొద్దకు తీసికొనిరమ్మను మని పడవయధికారితో గవర్నరు చెప్పెను. "నేను గవర్నరును జూచుటకు వెళ్లితిని. కాలిన్సు త్రాగి తెలివిలేక పడియున్నందున నాతో వానిని తీసి



కొని వెళ్లుటకు వీలులేకపోయెను. గవర్నరు నన్ను మర్యాదచేసి, తన పుస్తకము లన్నియు నాకు జూపించెను. కొంతవఱకు పుస్తకములు, గ్రంథకర్తలనుగుఱించి మేము ముచ్చటించితిమి. నన్నుగౌరవించి, నాతో మాటలాడిన వారిలో నితఁడు రెండవ గవర్నరు. ఇట్టిసన్మానము నావంటి దీనుల కెంతమనోల్లాసముగ నుండు?" నని యతఁడు వ్రాసెను.

బెంజమిను, కాలిన్సు, లిరువురు బయలుదేరి ఫిలడల్ఫియాకు పోయిరి. వెర్ననుకు రావలసిన సొమ్మును మార్గములో బెంజమిను వసూలుచేసెను. కాలిన్సు, దురావరి కర్చుదారుఁడైనందున, నతని నిమిత్తము కొంతయు తనవిషయమున కొంతయు ఈ ధనములోనుండి బెంజమిను వ్యయపఱుపవలసి వచ్చెను.

ఈ కాలమందు, డెలవేరు నదిమీఁద ప్రయాణముఁ జేయు నపుడు జరిగిన విశేషమును, మరి సం॥ 53-రములయిన పిదప, శాస్త్రజ్ఞుఁడైన 'ప్రీస్ట్లీ'తో బెంజమిను చెప్పెను. దీనిని "ప్రపంచమునందలి యన్నియవస్థలు తద్ధర్మానుసారముగ నొడుదొడుకులు గలవి. మనుజులు ప్రస్తుతావస్థసంబంధదుఃఖములనుభవించుచు తాము కోరు అవస్థలలో నెట్టి శ్రమలుండునో తెలియనేరరు" అను నీతివాక్యమును ముచ్చటించు సందర్భమున చెప్పెను.

"డెలవేరు నదిమీఁద దిగువగ వెళ్లుచున్న నొకపడవలో నేను పోవుచుంటిని. గాలిలేనందున పడవను గట్టివేయవలసి వచ్చెను. పడవమీఁద నెండనిప్పులు కురియుచుండెను. అందులోని వారి నెవరిని నేనెఱుఁగను. పడవలో నుండుటకు గష్టముగ నుండెను. ఒడ్డుననేదో పచ్చికబయలువలె నొకటి నాకుఁ గనబడెను. దాని మధ్య నొక వృక్షమును జూచితిని. పడవ నడచువఱకు, చెట్టునీడకుఁబోయి పుస్తకమును జదువుకొనవలె నని కోరి, పడవయధికారి నడిగితిని. వాఁడు సమ్మతించినందున, నే నొడ్డున చేర్పఁబడితిని. ఈ ప్రదేశము చాలభాగము చిత్తడినేల యగుటవలన, మోకాలుబంటి బురదలో దిగఁబడి, కష్టముతోఁ జెట్టుచేరితిని. ఇక్కడ నైదునిమిషముల కాలమైన వ్యయము కాకమునుపే, వందలకొలఁది దోమలువచ్చి, నా కాళ్లు, చేతులు, ముఖమును గఱచివేసినవి. అక్కడినుండి తిరిగి, యొడ్డునకువచ్చి, తెప్పమీఁద దాఁటి, పడవలోనికిఁ బోతిని. ఎండబాధ భరింపవలసివచ్చెను. ఇతరుల పరిహాసమునకుఁ బాలయితిని. సంసారములోఁ దీనింబోలిన విషయము లనేకములు నాకు దృగ్గోచరము లయినవి"

తండ్రి వ్రాసియిచ్చిన యుత్తరమును బెంజమిను గవర్నరు కీతునకు కనపఱచెను. పట్టినపట్టు విడువక, బెంజమినును పనిలోఁ బ్రవేశపెట్టుటకు గవర్న రుపగమించెను. "నీతండ్రి వివే



కముగ నడవలేదు. అతని సలహా బాగులేదు. మనుజులలోఁ జాల వ్యత్యాసముగలదు. ఈడుతో విచక్షణరాదు. యౌవన పురుషులు విచక్షణలేక యుండరు. నిన్ను పనిలోఁ బెట్టుట కతని కిష్టములేదు గనుక నేనట్లు చేసెదను. ఇంగ్లాండునుండి తెప్పింపవలసిన వస్తువులను పట్టీ వ్రాసియిమ్ము. నేను వానిని దెప్పించి నీకిచ్చెదను. నీకు డబ్బుకలిగినపుడు, ఆఋణమును దీర్పవచ్చును. ఈ గ్రామములోఁ దెలివిగల ముద్రకుఁ డొకఁడుండవలయును. అది తప్పదు. నీవాపనిని బాగుగ నెరవేర్చెదవని నా నమ్మకము" అని గవర్నరుచెప్పెను. ఈ మాటలను విశ్వసించి, యుత్సహించి, కావలసినవస్తువులను నూరుకాసులు విలువగునటులు పట్టీ వ్రాసి బెంజమిను గవర్నరు చేతికిచ్చెను. ఈ జాబితాను గవర్నరు పుచ్చుకొని, బెంజమిను స్వయముగ నింగ్లాండు వెళ్లి కావలసినవస్తువుల నెంచుకొని వానిని కొనుట మంచిదని యతనితోఁ జెప్పెను. "ఇంతియకాదు. ఒకపర్యాయము నీ వక్కడికి వెళ్లిన, నలుగురు ముద్రాక్షర శాలాధికారులతోను, పుస్తకముల దుకాణదారులతోను సహవాసముఁజేయుటకు నీ కవకాశము గలుగును" అని గవర్నరు చెప్పినమాటను బెంజమిను విని, పరమ సంతోషమును లోలోపునఁబొంది, వెంటనే సమ్మతించినందున, "నీ సమ్మతము బాగుగనున్నది. వెంటనే ప్రయాణ మగుము. ఓడకప్తాను 'ఆనిస్సు'తోఁగలిసి, వెళ్లుమని" గవర్నరు నుడి

వేను. ఈ యోడ ప్రతిరేవును దాఁకుచు సంవత్సరమున కొక
పర్యాయము, ఫిలడల్ఫియానుండి బయలుదేరి లండనుపట్టణ
మునకుఁ బోవుట వాడుకయై యున్నది.

ఓడ బయలుదేరుటకు కొన్నినెలలు కాలమున్నందున
బెంజమిను వెర్రిబాగులవాఁడైన గవర్నరుకు పనులుచేయుచు,
తమయుభయులకు జరిగిన మీమాంస యెవరికిని చెప్పక కాలము
గడుపుచుండెను. అందుచేత, నీ గవర్నరు డాంబికములు,
యప్రామాణికములు, వ్యర్థములైన మాటలను జెప్పి జనరంజ
కమును గోరువాఁడని, బెంజమినుతోఁ జెప్పుట కవకాశ మెవరి
కిని గలుగలేదు. అతని మాటలను నిండుగ విశ్వసించి, సుఖ
ముగ నాగామిచింతతో ననేక నెలలు గడిపెను. ఓడకు నిరీ
క్షించుచు, ఏ మాసముల నీ చింతతో గడిపెనో, యామా
సము లీయనకు సంతోషాస్పదము లయినవి యని బెంజమినుకుఁ
దోఁచెను. ఆశానుకూలసుహృదైశ్వర్యయౌవనోపేతుఁడై,
స్వమోహాంగీకారమోహినీలాలిత నిర్భరచేతస్కుఁడై, కాల
మును బనులలో నెమ్మదిగ నడిపి, దినములు పండుగలవలె బెంజ
మిను వెళ్లబుచ్చెను.

ఎంత నెమ్మదిగఁ గాలమును వెళ్లబుచ్చుట కభిలషించినను,
మధ్యమధ్య గొన్ని యవాంతరములు వచ్చుచుండును. జాను
కాలిన్సు, సోమరియై, పనిపాటలు చేయక, బెంజమినుబసలోఁ



జేరి, వాని డబ్బును బుచ్చుకొనుచు, పనిలోఁ బ్రవేశించి ఋణ
మును దీర్చెద నని చెప్పుచు, శరీరముపైని స్మారకము పోవు
నటులు దప్పత్రాగుచుండెను. ఒకనాఁడు, వీరిరువురును, మరి
కొందఱును గలిసి విహారార్థము పడవనెక్కి నదిమీఁదఁ బ్రయాణ
మయిరి. వారొండొండ పడవను గడపుచుండిరి. అప్పుడు కాలిన్సు
పడవగడపవలసివచ్చెను. అతను పడవను గడప నని మూర్ఖిం
చెను. అందుపైని స్నేహితు లిరువురు గలహించి పోట్లాడినందున,
నీత నేర్చినవాఁడని తెలిసి, బెంజమి నితనిని నీటిలోనికిఁ బడఁ
ద్రోసి, కడమవారితోఁ బడవను గడపుకొని పోయెను. ఈఁదు
కొని పడవదగ్గిఱకు కాలిన్సు వచ్చినను, పడవను గడపుట కిష్టపడిన
లోనికి రానిచ్చెద మని వీరు చెప్ప, వాఁడు గడప నని బదులు
చెప్పినందున, పడవను దోసికొని దూరముగ వీరు వెళ్లిపోయిరి.
కాలిన్సు మండిపడెను. ఈఁదుటచే బడలినవానిని కరుణించి,
పడవలోనికి వాని లాగుకొనిరి. అనంతర మందఱు గట్టుజేరి,
స్వగృహములకు వెళ్లిరి. తరువాత స్నేహితు లిరువురు సఖ్యు
తగ నుండలేదు.

ఎక్కడనున్నను, బెంజమినునుబోలిన సాధువు లితరులను
స్నేహముం జేసికొనక యుండరు. ఇప్పుడితనికి ముప్పుర స్నేహి
తులుగలరు; ఇతనివలె, సంసారపక్షముగ నున్నవారు. కొంచెము
నడవడిలో భేదమున్నను, గ్రంథావలోకనాసక్తి వీరిని దగ్గఱకుఁ

జేర్చెను. ఆస్బోర్ను, రాల్ఫు, బెంజమిను, వీరుముగ్వురు పద్యకావ్యములయం దభిరుచికలవారు. కనుకనే, చాటుపద్యములను వీరు చెప్పుచువచ్చిరి. "ఆదివారములనాఁడు, విహారార్థ మేటిగట్టునఁబోవుచు, మేమొకరికొకరు చదువుచు, చదివినదానిని విమర్శించుచుంటిమి" అని బెంజమిను వ్రాసెను.

ఈ కాలములోనే, బెంజమిను కన్యకరీడుల కన్యోన్యానురాగము బలసెను. ఆరోజులలో, కన్యకను తన కను రాగాస్పదుఁడైన పురుషుని వివాహమాడనీయక, పరునకిచ్చు స్వాతంత్ర్యము తండ్రికి గలదైనను, దీనినంతగఁ దండ్రులు బాటించుచుండలేదు. బెంజమిను లండనుకు బయలుదేరి వెళ్లుటకు రెండు నెలలు పూర్వమే, జానురీడు లోకాంతరగతుఁడయ్యెను. ముందుకు తాను ముద్రాశాలాధ్యక్షుఁడు కాగలనని 'గృహిణిరీడు' తోఁ జెప్పి, తన కామెకూఁతురునందుగల ప్రేమను బెంజమిను సూచించెను. ఆమె, బుద్ధిమంతురాలుగాన, నితనిమాటలను విని, సంబంధమున కొప్పుకొని, వధూవరులు 19 సంవత్సరములు పూర్తిగ నిండలేనివారగుటవలనను, ఇతను ప్రయాణోన్ముఖుఁడై యుండుటవలనను నాసమయము మంచిదికాదని చెప్పెను. అందువలన, లండనుకు వెళ్లి, తిరిగివచ్చి, పనిలో నిలుకడను బొందువఱకు బెంజమిను నిరీక్షింపవలసి వచ్చెను. 'తల్లిరీడు'తో నిటులు నిర్ణయించుకొని, బెంజమిను 'కన్యకరీడు'



లు మాటలాడునపుడు, తమయన్యోన్యానురాగము లొకరి కొకరు వెల్లడిచేసికొని, బద్ధులయిరి.

ఇంతలో గ్రీష్మము గడచెను. శరదృతువు అంతముగావచ్చెను. లండనుకుఁబోవు యోడ సిద్ధముగనుండెను. అది బయలుదేరు రోజు సమీపించెను. ఆశఁజూపుచు, లండనులోనున్న తన స్నేహితులకు యోగ్యతా పత్రికల నిచ్చెదనని చెప్పుచు, ప్రతిరోజున తనయింటికి రమ్మనుచు, బెంజమినును గవర్నరు త్రిప్పుచుండెను. బయలుదేరు రోజునకూడ యోగ్యతా పత్రికల నియ్యక, 'న్యూకాసిలు' పట్టణపు రేవుకు వచ్చు సరికి పనిమీఁద తానక్కడికివచ్చి యోగ్యతాపత్రికల నిచ్చెదనని చెప్పి, బెంజమినును గవర్నరు పంపివేసెను. బెంజమిను పడవ నెక్కెను. లంగరెత్తిరి. ఓడనడవసాగెను. అందులో జేమ్సు రాల్ఫ్', బెంజమినుకు ప్రత్యక్షమయ్యెను. భార్యాపుత్రాదుల విడనాడి, కీర్తిసంపదలను బొందుటకు లండనుకు రాల్ఫు పోవుచుండెను.

ఓడ న్యూకాసిలు రేవులో లంగరు దించెను. గవర్నరును దర్శించుటకు బెంజమిను వెళ్లెనుగాని, వానిదర్శనము కాలేదు. అతని కార్యదర్శి వచ్చి, పనితొందరలో నుండుటచే గవర్నరును జూచుటకు బెంజమినుకు వీలుపడదనియు, ఇతనికి కావలసిన యోగ్యతాపత్రికలను వెనుకనుండి గవర్నరు పంపుననియుఁజెప్పి

సంమన చేయుట కేమియు తోఁచలేదుగాని, మనస్సులో అపనమ్మకము మాత్రము బెంజమినునకుఁ బుట్టలేదు. బెంజమిను యోడలోనికి వచ్చిచేరెను. అంతలోనె, గవర్నరుపంపిన యుత్తరములను బట్టుకొని, తట్టుమీఁదికి కర్నలు ఫ్రెంచి వచ్చెను. వానిని కప్తానునకు ఫ్రెంచి యిచ్చివేసెను. తనయుత్తరములనియ్యవలసినదని కప్తానును బెంజమి నడుగ, ఇంగ్లాండు వెళ్లులోపున నుత్తరములను సంచిలోనుంచి తీసికొనవచ్చునని కప్తాను చెప్పెను.

నవంబరు తే 10 ది నాఁడు, యోడ సముద్రముమీఁద బోవుచుండెను. చాల కష్టదినములు యాత్రకుఁ బట్టియుండెను. సంచివిప్పి యుత్తరములఁ జూడఁగ, నందులోఁ గొన్నియుత్తరములపైని బెంజమినువిలాసము వ్రాయఁబడియుండెను. వానిలో నొకటి, రాజుగారి ముద్రాశాలాధ్యక్షునకు, మరియొకటి పుస్తకముల దుకాణదారునకు, చిరునామా వ్రాయఁబడియుండెను. ఇవి తనవియేయని బెంజమిను తలంచెను.

డిశంబరు తే 24 ది నాఁటికి, లండనుపట్టణపు రేవులో నోడ లంగరు వేసెను. ఉత్తరమును పట్టుకొని, వెంటనే బెంజమిను దుకాణదారునియొద్దకు వెళ్లి, గవర్నరు కీతు వ్రాసిపంపిన లేఖను వానిచేతిలోఁ బెట్టెను. గవర్నరు కీతు పేరు వినినతోడనే, "అతనెవరో నేనెఱుఁగనే" అని దుకాణదారుఁడు చెప్పి, యుత్తరమును విప్పి చదువుకొని, "ఇది, 'రిడిల్సు' డనువాఁడు వ్రాసిన



యుత్తరము. వీఁడు దుర్మార్గుఁడని కొద్దిరోజులక్రిందట నేను వినియుంటిని. వీనితో నాకేమిపని? వీని యుత్తరములను జూచుట యేల?" అని కోపగించి, యుత్తరము పారవైచి, తన ఖాతాదారునికిఁ గావలసిన వస్తువుల నిచ్చుటకు దుకాణదారుఁడు వెళ్లెను.

మిగిలిన యుత్తరములు గవర్నరు వ్రాయనటులు బెంజమినుకుఁ దోఁచెను. ఇన్నిరోజులకు గవర్నరుయొక్క సౌజన్యతను సందేహించి, యోడలోఁ బరిచయము గలిగిన "డెనుహాము"తో సకృచ్ఛముగ నీ సంగతిని బెంజమిను చెప్పెను. క్షణములో సంగతిని గ్రహించి, గవర్నరు బెంజమిను విషయమై యెవరికి నుత్తరములు వ్రాసియుండఁడనియు, గవర్నరుమాట లవిశ్వాసనీయములనియు, గవర్నరుకుఁ బరపతిలేదనియు బెంజమినుతో 'డెన్హుహాము' చెప్పెను. మనోధైర్యము చెడినవాఁడై, డబ్బు లేదని బెంజమిను డెనుహాముతోఁ జెప్ప, "ఇక్కడి ముద్రకులతోఁ గలిసి పనిచేసిన, నీవు లాభమును బొందఁగలవు. అమెరికాకుపోయి స్వతంత్రముగఁ బనిచేయుటకు సమర్థుఁడ వగుదువు" అని డెనుహాము బెంజమినునకు సలహాయిచ్చెను.

రెట్టించిన యుధైర్యమును గలిగించుటకు, రాల్ఫు లండనులోనె యుండిపోయెద నని బెంజమినుతోఁ జెప్పెను. రాల్ఫు డబ్బులేనివాఁడనియు, కాసిచ్చి సహాయముఁ జేయు స్నేహి

తుఁడు తాను దప్ప మరియెవరు నతని కింగ్లాండులో లేరనియు బెంజమినుకుఁ దెలియును.

గవర్నరు చేసిన ఈ సహింపరాని పితలాటకమును గుఱించి, బెంజమిను వ్రాసిన యాక్షేపణ న్యాయముగ శ్లాఘింపఁబడి యున్నది. "అజ్ఞానులైన బీదకుఱ్ఱవాండ్రను నిర్హేతుకముగ మోసపుచ్చి వారియెడల కపటముగ ప్రవర్తించిన గవర్నరెట్టి వాఁడని యూహింపవచ్చును? అట్లుచేయుట, మొదటినుండి యతని కలవాటుగ నున్నది. అందఱను సంతోషపెట్టవలె నని యభిలషించి, వారి కిచ్చుటకేమియు సొమ్ములేక, వారికి యాశ మాత్రము గవర్నరు చూపించుచుండెను. ఇంతకుతప్ప, మిగిలిన విషయములలో వివేకమును, చురుకుదనమును కలిగి, మంచి లేఖరియై, ప్రజలను బాగుగ పరిపాలించువాఁడు," అని బెంజమిను వ్రాసెను.

---

## అయిదవ ప్రకరణము.



### లండనులోని యనుభవములు.

వయస్సులోనున్న బెంజమిను రాల్ఫు ఇరువురు వారమునకు మూఁడురూప్యము లద్దె నిచ్చుటకు నిర్ణయించుకొని, 'లిటిలు బ్రిటను' వీధిలో నొక బసను బుచ్చుకొనిరి. వీరొకరి నొకరు విడువలేకయుండిరి; బెంజమినుచేఁ బోషింపఁబడుచున్నందున, నితనిని విడుచుటకు రాల్ఫుకు వీలు లేక పోయెను. తనకంటె తక్కువ వాఁడైనను, స్వారస్యముగ మాటలాడువాఁడని రాల్ఫును బెంజమిను ప్రేమించుచుండెను. సం॥ '50-రములు గడిచిన పిదప, రాల్ఫును బోలిన రసికుని చూచి యెఱుఁగ నని బెంజమిను చెప్పెను. బెంజమిను నెమ్మది గలవాఁడును, మాటలలో వెనుకదీయువాఁడును. గాంభీర్యముతోఁ దనపనినిఁ జూచుకొనువాఁడును, చూచుటకింపైన వాఁడును; పెద్దపిన్న తారతమ్యముకలవాఁడై, మాటల నేర్పుగలిగి, లౌకిక వ్యాపారాభివృద్ధిని గోరువాఁడు రాల్ఫు. వీలయినచో వీరిరువురిలో, రాల్ఫే గొప్పవాఁడగు నని వీరినిఁ జూచినవారు చెప్పియుందురు.

రాల్ఫువద్దలేని రెండువిశేషములు బెంజమినుకు కలవు. అవి సర్వసాధారణములయినను, బెంజమిను కప్పటికి శ్రేయోదాయకము లయ్యెను. పదికాసులసొమ్ము, చేతిలోని పని—యీ రెండును బెంజమినుకు కలవు. వారమునకు పాతికరూప్యముల సొమ్మును గలిగించు శక్తిగల పనిని బెంజమిను నేర్చియుండెను. విలంబముగాని, కష్టముగాని లేకయే, యిదివఱకే పదుగురు పనివాండ్రున్నను, 'పామరు' కంపెనీలో బెంజమినునకుఁ బని దొరికెను. అతివేగముగ నక్షరములను గూర్చుటయందు బెంజమిను సమర్థత కలవాఁడు. పనిలోఁ బ్రవేశించుటకు రాల్ఫుచేసిన ప్రయత్నములన్నియు వృథయాయెను. అందుచే, బెంజమిను పోషితవర్గములో నతఁడుండెను. దరిదాపుగ నొక సంవత్సరము కంపెనీలో బనిచేసి, మంచివేతనములను సంపాదించి, వానిని బెంజమిను వ్యయము జేయుచుండెను.

ఇప్పుడు బెంజమిను జీవితకాలములో జరిగిన యంశమొకటి వినఁదగియున్నది. గత శతాబ్దములో జన సమ్మతమై, 'వలాస్టను' చే వ్రాయఁబడిన 'ప్రకృతిమతవర్ణన' యను గ్రంథరాజమును ముద్రించుటకు బెంజమిను అక్షరములను కూర్చుచుండెను. జీవహత్య, దొంగతనము, వ్యభిచారము—వీనిని నిషేధములని ధర్మశాస్త్రములు శాసింపకపోయియుండినను వీని నాచరించుట అకర్తవ్యమని చూపించుటయే గ్రంథకర్త



యొక్క ముఖ్యాభిప్రాయము. ఇట్టి మనోహరమైన గ్రంథము, బలవద్విరోధము లగు ప్రత్యూహాలను బెంజమినుకుఁ గలిగించెను. ఆ గ్రంథమును ఖండించుచు, నితఁ డొక ముప్పదిరెండు పుటల పుస్తకమును వ్రాసెను. ఈ గ్రంథమును వ్రాయుట వలన, బెంజమిను గొప్పవాఁడయ్యెను. దీని ప్రతియొకటి, రణవైద్యుఁడైన 'లయన్సు' చూచి చదివి సంతసించి, దీనికర్తను వెతకుచు వచ్చి, కని, గౌరవముగ బెంజమినును పలకరించెను. "మానుషాభిప్రాయములు బుద్ధిప్రమాదరాహిత్యము"లను గ్రంథమును లయన్సు వ్రాసెను. ఇత నాకాలపు (Sceptics) సంశయాళువుల పరిచయము గలవాఁడు. "సారంగములకథ" యను గ్రంథమును వ్రాసి, "సంశయాళువుల సంఘమున" కధ్యక్షుఁడై యుండిన "డాక్టరు మాండవిలు" దర్శనము బెంజమినుకు లయన్సుచేయించెను. వైద్యుఁడు, పదార్థవిజ్ఞాన శాస్త్రవేత్తయు, గణితశాస్త్రజ్ఞుఁడు, రాజపోషిత సంఘము (Royal Society) లోనివాఁడు, సర్ ఐజాకున్యూటనుకు స్నేహితుఁడును, అయిన డాక్టరు పెంబర్టనుగారి దర్శనము బెంజమినుచేసెను. సహప్రమాస వృద్ధై, దుర్బలుఁడైన న్యూటనును దర్శించుటకు బెంజమినుకు వీలులేకపోయెను. "ఆంగ్లేయ చిత్రవస్తు ప్రదర్శనశాలా" స్థాపకుఁడు, సృష్టివైచిత్ర్యసంపాదకుఁడు (Antiquarian) నయిన, సర్ హాన్సుస్లోను గారి పరిచయ మీకాల

ములోనె బెంజమినునకుఁ గలిగెను. "ఆస్బెస్టాసు" అను చిత్రవస్తువు నమెరికానుండి బెంజమిను తెచ్చెను. దానిని జూచుటకు స్లోనుగా రితనిబసకువచ్చి, కొంతవఱకు ముచ్చటించి, తగిన వెలనిచ్చి, దానిని బుచ్చుకొని, నితనిని తన గృహమునకుఁ దోడుకొనిపోయి, యక్కడనుండు వైచిత్ర్యములను బెంజమినుకు జూపించెను.

ప్రస్తుతముకంటె నధికముగ ధనమును గూడబెట్టవలయునని కోరి 'పామరు' కంపెనీలో పనిమాని, 'వాట్సను' కంపెనీలోఁ బనిని బెంజమిను స్వీకరించెను. ఇందులోఁ బనిజేయువా రందఱు త్రాగుబోతులుగాన, 'ఉదకపానీని' అని బెంజమినుకు మారుపేరిడిరి. హెచ్చరికను పుట్టించు మంచి మద్యమును త్రాగుటకంటె, నీరుత్రాగి దృఢముగనుండు బెంజమినును జూచి వారాశ్చర్యమును బొందిరి. "నాతోఁబనిచేయువాఁడొకఁడుదయమున నొక పైంటు, భోజనకాలమున నొకపైంటు, తదుపరి మఱియొకటి, మధ్యాహ్నకాల భోజముచేయునపు డొకటి, సాయంసమయమున నొకటి, పని ముగిసిన పిదప మఱియొక పైంటు—ఈ విధమున మద్యపానముచేయుట కలదు. అట్లు పుచ్చుకొనినగాని పనిజేయుటకు సామర్థ్యముండదని వానియభిప్రాయము...ప్రతిశనివారము రాత్రి 3,4 రూప్యములు సారాయి నమ్మువానికితఁడిచ్చుచుండెను. ఈ ఖర్చు నాకులేదు" అని



బెంజమిను వ్రాసెను. అనేకు లితనిని జూచి మద్యపానమును విడిచిపెట్టిరి. మద్యముకన్న గంజి నీరు శ్రేష్ఠమని యాంగ్లేయులకు బెంజమిను నమ్మకము పుట్టించినందున జీవదృష్టాంతముయొక్క మహిమ యేమని జెప్పవచ్చు! మద్యపానము విడుచుటవలన, వ్యయము తగ్గుటయేకాక, బుద్ధినిర్మలముగ నుండును. "దినమంతయు మద్యమును బుచ్చుకొనువారు, సొమ్ములేక, దుకాణములో పరపతిని బోఁగొట్టుకొనినందున, వారికి నేను సొమ్మునియ్యవలసి వచ్చుచుండెను" అని బెంజమిను వ్రాసెను.

ఇటు లందరిని సురాపానవిముఖులుగఁ జేసి, ప్రతికూలములకెదురుగ నడిచి, ముద్రాక్షరశాలలోని కొన్ని నిబంధనల నుపయుక్తమగునటులు మార్చెను. అక్షరములను గూర్చుటయందు హస్తలాఘవము చూపి, సతతపరిశ్రమచే యజమానికృపను సంపాదించి, క్రమ క్రమముగ హెచ్చువేతనములకెక్కి సుగుణగణ విరాజమానుఁడయి కొంత సంపద్వైభవముల నందెను.

బెంజమిను ధనమునుకూడ బెట్టవలయునని గృహకృత్యములను పోణిమితో నిర్వహించుచు వచ్చెను. "డ్యూకువీధి"లో నొక బసను మాటలాడి, వారమునకు సుమారు మూడు రూప్యము లిచ్చుట కొప్పుకొని, ముద్రాక్షరశాలకు సమీప

ముగ నుండెను. ఇంటిలో మనుజుని సహాయమావశ్యకమని యెంచి, యిల్లుగలామె తక్కువ సొమ్ముకు బసనిచ్చెను. అంతలో, వారముకొకరూపాయి యద్దెకు బసదొరుకునని తెలిసి, యక్కడికి పోవుటకు బెంజమిను యత్నించెను. ఇతనియందు గరుణగలిగి, సాయంసమయముల నితని సంభాషణములకు సంతసించి, యితను తన బసనుండి వెళ్లుట కిష్టపడక, రూపాయి యద్దెకొడంబడి, ఆమె తన బసలో బెంజమిను నుంచివేసెను. "ఈ యద్దె నిచ్చుచు లండనులో బసచేసి యుంటి" నని బెంజమిను వ్రాసెను. వీరిరువు రన్యోన్య మైత్రితోఁ గాలమును గడిపిరి. మాటలును, కథలును చెప్పి, ఆమె బెంజమినుకు సంతోషమును గలిగించుచుండెను. ఆమె వయోవృద్ధు—కాలులేనందున, సాధారణముగ నిల్లువిడిచి బయటకుఁ బోవుటలేదు. దయార్ద్రహృదయురాలు. ఆమె సాంగత్య మితనికి సంతోషమును గలిగించినందున, వీలు లేదని చెప్పక యామె పిలిచినపుడెల్ల మాటలాడుటకు బెంజమిను వెళ్లుట కలదు.

వాట్సు ముద్రాక్షరశాలలో నితనితోఁ గలిసి పాటుపడువారలలో 'డేవిడుహాలు' అను వానిని బెంజమిను బాగుగ నెరుగును. ఇతఁడు ఫిలడల్ఫియాలోఁ జాలకాలము బెంజమినుతో సహకారియై యుండెను. 'వైగేటు' అను మఱియొకనిని



సహిత మితఁ డెఱుఁగును. ఇతఁడు బాగుగఁ జదువుకొనినవాఁడు. ఇతనికిని, ఇతని స్నేహితునికిని రెండుపాఠములలో బెంజమిను ఈఁత నేర్పెను. బెంజమిను మంచియీఁతగాఁడు. జలశయన, జలస్తంభన మొదలగు చమత్కారములను నేర్చియుండెను. ఒక పర్యాయము, నాలుగు మైళ్లదూర మితఁ డీఁదెను. ఇతని నేర్పునకు, యోపికకు మిగుల ముదమంది, బెంజమినునందు వైగేటు బద్ధానురాగముగలవాఁడై, యీఁతవలన పొట్టపోసికొనుచు, యైరోపాఖండములో సంచరించి వత్తమాయని ఇతఁడు బెంజమినును సలహా యడిగెను.

అమెరికానుండి యోడలోఁ గలిసివచ్చునపుడు కలిగిన పరిచయమును బోగొట్టుకొననందున, బెంజమిను 'డెనుహాము' యొద్దకుఁ బోయి, యీ ప్రయాణము సంగతి వానితో ముచ్చటించెను. అతఁడు విని, ప్రయాణోన్ముఖుఁడైన బెంజమినును విముఖుని జేసెను. పెన్సిలువానియాకు వెళ్లు ఆలోచనఁ జేయుమని యతనికి బోధపఱచి, తానుగూడ విశేషవస్తు సామగ్రితో బయలు దేరుచున్నానని డెనుహాము చెప్పెను. ఇతఁడు వర్తకులలో నిష్కళంకగార్హస్థ్యధర్మానుచరుఁడై, వర్తక సంఘమున కదివఱకున్న నిందను బోఁగొట్టి, క్రైస్తవ దేశముల యందు దీనికి నామ రూపములను దెచ్చిన మహనీయుఁడు. ఇతఁడింగ్లాండుకువచ్చి, బ్రిస్టలు పట్టణమునకు తన కప్పిచ్చిన వారి

నందఱను సమావేశముచేసి, తన ఋణముల సంగతిలో వారు రాజీనామా పడినందు కెంతయు సంతసించెను. ఆ నాఁడు వారికి విందుచేసి, వారి కియ్యవలసిన సొమ్ము అసలు వృద్ధులతో నితఁ డిచ్చివేసెను. తా నమెరికాలో వెళ్లి వ్యాపారమును సాగించుటకుగాను వస్తుసామగ్రి నింగ్లాండులోఁ గొనెను. సంవత్సరమున కేఁబది కాసులు వేతనము పుచ్చుకొని తన కార్యదర్శిగ నుండుమని డెనుహాము బెంజమినును కోరెను. ఇంత కధికముగ బెంజమినుకు సొమ్ము దొరుకుచుండెను. వర్తక వ్యాపారములోఁ గొంత తేఱి పారినపిదప, మరికొన్ని పనులలో బెంజమినును నియోగించుటకు వీలగునని డెనుహాము వానితోఁ జెప్పెను. డెనుహాము యొద్ద పనిచేయుట కతఁ డొప్పుకొనెను.

లండను, అక్కడిజీవనము,—ఈ రెండును బెంజమిను కసహ్యము పుట్టించి యుండెను. ఫిలడల్ఫియాలో నిశ్చింతగ జఱపిన మాసములను అనేకపర్యాయములు జ్ఞప్తికి దెచ్చుకొని, వానిని బెంజమి నభిలషించుచుండెను. కావున ముద్రాక్షరశాలలోని పనిని విడిచి, వస్తుసామగ్రిని కట్టి యోడ కెక్కించెను. మరి కొన్నిరోజులకుగాని యోడ బయలు దేరలేదు.

ప్రయాణమునకు ముందొక రోజున, ఘనతవహించి, కోశాధ్యక్షుఁడైన, సర్ విల్లియంవిండుహాము, వర్తమానము



బంపినందున, వానిని దర్శించుటకు బెంజమిను వెళ్లెను. "నీకీఁత బాగుగ దెలియునని, నీవిద్దఱి కదినేర్పితి వని, నాలుగుమైళ్లీఁదితివనియు వినుచున్నాను. నా కుమారులు ప్రయాణోన్ముఖులయి యున్నారు. వారు వెళ్లుటకు పూర్వమే, నీ వీ విద్యను వారికి నేర్పవలయును" అని బెంజమినును 'విండుహాము' వేఁడుకొనెను. ఇతఁడు ప్రయాణ సన్నద్ధుఁ డైనందున, దానికి సమ్మతించుటకు వీలు లేకపోయెను. "అమెరికాకు నాప్రయాణము సిద్ధముకాక మునుపు, నాకీ వర్తమానము వచ్చియుండిన, నేను ప్రయాణమును తలపెట్టక, ఇంగ్లాండులో నీఁతవిద్య పాఠశాలను బెట్టియుందు" నని బెంజమిను వ్రాసెను.

---

ఆఱవ ప్రకరణము.



ఫిలడల్ ఫియాకు తిరుగుదల.

కప్తాను క్లార్కుచే గడపఁబడిన 'బెర్కుషియరు' యోడలో బెంజమిను బయలు దేరెను. జులై తే 21-ది మధ్యాహ్నమున, 'గ్రేవుశెండు' యొద్ద వీరు లంగరువేసిరి. "ఇది పాడుప్రదేశము. ఇక్కడి ప్రజలు మార్గస్థులను మోసపుచ్చుటయే పనిగాఁగల వారలు. వీరియొద్ద వస్తువులను గొని, వారు గోరిన వెలలలో సగము నిచ్చిన, ఇవియు నిజమైన వెలకు రెండింతలుండును. దైవానుగ్రహమున నిక్కడినుండి రేవు బయలుదేరుచున్నార" మని బెంజమిను వ్రాసెను. మరునాఁడు బయలుదేరి, పోర్ట్సుమతు రేవులో లంగరు వేసిరి. ఓడల గమ్యస్థానముఁ (harbour) జూచుటకు కప్తాను, డెనుహాము, ఇతని లేకరి, ముగ్గురు నోడ దిగి పట్టణములోనికి వెళ్లిరి. అనేకదినములవఱకీ యోడ 'పోర్ట్సుమతు వైటు' దీవికి మధ్యప్రదేశమున నుండెను. ఈ లోపున బెంజమిను 'వైటుదీవి' లోనికిఁ బోయి "కారిసుబ్రూకు" దుర్గము మొదలగువానిని దర్శించెను.

మఱి కొన్నిరోజులవఱకు, వైటుదీవి రేవులో నోడ లంగరు వేయుచు, ఎత్తుచు, సోలాంటునదిపైఁ దేలుచు, సముద్రమునకుఁ



బోవలెనని యత్నము జేయునపుడు, 'స్పిత్ హెడు' రేవులోనికి గాలిచేఁ గొట్టఁబడెను. 'యార్ మతు' పట్టణమువద్ద కొందఱు ప్రయాణికులకుఁ గలిగిన విపత్తును బెంజమిను సొంతముగా వ్రాసెను. దీవిలోఁ గొంతసంచరించి, సాయంకాలమున యార్ మతునకు వీరురాఁగా, రేవునకుఁ బోయెడి మార్గమును దప్పినట్టు వీరికిఁ దోఁచెను. దేనిమూలమున రేవు విరివియైనద్దో, యా కయ్యను వీరుదాఁటి కయ్యముఖద్వారమున నున్న దోనెవద్దకు వచ్చిరి. దానిపైకి దాఁటి, పట్టణములోనికిఁ బోవలె నని వీరభిప్రాయపడిరి.

"గడపువాఁడు లేనందున, వానిగుడిసెకు మేము వెళ్లితిమి. వాఁడు మంచమునెక్కి పరుండియుండెను. మమ్ములను దాఁటింప ననెను. అప్పుడు, దోనెను లాగి తెచ్చి, దానిని గడపుకొని పోవుటకు నిశ్చయించి, నీటియొద్దునకు మేము వచ్చితిమి. దోనె నీటికి 50 గజములు దూరమున గుంజకు గట్టఁబడియున్నందున, దానిని మేము లాగలేకపోతిమి. దానియొద్దకుఁ బోవలె నని బట్టలు తీసివేసితిని. దానిదగ్గిఱకు తీసికొనిపోవు రాతికట్టుమార్గమును దప్పినందున గుండెలు మోయ, బురదలోఁ దిగఁబడితిని. తుదకు గుంజ వద్దకు వచ్చితినిగాని, దోనె గొలుసుతో గట్టఁబడి తాళము వేయఁబడియున్నందున, చాలదిగులు పొందితిని. అన్ని విధములఁ దోనెను తీయవలె నని యత్నించితిగాని, ప్రయోజ

నము లేకపోయెను. తడిసి, బురదలో నొక గంటవఱకు ప్రయాసపడి, తుదకు దోనెను తీయలేక, మరలివచ్చితి'' నని బెంజమిను వ్రాసెను. ''మా జేబులలో డబ్బులేదు. గాలికఱచుచున్నను, మేమొక గడ్డి కుప్పయొద్ద నా రాత్రి గడపుటకు నిశ్చయించితిమి. ఇటులు శ్రమదమలు పడుచుంటిమి. ఇంతలో మాలో నొకఁడు తన జేబులోనుండి యినుపలాడా (Horse-shoe) నుతీసి, దానితోఁ దాళమును బగులఁగొట్టుటకు వీలగు నని నాతోఁజెప్పి, నాచేతికి దాని నిచ్చెను. నేను దానిని పట్టుకొని వెళ్లి, తాళమును బగులఁగొట్టి, దోనెను నీటిలో తేల్చితిని. మేమందఱము సంతోషించి, దానిలో నెక్కితిమి. నేను బట్టలను వేసికొనిన పైని, దానిని మేము గడిపితిమి. పెద్దకష్టము ముందుకు రానున్నది. అప్పుడు పోటు సమయము గనుక, నంతట నీరు నిండియుండెను. వెన్నెల రాత్రియైనను, కయ్యనుండి పోవు కాలువ యేదో మాకు దెలియ లేదు. తోఁచినటుల దోనెను తిన్నగ గడిపినందున, సగము దూరము పోవునప్పటికి, బురదలో దోనె చిక్కుపడినట్టు మాకు దోఁచెను. తెడ్డులను బురదలోనాటి, దోనెను నీటిలోనికి త్రోయవలెనని యత్నించి, మేమొక తెడ్డును విరిచివేసితిమి. నాలు గంగుళముల నీరైన లేనందున, దోనెతో మేమొడ్డెక్కితిమి. ఏమిచేయుటకును దోఁచక, చీకాకుపడుచుంటిమి. పాటో, పోటో మాకు తెలియలేదు. కొంతసేపటికి, పాటుసమయమని గ్రహించితిమి. తెడ్లు



ముణుఁగుటకు తగిన నీరైన లేదు. రాత్రియంతయు గాలి దెబ్బ తినుచు, దోనెలోనుండుట కష్టమైనను, మరుచటి దిన ముదయమున దోనెవాఁడు వచ్చినపుడు మేము తెల్లముఖము వేయవలసి వచ్చునని విచారించుచుంటిమి. ఒక యరగంటవఱకు గుజగుజలాడి క్రిందుమీఁదు పడితిమిగాని, కార్యము లేకపోయెను. చేతులు నులుపుకొనుచు గూర్చుంటిమి. ఒడ్డున చేరుమార్గము కనఁబడదాయెను. సముద్రపు పోటు తగ్గెను. క్రిందికి దిగిన, గొంతుక మోయ బురదలో దిగఁబడవలసి వచ్చును. అప్పుడు తెగించి, యిరువురము బట్టలు తీసివేసి, క్రిందికి దిగి, మా మోకాళ్లతో 50 గజముల వఱకు దోనెను గెంటుకొనివచ్చి, నీటిలో దానిని తేల్చితిమి. ఒకటే తెడ్డుండుటచే, గష్టముతో మేమొడ్డున జేరితిమి. మాతో వచ్చిన, వారందఱు బసలో మమ్ములకై ఎదురు చూచుచుండిరి. ఆ రాత్రి మేమొడ్డున గడిపితిమి. మా విహార మిటుల ముగిసె'' నని బెంజమిను వ్రాసెను.

స్పిత్ హెడ్ వదలిన మూఁడు వారములకు ఈ ప్రయాణికులు అట్లాంటికు మహాసముద్రమును జూచిరి. ప్రయాణము దీర్ఘమై, విసుగు పుట్టించెను. ఈ ప్రయాణములోనె, గతించిన కాలములోని తప్పులను స్మరణకుఁ దెచ్చుకొని, ముందుకు బాగుగ నడచుటకై, బెంజమి నొక నడవడిపట్టికను వ్రాసెను. తరువాత కొందఱా పట్టిక దొరకలే దనిరిగాని, ఇటీవల బెంజమిను స్వహస్తలిఖిత ప్రతి యొకటి లభించినది.

"పద్యకావ్యమును రచించువారు దానిని పఠన యోగ్యము చేయవలె ననిన వ్రాయుటకు బూర్వము, దాని యాద్యంతములను బాగుగ యోచించవలెను. అటులనే, జీవిత కాలము. దానిని గడపుటకు తిన్ననిమార్గము వేయనందున, నేను చిక్కుదారులలోఁబడి, మార్గము తప్పితిని. నా గార్హస్థ్య ధర్మము మారినది గనుక, కొన్ని నిబంధనలను నియామకముల ననుసరించి, నాజీవితకాలమును జ్ఞానివలె గడపుటకు నిశ్చయించి, ఈ దిగువ నిబంధనలను వ్రాయుచున్నాను.

" (1) ఋణములను తీర్చువఱకు నేను మితముగ ధనమును వ్యయము చేయవలెను.

(2) ఎల్లపుడు సత్యమును బలుకుదును.—నేను నిర్వహించుటకు శక్తిలేని కార్యములయందితరుల కాశ కలిగించను. మనోవాక్కాయ కర్మములలో సౌజన్యతను చూపింతును.

(3) పూనినపనిని పూనికతో తుదముట్టించెదను; స్వకర్మమును విడిచిపెట్టి, ధనార్జన కితరపనులను చేయను. శ్రద్ధ వహించి, యోర్పుతోఁ బనిని చేయుటయే ధనార్జనకు మార్గము.

(4) ఇతరుల దుర్గుణముల నెంచను. వారి సుగుణములనే యెంతును. ఇతరు లన్యాయముగ దుర్గుణమొకనియం దారోపించినను, సమయము చిక్కినపుడెల్ల వాని సుగుణముల జెప్పుదు"నని బెంజమిను వ్రాసెను.



ఇంతటితోఁ జాలించక, నాఁడు మొదలు గార్హస్థ్యధర్మములను సరిగా నడుపుచున్నది లేనిది బెంజమిను పరీక్షించుకొనుచుండెను. దీని ఫలితమును ముందు జూడగలము.

ఆనాఁడట్లాంటికుమహాసముద్రము జలార్ణవమే. 'బెర్కుషియరు' యోడలోని వారు మఱియొక యోడను జూచుసరికి, 50 దినములయ్యెను. ఈ యోడ స్నేహపక్షము వారిదైనందున, వారు జూచి సంతసించిరి. అది దగ్గఱకు వచ్చుట వలన, దానిలో నున్న ప్రయాణికులతో వీరు మాటలాడిరి. దానిని చూచుట వలన బెంజమినుయొక్క మనస్సు కరగెను.—"ఇది 'స్నో' అను పేరుగల యోడ. స్త్రీ పురుషులేఁబదిమంది నెక్కించుకొని, 'డబ్లిను' పట్టణమునుండి 'న్యూయార్కు' కుఁ బోవుచున్నది. ఇందులోని వారందఱు తట్టుపైకి వచ్చి మమ్ములను జూచి సంతసించినట్లు నాకు గనఁబడెను. ఇట్లు దైవికముగ, మహాసముద్రముమీఁద రెండోడలు గలిసినపుడు, వానిలోని యాత్రికులెంత సంతసింతురు! వారి మనస్సులలో నెంత యుల్లాసము కలుగును! ఆ యోడలోని వారి ముఖములను జూడఁగ, సంతోషముచే నాహృదయము తపతపలాడి, యంతఃకరణ పూర్వముగ బయలు వెడలినందున, నే నానందమును పట్టలేక పోతి"నని బెంజమిను వ్రాసెను.

మరి పదియారు దినములకు, తట్టుమీఁదనుండు వారి కానందమును గలుగఁజేయుచు, యోడయొక్క చౌకివాఁడు "భూమి, భూమి" యని యఱచెను. "అందరివలె నేను వేగముగ జూడలేకపోతిని. నానేత్రము లానంద బాష్పములతో నిండెను." అని బెంజమిను వ్రాసెను. మరి రెండు రోజులు గడచినపిదప, ఫిలడల్ఫియా కారుమైళ్లు దిగువగ, డెలవేరు నదిలో సాయంత్రము 8 గంటల కీ యోడలంగరు వేసెను. "విహారార్థము పడవనెక్కి, ఫిలడల్ఫియాలోని బాలురు కొందరు దైవికముగ వచ్చి, మాయోడ తట్టునెక్కి, మమ్ముల నొడ్డుకుఁ దీసికొనిపోవుటకు సమ్మతించినందున, మేము వారితోఁ బడవలోనికి దిగి, 10 గంటల కొడ్డున జేరితిమి. విసుగు పుట్టించి భీతావహమైన సముద్రపు ప్రయాణమును నిరుపద్రవముగ జేసినందు కొకరికొకరు వందనములు చేసికొని, మేమందఱము దైవకటాక్షమును గొని యాడితి"మని బెంజమిను వ్రాసెను.

ఓడదిగి, ఫిలడల్ఫియావీథులలోఁ బోవుచుండఁగ, నుద్యోగమునుండి తొలగింపఁబడిన గవర్నరు కీతును బెంజమి నాకస్మికముగ దారిలోఁ జూచెను. నిష్కాతుకముగ బెంజమినును మోసపుచ్చినందుకు, సిగ్గుపడి, బెంజమినును బలుకరించక, కీతు వెళ్లిపోయెను. దరిద్రుఁడు, అలక్ష్మితుఁడునునై, జీవనార్థము నూతన న లచారిత్రములను వ్రాయుచు, మరి పాతిక సంవత్సరములు



ప్రపంచములోఁ కొట్లాడి, సం|| 80-రముల వయస్సున, లండను పట్టణములో, సం|| 1749-రమున, కీతుస్వర్గస్థుఁ డయ్యెను.

కన్యకరీడుయం దపేక్షకలవాఁడై, యామెను బెంజమిను మరవలేదు. లండనులోనుండు దినము లంతమగుముందు, రాల్ఫుగారి చిక్కును వదిలించుకొని, బెంజమిను స్వస్థతను బొంది, ప్రాచీనమోహమంకురింప, "మోహపాశములలో చిక్కి, వీనిమూలమున నింగ్లాండునుండి ఫిలడల్ఫియాకు వచ్చితి"నని బెంజమిను వ్రాసెను. ఇతఁ డింగ్లాండునుండి రాఁడని నిశ్చయించి, "రోజర్సు" అను కుమ్మరివానిని కన్యకరీడు వివాహమాడెను. ఈ దాంపత్య మనుకూలము కానందున, వానిని విడనాడి, కన్యకరీడు తన మాతృగృహము వచ్చి చేరియుండెను. ఈ సంగతులు బెంజమినుకుఁ దెలిసి, ఇదియంతయు తనలోపమువలన జరిగినదని విచారించెను. ఋణస్థుల బాధపడలేక, 'కుమ్మరి రోజర్సు' పశ్చిను దీవులకుఁబోయి, కొంతకాలమున కక్కడ మృతినొందె నని వార్త వచ్చెను.

బెంజమిను దేశములో లేని సమయమున, కీమరు వ్యాపారమును బాగుగ నడిపించినటులు కనబడెను. మునుపటిదానికంటె బాగుగనున్న బసలో కీమరు దుకాణమును పెట్టెను. ముద్రాక్షరశాలకు కావలసిన నూతన కూర్పులను (New types) వాఁడు

తెప్పించెను. విశేషముగ పనివాండ్రను నియోగించి, వ్యాపారమును వాఁడు సాగించుచుండెను.

వెంటనే, బెంజమిను పనిలో ప్రవేశించెను. డెనుహాము, 'వాటరు వీధి'లో నిల్లు పుచ్చుకొని, దానిని సామానులతో నింపి, దుకాణము పెట్టెను. శ్రద్ధాభక్తులతో గ్రొత్తపనిని బెంజమిను చేయుచు, కొద్దికాలములోనే వ్యాపారమునందు నేర్పరి యయ్యెను. పుత్రవాత్సల్యముతో బెంజమినుని యజమానుఁడు, పితృవాత్సల్యముతో యజమానుని బెంజమిను, చూచుకొనుచుండిరి. ఒక యింటిలో నిరువురు కలిసియుండిరి. ఇటులు కాలమును సౌఖ్యముగ గడపుచున్నందున, బెంజమినుకు వర్తక యోగము తప్ప, మరియొకటి లేనట్లుతోఁచెను. కొద్దికాలములో నీ వ్యవహారములో వంతుదారుఁడగుట కవకాశముగలిగి, డెనుహాముయొక్క స్థానము నాక్రమించునేమోయని నలుగురికిఁ దోఁచెను. అన్ని విధముల తుష్టిపుష్టికలవాఁడైనను వెర్నను యొక్క ఋణమును తీర్పలేదనియు రీడుకన్య నన్యాయముగ దుఃఖముల పాలుచేసితి ననియు బెంజమిను విచారించుచుండెను.

మొదటిమాసములలో, పని సాగుటవలన, నితని యోగము బాగుగనుండునను యాశకలిగినను, వీని యోగదశ హఠాత్తుగ నంతరించెను. దుకాణము పెట్టిన నాలుగునెలలకు, సం||



1727-రము ఫిబ్రవరినెలలో, డెనుహాము-బెంజమినులు చావు సంకటముపడిరి. పార్శ్వశూలచే బెంజమిను బాధపడి, చావుకు సిద్ధమయ్యెను. "నేను విస్తారము బాధపడితిని. సర్వము విడిచితిని. రోగము కుదిరినందున ఖిన్నుఁడనై, లేచి తిరిగి యీపనులనే మరలజేయవలసి వచ్చెను గదా యని విచారించితి" నని బెంజమిను వ్రాసెను. డెనుహాము చాలకాలము బాధపడి, తుదకు కాలవశమును బొందెను. తన వాత్సల్యమును జూపించుటకు, గొంతధనమును బెంజమిను కీయవలసినదని, మరణశాసనములో డెనుహాము వ్రాసెను. తదనంతర మతని సొత్తును సంరక్షకు లాక్రమించినందున, బెంజమిను పనిలేక గాలికి తిరుగవలసి వచ్చెను.

అనంతరము, కీమరుయొక్క ముద్రాక్షరశాలలో హెచ్చువేతనమునకు బని నంగీకరించెను. ఇతనికి కీమరునకు మనస్సంతగ కలియకపోయినను, కీమరు విషయమై చెడువార్తలను వినుచున్నను, శరీరపోషణార్థ మీపనిని బెంజమిను చేయుచుండెను. ఇక్కడ పనిచేయువారలలో, న్యాయబుద్ధిగల 'హ్యూమెరిడితు' అను నాటుపురమువాని పరిచయము బెంజమినుకు గలిగెను. వీఁడు వివేకి, యనుభవశాలి, లెస్సగ్రంథములఁ జదువుకొనినవాఁడు. అయినను, మద్యపానమును జేయువాఁడు ; ఈక్రొత్త పనియందు శ్రద్ధలేనివాఁడు.

ఎల్లప్పుడు, ఉల్లాసస్వభావము కలవాఁడుగాన, పనివాండ్ర తోఁ గలసి మెలసి బెంజమిను తిరుగుచుండెను. ఏదియో యొక క్రొత్తసంగతిని పనివాండ్రకు ప్రతిరోజున పనిలోఁ జూపించుట వలన, వారందఱితనిని గౌరవముగ జూచుచుండిరి. ఇతనిచే శిక్షింపఁబడి, వారు పనిలోఁ దేరి పారిరి. కీమరు వ్యాపారమును వారు బాగుగసాగించిరి.

---

## ఏడవ ప్రకరణము

### “ జంటో ” సమాజము.

ఈ కాలములోఁ దనతోఁ బనిచేయువాండ్రను, పట్టణములో నితరస్నేహితులను సమావేశముచేసి, ‘జంటో’ అను సమాజము నొకటి బెంజమిను స్థాపించెను. సం॥ 40-రములు వఱకు శ్రేయోదాయకముగ, సుఖావహముగ నీ సమాజము వర్ధిల్లుచుండెను. మనుజుల జ్ఞానము విజ్ఞానధర్మముల యభివృద్ధి కొఱకీ సమాజము స్థాపింపఁబడినది. ఎవఁడైన నీ సమాజములోఁ బ్రవేశింపవలెనవిన, నిలుచుండి తనగుండెమీఁద చేయివేసికొని, దిగువ వ్రాసిన సూత్రముల కొప్పుదలకావలెను. ఆ సూత్రములను పొందుపఱచుచున్నారము:—

(1) “సమాజములోనివారి నెవరిని నేను అమర్యాద చేయను.

(2) “ఏ మతస్థుఁడైనను ఏవృత్త్యనుచరణీయుఁడైనను ప్రతి మనుజుని ప్రేమించెదను.

(3) “పిచ్చియాలోచనలు కలవాఁడైనను తనకు దోఁచిన విధమున ప్రార్థన చేయువాఁడైనను సరి వాని దేహమునకుఁ, పేరునకు వస్తువులకెట్టివంటి నష్టమును గలుగఁజేయను.

(4) "సత్యమును సత్యమునకే ప్రేమించెదను. నిష్పక్షపాతముగ సత్యమును తెలిసికొని, దాని నితరులకు తెలియఁజేయుదును." ప్రతి శుక్రవారము సాయంత్రము సమాజము వారు సభ చేయుచుండిరి.

సమస్త శాస్త్రవిషయముల నీ సభలో వీరు తర్కించుచుండిరి. ఇందులో వాదముచేయుట కలదు.

"సత్యమును తెలియుటకు వివాద మాడవలయునుగాని, జగడ గొండితనము గూడదు" అని బెంజమిను వ్రాసెను. ఈ సమాజాభివృద్ధికొఱకు బెంజమిను కష్టపడుచుండెను. ఈ సమాజములో ముచ్చటించిన విషయముల నిందు పొందుపఱచుచున్నారము.

"స్వలాభమునకా, మనుజులు పనిచేయుచున్నారు?" "ఉద్దేశము మంచిది, చేసినపని చెడుపని; దురుద్దేశము, చేసిన పని మంచిది—వీనిలో నేది శ్రేష్ఠము?" "వేదాంతముయొక్క లక్ష్యము, కోరికలను ఖండించుటయా?" "సౌఖ్యమన నేమి?" "మనుజుఁడు జీవితకాలములోఁ బూర్ణత్వమునుబొందఁగలఁడా?" "బుద్ధి, మంచినడవడియుంగల బీదవాఁడు; బుద్ధి మంచినడవడియు లేని భాగ్యవంతుఁడు—వీరిలో నెవరిస్నేహము మంచిది?" "వీరు మృత్యునొందిన, వీరిలో నెవరి మరణమువలన దేశము నష్టమును బొందును?" "వీరిలో నెవరు సుఖజీవులు?" వీనిని సమాజములోఁ బూర్వోత్తరముగ సమన్వయించుచుండిరి.



దీనిని స్థాపించిన కొన్నిరోజులకు, బెంజమిను దీనిని విడిచి వేయవలసి వచ్చుననుభయము కలిగెను. కీమరు ముద్రాక్షరశాలలో బనిచేయుచు, 6 మాసములు సుఖముగ బెంజమిను గడిపెను. పూర్వమువలె, బెంజమిను దగ్గరకు జేరనీయక, కీమరు వానిని దూరముగనుంచుచు వచ్చెను. ఇంతలో కీమరుయొక్క వ్యవహారము తగ్గినది. అతని ఋణములు లావయ్యెను. అయినను, నతని పనివాండ్రందఱు, బెంజమినుచే శిక్షింపఁబడి, పనిలోఁదేరిపోయిరి. అందుచే, హెచ్చు వేతనమిచ్చి బెంజమినును పనిలోనుంచుటకు కీమరుకిష్టములేకపోయెను. ఏదో చిన్నజగడము తెచ్చి, కీమరతనిని కోపగించెను. అందుకు రోషముకలిగి, బెంజమినుపనిమాని లేచిపోయెను.

గృహమునకుఁబోయి, శాంతుఁడై తానుచేసిన పనిని బెంజమిను వితర్కించెను. బోస్టనుపట్టణమునకుఁ బోవలెనని యతఁడాలోచించెను. నాలుగు సంవత్సరములనుండి స్వగృహమునకు వెళ్లలేదు. ఈ లోపున తానుచేసిన పనులేమియు మెచ్చి కావని బెంజమిను అనుకొనెను. ధనమైనను కూడఁబెట్టలేదు. వెళ్ళనుకియ్యవలసిన సొమ్ము నియ్యలేదు.

శాస్త్రవేత్తయైన 'ఎమర్సను' చెప్పిన విధమున, బెంజమినును బోలినవారిని రాతిమీఁదనుంచినను వారు వేఱుదన్నెదరు. ఒకనాఁటి సాయంకాలమున, హ్యూమెరిడిత్తు, అను వాఁడితని యొద్దకువచ్చి, ముచ్చటించుచు, కీమరు ఋణముల పాలయిన సంగతిని జెప్పెను. ఇంతకును, కీమరు పనినేర్పులేనివాఁడు. ఇంతలోనంతలోనో, వానిపని ముగియుననియు, వారు స్వంతముగ ముద్రాక్షరశాలను స్థాపించుట కవకాశ ముండు ననియు, వారు పలుకుకొనిరి. మెరిడిత్తు మదుపుపెట్టి, కావలయు సామానులను దెప్పించుటకు, నిరువురుకలిసి పనిచేసి, లాభములను సమముగ పుచ్చుకొనుటకు సమ్మతించిరి.

గవర్నమెంటు నోటుకాగితములను ముద్రించుటకు కీమరుని నియోగించిరి. వానిచేతిక్రిందివా రెవరీపనిని బాగుగఁజేయలేరు. అందుచే, బెంజమినును గోపముమాని పనిలోఁజేరమని వాఁడు వేఁడెను. బెంజమిను పనిలోఁదిరిగి ప్రవేశించెను. అందుచేత, రెండుమూఁడుసంవత్సరములవఱకు కీమరుయొక్క వ్యాపారము సాగెను. కావలసిన అచ్చులు సిద్ధముకాఁగానే, న్యాయశాస్త్రాధికారుల యెదుట ముద్రించుటకు, వీరిరువురు కలిసి 'బర్లింగుటను' పట్టణమునకుఁ బోయిరి. ఈ సమయముననే, వారిపరిచయము వీనికిఁ గలిగెను. "నామనస్సు పతనమువలన పరిపక్వమును బొందినందున, నాసంభాషణయును వారిచ్ఛకలిగి




యుండిరి. వారిగృహములకు నన్ను పిలుచుకొనివెళ్లి, వారి స్నేహితుల దర్శనము నాకుజేయించుచుండిరి. కీమరు నేను పొందిన మర్యాదను బొందలేదు. నిజముగ, కీమరు వెఱ్ఱిబాగులవాఁడు. ప్రపంచరీతిని దెలియనివాఁడు. జనసమ్మతాభిప్రాయములను కాదనువాఁడు. రోఁతను పుట్టించునంతవలక్షణముకలవాఁడను" అని గర్వముగ బెంజమిను వ్రాసెను.

ఇదివఱలో వ్రాసినప్రకార మింగ్లాండునుండి, సం॥ 1728-రము ప్రారంభమున, నచ్చుయంత్రము, కూర్పులు వచ్చినందున, కీమరుతో వ్యవహారమును చక్కఁజేసికొని, మెరిడిత్తు బెంజమినులు కలిసి, ముద్రాక్షరశాలను స్థాపించుటకు సమకట్టిరి.

ఈకాలములోనే బెంజమిను, తనగోరీమీఁద వ్రాయవలసినదిగా, నీ దిగువ చరణమును వ్రాసెను. "ముద్రకుఁడైన బెంజమినుయొక్క దేహము (అక్షరములు మాసిపోయి, ప్రాఁతగిలిన గ్రంథముయొక్క యట్టవలె), క్రిమికీటకముల కాహారమై, యిక్కడనున్నది. ఈ గ్రంథము నాశముపొందక, సృష్టికర్తచే దిద్దఁబడి సవరణచేయఁబడి, దీనికంటె రమ్యమైనకూర్పులో వేయఁబడి, తిరిగి ప్రచురింపఁబడు నని వాని నమ్మకము."

---

*

# ఎనిమిదవ ప్రకరణము.



## బెంజమిను - మెరిడిత్తు: - ముద్రకులు.

జాగరూకతతో వీరు పని నారంభించిరి. సంవత్సరమున కిరువదినాలుగుకాసు లద్దె కొప్పందముచేసికొని, బసను మాటలాడిరి. కొంతభాగమును తమ స్వంతమున కుంచుకొని, శేషించినదాని నితరుల కద్దెకిచ్చివేసిరి. అక్షరకూర్పులను విప్పి, యంత్రమును స్థాపించి, కావలసిన వస్తువులనుగొని, పనినారంభము చేయుసరికి, దగ్గిఱనున్న రొక్కము వ్యయమయి పోయినందున, చేతిలో నొక కాసు లేకయే, వీరు పనిని సాగించిరి.

దినచర్యకుఁ దగినసొమ్ము, వీరికీపనిలో వచ్చుటలేదు. అప్పుడప్పుడు 'జంటో' సమాజమువారును, వారు శిఫారసుచేయుటచే వచ్చినవారు మాత్రము వీరికిఁ బని నిచ్చుచుండిరి. ఇంత మాత్రమున, పని నడచునా! అయినను, సమాజమువారి ప్రాపకము కలదు. అందుచే, వారు దీనిని నిలఁబెట్టుటకు తగిన ప్రయత్నములు, వ్రాత, మాటల మూలమున జేయుచుండిరి. బెంజమినుయొక్క శ్రద్ధాభక్తులను, పనినేర్పును, బుద్ధికుశలతను, సవిస్తరముగ వీరు పొగడుచు వచ్చిరి. చేయవలసినపనిని జాగ



రూకతతో రాత్రింబగళ్లు కష్టపడి, పేరు నిలఁబెట్టుటకు బెంజమిను ప్రయత్నించుచుండెను.

ఇతను మొదటినుండి, వార్తాపత్రికను ముద్రించి ప్రచురము చేయవలె నని కోరుచుండెను. చేయఁబూనినపని నాచరణలోనికి తెచ్చువఱకు దానిని గోప్యముగ నుంచు స్వభావముకలవాఁడైనను, పొరబాటున నొకనితో నీ సంగతిని జెప్పినందున, నతఁడు దానిని కీమరు చెవినివేసెను. ఏపనియు లేనందున, నతఁడు వార్తాపత్రికను ముద్రించుటకు సన్నద్ధుఁడయ్యెను. 'సర్వశాస్త్ర - కార్యబోధిని' యనుపేరుతో నొక పత్రిక నతఁడు ప్రచురముచేసెను. దీని నందఱు శ్లాఘించిరి.

దీనినిచూచి రోషాయత్తచిత్తుఁడై, బెంజమిను వ్యాకులము పొందెను. ధైర్యము తెచ్చుకొని, జంటోసమాజము వారి సహాయమున, నితఁడొక పత్రికను ప్రచురించుట కారంభించెను. 'అధికప్రసంగి' యను పేరుతో నీపత్రిక వెడలెను. ఇది యన్నిటిని పరిహసించి, యెగతాళి చేయుచుండెను. "మేము సత్యమును చెప్పుటచే, మీకందఱికి కష్టముగ నుండును. మీ తప్పులను దెలిసికొనుటకు కదా, మీరు సంవత్సరమున కెనిమిది రూప్యములను మా కిచ్చుచున్నారు. అవును ఇప్పుడు మీతప్పులనుజూచి నవ్వువారి సమయముకూడ వచ్చునుగాన, మీరిప్పుడు వారినిజూచి నవ్వవచ్చును" అని 'అధికప్రసం

గిలో' వ్రాయఁబడెను. ఇందులో కీమరుని యెత్తిపొడిచి బెంజమిను వ్రాయుటయు— 'బోధిని' లో నితనిని యెత్తి పొడిచి కీమరు వ్రాయుటయు, జరిగెను.

ఋణగ్రస్తుఁడైనందున, కీమరు పత్రికను సాగించలేక పోయెను. తుదకు దానిని బెంజమిను కతఁడమ్మివేసెను. పూర్వపు పేరు తీసివేసి, 'పెన్సిలు వానియాగెజెటు' అను పేరుతో 'బోధిని' ని బెంజమిను ప్రచురించెను. ఇదివఱలోఁ దన చిన్నతనములో, దనయన్నగారికి 'కోరాంటు' పత్రికను ప్రచురించినందుకు జరిగిన పరాభవమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని, బెంజమిను నీ పత్రికను జాగరూకతతోను వివేకముతోను బ్రచురముజేసెను. సత్యమును రూఢిగ వ్రాయుచు, యప్రియమైన సత్యమును మృదువుగ జెప్పుచు, ఇతరుల మనస్సును నొప్పింపక, యందఱికి మేలుకలుగునట్లు, బెంజమిను నీ పత్రికను నడిపించుచుండెను.

ఇప్పటికిని, వీరి ముద్రకవ్యాపారము బహుళముగ నుండలేదు. వీరు బీదవారుగ నుండిరి. సహాయముచేయుట కొకఁడైనను లేఁడయ్యెను. ఇంచుమించుగ పనినంతయు బెంజమిను చేయుచుండెను. మెరిడిత్తు పని తెలియనివాఁడు, త్రాగుబోతు. ఎల్లప్పుడును వాఁడు మైమఱచియుండును.

ఋణమును చేయనేకూడదు. చేసినవెంటనే దానిని తీరుమానముచేయవలెను. లేనియెడల, నొకానొకప్పుడు, మన



కసాధ్యముగ నున్నకాలములో నది తీరుమానమునకు తటస్థమగును. అన్నివాయిద్యములు వాయించి, నాలుగువైపుల నుండి ధనమువచ్చునేమోయని చూచుచు, మునుఁగుచున్న వ్యాపారమును లేవనెత్తుటకు సమర్థుఁడుగనున్న బెంజమినుకు ఋణము సంగతిని జ్ఞాపకము తెచ్చుటకు, వెర్ను మృదువుగ నొక లేఖను వ్రాసిపంపెను. తన తప్పు నొప్పుకొని, కొంచెము కాలము గడువుచేయుమని బెంజమిను ప్రత్యుత్తరమతనికి వ్రాసెను. అటుల గడువుచూపినందున, నేఁడు సంవత్సరముల నుండి బాధించుచున్న ఋణము నసలువృద్ధులతోఁ దీర్చుటకు కొద్దికాలములో నితని కవకాశము జిక్కెను.

ఇదివఱకు, సర్కారునకు కావలసిన కాగితములను 'బ్రాడుపర్డు' ముద్రించుచుండెను. ఇతఁడు కొన్నిలోపములు చేసినందున, వీనిని మానిపించి, వానిపనిని బెంజమినును చూడమనిరి. ఇందుమూలమున, 'బెంజమిను మెరిడిత్తు' లకంతగ లాభము లేకపోయినను, కొంతవఱకు వీరికి పేరువచ్చి, వీరు నిలఁబడుట కవకాశమయ్యెను.

రెండు సంవత్సరములనుండి కష్టపడుచున్నను, జీవనాధారమస్థిరమై, బెంజమినుకు పని నిలకడతో నుండఁగల దనునమ్మకము లేకపోయెను. వెచ్చము పెట్టిన 200 కాసులలోను సగము సొమ్మును 'తండ్రి మెరిడిత్తు' జాగ్రత్తచేయకలిగెను

ఇంగ్లాండునుండి వస్తుసామగ్రి నంతయు పరపతికి తెచ్చినందున, పరపతినిచ్చినవాఁడు వీరుచేసిన విలంబమునకు భయపడి, న్యాయసభలో వీరి సామానులమీఁద తీరుమానమును బొందెను. జామీనుపైని వీరిరువురిని వదిలిరి. "ఇట్టి స్థితిలో, నాప్రియస్నేహితు లిరువురు వేర్వేరుగ నాయొద్దకువచ్చి, నేను కోరినసొమ్ము నిచ్చెదమని నాతోఁజెప్పిరి. మెరిడిత్తుతో వంతును బోఁగొట్టుకొని, స్వతంత్రముగ నన్నుండ మనిరి. వారుచేసిన మేలు నాకు మఱపునకు రాదు" అని కృతజ్ఞతాపూర్వకముగ బెంజమిను వ్రాసెను.

ఈ స్నేహితులు, "విల్లియంకోల్మాను, "రాబర్టుగ్రేసు" అనువారు. వీరు "జంటో" సమాజములోనివారు. జీవితకాలమంతయు వీరు బెంజమినుకాప్తులుగనుండిరి. తండ్రి, కుమార మెరిడిత్తులవలన మేలుపొందినందున, వారిని విడుచుటకు కష్టమనియు, పత్రముప్రకారము వారు నడుచుకొనిన పక్షమున, వంతువారితో వదులుకొనుటకు తన కిష్టములేదని స్నేహితులతో నితఁడు జెప్పెను. అంతలో, వంతుదారుఁడైన కుమారమెరిడిత్తును కలిసి, "నీవుచేసిన వ్యవహారము నీతండ్రి కిష్టములేనట్టు కనఁబడుచున్నది. ఇచ్చెద ననిన సొమ్ము నతఁడు నీకిచ్చునేమోగాని, మనకిచ్చునటుల నాకుఁ దోఁచదు. ఏమాటయు, నీవునాతో రూఢిగఁ జెప్పిన, సర్వము నీకువదిలి, నాపనిని జూచు



కొనెదను" అని బెంజమిను చెప్పెను. అప్పుడు, "నాతండ్రి మోసపోయెను. అతనియొద్ద సొమ్ములేదు. మరి నే నతనిని తొందరచేయలేను. ఈపని నాకు తగినదికాదు. నేను మొదట వ్యవసాయదారుఁడను. పట్టణమువచ్చి, ముప్పదియేండ్లు వచ్చినపైని, క్రొత్తవ్యాపారములో దిగుట నాబుద్ధి తక్కువ...... నేను తిరుగ దున్నుకొనుటకుఁ బోయెదను. నీ స్నేహితులు నీకు సహాయముచేసిన, వారిని జూచుకొనుము. మనము ముగినిచేసిన ఋణములను తీర్చుటకు శక్తి నీకున్నయెడల, నాతండ్రిమదుపు నిమిత్తమిచ్చిన నూరుకాసుల నిచ్చివేయుము; నేను స్వయముగ చేసిన ఋణములను తీర్చివేయుము; నాకు ముప్పదికాసుల నిచ్చిన, నావంతును నీకు విడిచిపెట్టుదును. నీవే సర్వస్వమును బొందవచ్చును" అని కుమార మెరిడిత్తు చెప్పెను.

వెంటనే, దీనికి బెంజమిను సమ్మతించి, నూరుకాసులు చొప్పున ప్రతిస్నేహితునియొద్ద బదులుచేసి, మెరిడిత్తుల కిచ్చివేసి, స్వంతముగ వ్యాపారమును బెట్టెను. నేఁడు మొదలు విశేషముగ నొడుదొడుకులులేక, స్థిరముగ నితని వ్యాపారము నడచుచుండెను. నానాఁటికి పరపతి కలిగెను. యుక్తాహారవిహారచేష్టావశిష్టుఁడై, బెంజమిను తన వ్యవహారములో మెలఁగుచుండెను.

---

## తొమ్మిదవ ప్రకరణము



### వివాహము.

వ్యవహారమును సాగించుటకు మార్గము తిన్నగనుండుట చేత, స్వస్థచిత్తుఁడై, బెంజమిను వివాహోన్ముఖుఁ డయ్యెను. "గృహిణిగాడ్ఫ్రి" యొద్ద నితఁడు బసచేయుచున్నందున, నామె, బంధుగులయొద్దనున్న "కన్యకగాడ్ఫ్రి" కితను తగిన వరుఁడని, యోచించెను.

"ఈమె మమ్ములను సమావేశముచేయుచుండెను. ఇంటి వారు నన్ను భోజనమునకు బిలుచుచుండిరి. భోజనానంతర మున, మేమిరువురము మాటలాడుట కవకాశ మిచ్చుటకు, వారు సన్నసన్నగ లేచిపోవుచువచ్చిరి. తుదకు, వారితో నా యుద్దేశమును జెప్పఁగోరి, గృహిణిగాడ్ఫ్రిద్వారా నామాటను బంపితిని. నా ముద్రాక్షరశాలకు నేను చేసిన ఋణములో, శేషించిన నూరుకాసులను వారిని తీర్చివేయుమని, వారికి మాటను బంపితిని. వారు సొమ్మునియ్యలేమని చెప్పినందున, వారి గృహమును, తాకట్టుపెట్టి సొమ్ము నియ్యవలసినదని నేనుగోరితిని. దీనికి వారు సమ్మతించలేదు. కొద్దిరోజులకు, ప్రాడుఫర్డు—కీమతులవలె, నేనుకూడ నచ్చుపనిలో దిగువాఁడుదునని



యెంచి, కన్యకగాడ్ఫ్రితో నన్ను మాటలాడనీయనందున, నామె నాకగుపడలేదు. నేనుగూడ వెళ్లుట మానివేసితిని. ఈ విధమున నాకామెయం దనురాగమున్నది లేనిది వారు తెలిసికొన గోరిరేమోగాని, నేనుమాత్రము కోపముచేత వెళ్లలేదు. అందుచేత, వారు కలవరపడి, రమ్మనుమని నాకు వర్తమానము బంపినను, నేను వెళ్లలేదు. ఇల్లంతయు నాకువదిలి, వారు లేచిపోయిరి. నేను మరియెవరిని బసలో దింపలే"దని బెంజమిను వ్రాసెను.

కన్యకరీడు, యీలోపున నొంటరిగనుండి కుందుచుండెను. వాస్తవముగ, కుమ్మరిరోజర్సు చనిపోయెను. అప్పుడప్పుడు, బెంజమిను గృహిణిరీడును జూచుటకు వెళ్లుచుండెను. ఆమెకు సలహా నిచ్చుటకలదు. కన్యకయొక్క దురవస్థకితఁడు వగచుచుండెను. అందుచేత, మనస్సును కుదురుచేసికొని, యే కష్టములు వచ్చినను భరించుటకు నిశ్చయించి, సం॥ 1730-రము సెప్టెంబరు నెలలో బెంజమిను కన్యకరీడును వివాహమాడెను.

గృహిణి బెంజమినన్ని విధముల ధర్మచారిణియైయుండెను. భర్తకు పనిపాటులలో సహకారిణియై, గృహకృత్యములను నేర్పుగ నిర్వర్తించుచు, నామె దయాపూర్ణురా లనిపించుకొనెను. "స్వయముగ కుట్టిన, లినెను, రోమపుదుస్తులను, నేను ధరించుట కామె యిచ్చెను. ఈ సంగతి జ్ఞాపకము వచ్చిన

పుడు, నామనస్సు కరఁగును. ఎల్లప్పుడామె సంతోషముగ నుండును. ఇతరుల లోపాలోపములను సవరణచేయు స్వభావము కలది. స్వల్పవిషయములనుకూడ పట్టుదలతోఁ జూచుచుండును. స్వల్పవిషయములలోనే మనుజులు సంతుష్టిచెందవలెను. 18-వ శతాబ్దమున జీవించుటచేత నామె చదువరి కాదు. ఉత్తరముల నామె తెలివితేటలతో వ్రాసినను, వాని వర్ణక్రమము సరియైనదికా''దని పరదేశములో నుండినపుడు బెంజమిను వ్రాసెను. ఆమె చక్కనిది; ఆమె ముఖారవిందము వికసించియుండును. ఆమె పిల్లలు, మనుమలు చక్కనివారని నూతనసీమలలోఁ బ్రసిద్ధికెక్కిరి.

అతఁడు స్త్రీలోలుఁడు కాకపోయినను, భార్యను మృదువుగను, దయతోను, యుక్తముగను జూచుచుండెను. ఇట్టి భర్తను బొందినందు కామె గర్వించెను. ఇరువు రన్యోన్యానురాగము కలవారలు. ''మే మొకరి నొకరు సంతోషింపఁజేయవలయునని కోరుచుంటిమి'' అని బెంజమిను వ్రాసెను. ''మాయొద్ద, పనికి మించిన సేవకులులేరు. మేము సంసారపక్షముగ నుంటిమి. లేనిపోని భేషజములు మాకు లేవు. సుమారు పదునెనిమిది రూప్యముల కొక వెండిగరిటెను నాభార్య నాకు తెలియకుండకొనెను. నేఁడు మొదలు వెండిసామాను, పింగాణివస్తువులు మాయింటిలోఁ గనఁబడుచుండెను. మేము ధనవంతులమైనకొలఁది, నీ



సామానులు హెచ్చుచుండె''నని కూడ బెంజమిను వ్రాసెను. వివాహమైన కొన్నిరోజుల కీ ముచ్చట జరిగెను. ఇతని వ్యవహారమైనను బాగుగాలేదు; నిండులేదు; వెల్తిలేదు. పనులన్నియు స్వయముగ నతనిచేత జేయఁబడుచుండెను. ఈ సమయములో, సర్వజనోపయోగ్యమైన పుస్తకభాండాగారమును స్థాపించుటకుఁ దగిన ప్రయత్నముల నితఁడు జేసెను.

''జంటో'' సమాజము స్థాపించినపుడు, స్వంతమందిర మేదియు దానికిలేదు. సమాజములోనివాఁడు 'రాబర్టుగ్రేసు' కరుణతో నొక గది నిచ్చినందున, దానిలో సమాజమువారు కూడుచుండిరి. వివాదాంశములను విశదీకరించుటకు సభ్యులు కొన్నిపుస్తకములను సభకు తీసికొనివచ్చి, పని ముగిసినపైని, వానిని తమ గృహములకుఁ దీసికొనిపోవుచుండిరి. మందిరములో నొక గదిలో ప్రతిసభ్యుఁడు తన పుస్తకములనుంచుటవలన, వానిని జదువుట కందఱికిని వీలగునని బెంజమిను ముచ్చటించెను. వల్లెయని యందఱంగీకరించిరి. మందిరములోఁ బుస్తకములుంచఁబడెను. వానిని వాడుకొను నేర్పు సమానముగ నందఱు కలవారుకారు గనుక, కొన్నిపుస్తకములు మాసిపోయినవి. అందుచేత, వీని యజమానులు విసిగికొని, తమపుస్తకములను స్వగృహములకుఁ దీసికొనిపోయిరి. అటులుండఁగను చేసిరి. పుస్తకములను గొనుటకు శక్తిలేని సంసారులిదివఱకు వీనిని చదువుట

వలన లాభమును బొందె, ప్రస్తుత మవి లేనందున నిందు వ్యసనమును బొందిరి.

చందాతీసి, పుస్తక భాండాగారము నొకటి లేవనెత్తవలెనని బెంజమిను యోచించెను. ప్రతిచందాదారుడు ప్రథమమున సంచికలను గొనుటకు రెండుకాసుల నిచ్చి, ప్రతిసంవత్సరము సుమారెనిమిది రూప్యముల నిచ్చుకొనవలసిన దని, బెంజమి నేర్పాటుచేసెను. అక్కడ ధనము నిచ్చువారు లేరు. చదువుకొనువారు లేరు. దానియందాసక్తియున్నవారు లేరు. అందుచేత, చందాతీయుట కష్టమయ్యెను. నలుగురినిచూచి, వారితో దాను స్వయముగ చెప్పి, వారిచేత నితరులకు చెప్పించి, యితడు కష్టపడెను. అనుకొనిన 5-నెలలకు, సం॥ 1731-నవంబరు వచ్చుసరికి, 50-చందాదారులు గూడిరి. సం॥ 1732-రము మార్చినెల వచ్చుసరికి, చందాసొమ్ము వసూలుకాబడెను. ఇంగ్లాండునుండి పుస్తకములను దెప్పించుట కతడు వ్రాసెను. 'కాలిన్సు' పుస్తక భాండాగారపు కార్యాధ్యక్షుడుగ, ముప్పదిసంవత్సరము లుండెను. స్నేహితులు కృపతో గొన్నిపుస్తకములను బహుమతి చేసిరి. అవి వచ్చినతరువాత, ప్రతిదానిని ప్రతిచందాదారుడు చదివి ముఖ్యాంశముల నెత్తి, వ్రాయవలసిన దని యొక పద్ధతి నతడతిసమ్మతముపైని బెంజమిను వ్రాసెను.



అక్టోబరునెలలో బుస్తకములు వచ్చెను. సమాజము వారొకనిని భాండాగారపు కార్యదర్శిగ నియమించిరి. వారములో నొకరోజున ప్రతివాడు పుస్తకములను తెచ్చుకొనుచుండెను. రెండవసంవత్సరములో బెంజమిను కార్యదర్శిగ నుండెను. దీని ననుసరించి దేశమందంతటను మఱికొన్ని భాండాగారములు లేచెను. సం॥ 1785-రములో 5487; సం॥ 1807-రములో 14,457; సం॥ 1861-రములో 70,000, పుస్తకము లుండెను. నూటపాతిక సంవత్సరములవఱ కవిచ్ఛిన్నముగ నిది శ్రేయస్సు నిచ్చుచుండెను. ఇది ముందుకూడ నిటులనే యుండునని తోచుచున్నది. మంచికట్టుదిట్టము లేర్పఱచి, వ్యవహారమును బాగుగ జరిపించి, బెంజమిను, వీని స్నేహితులు, దీనిని శ్రద్ధతో జూచి నందున, నింత యభివృద్ధిలోనికీ భాండాగారము వచ్చెను. "తామసుపెన్ను" అను నతడు ఫిలడల్ఫియాకు వచ్చినపుడు, వాని దర్శనమునకు వెళ్లి, కార్యవాహకు లొక విన్నపమును జదివిరి. అతడు సంతసించి, బహుమానముగ గొన్నిపుస్తకముల నిచ్చెను. "గ్రంథపఠన, నాగరీకమైనపని యని, యెన్నబడెను. పఠనమునుండి వీరిని విడదీయుటకు తగిన వినోదము లాకాలమున లేనందున, వీరు గ్రంథావలోకనము చేయుటకు కాలము వ్యయముచేసిరి. ఆకాలమందన్య దేశీయులకంటె, బాగుగ గ్రంథములను జదువువారు వీరె" యని బెంజమిను వ్రాసెను.

చదువరియై, కీర్తిప్రతిష్ఠలను బొందిన బెంజమిను, వ్యవహారస్థుఁడుగ నెటులవన్నెకెక్కెనో మనమిఁకను చూడవలయును. సం॥ 1728-రము మొదలు సం॥ 1748-రము వఱకు మంచి వ్యవహారస్థుఁడని బెంజమిను పేరొందెను. ముద్రకుఁడు, గ్రంథసవరణీకుఁడు, కూర్పువాఁడు, ప్రకటించువాఁడుగ, నితఁడుండెను. సిరా, చీటీగుడ్డలు, సబ్బు, బాతురెక్కలు, మొదలగువాని నితఁడమ్ముచుండెను. దేశసమాచారములను దెలిసికొనుట కితని దుకాణమున కందఱు వచ్చుచుందురు.

'పెన్సిల్వానియా గెజెటు' అను వార్తాపత్రిక మునుపటికంటె వెల్లడిగ వ్యాపించెను. ఇది నూతన సీమలలో వన్నెకెక్కెను. అక్కడివారికి సోదరభావమును బుట్టించెను; ప్రజల కుపకార బుద్ధిని బోధించెను. శాస్త్రోక్త ప్రకరణములు, వ్యాసములు, సమాచారములు, వర్తకవిశేషములును గలిగి, పీనిని ధారాళముగ వ్రాయుచు, మతభేదముల నిది బోఁగొట్టుచుండెను.

సం॥ 1732 రము డిశంబరులో, 'పూరురిచ్చర్డు' అను పేరు పెట్టి, యొక పంచాంగము నితఁడు ప్రకటించెను. ఇది నాలుగు వైపులను వ్యాపించినది. దీనిలో గంభీరమైన నీతివాక్యములు కలవు. ఇది హాస్యరసము ప్రధానముగ కలిగియుండెను. ఇది సరసమైన పంచాంగము. ఇందు ఉపోద్ఘాతములు, ప్రకటనలు ప్రకృతివిశేషములు, గ్రహణములు, వివరముగ వ్రాయఁబడు



చుండెను. సామితెలు, పద్యములు సరసమైనవి. సరసములేని నీరసము కాని విశేషములు లేవు.

"ఇందులోని సత్యమేమనన, నేను కటికదరిద్రుఁడను. నాభార్య మంచిది, గర్విష్ఠి. నారగుడ్డలు కట్టుకొని, రాట్నము నొద్దను గూర్చొనుట కామె యిష్టపడదు. పని లేక, నేను నక్షత్రములను జూచుచుందు నని నామీఁద నామెకు గోపము. నా పుస్తకములను తగులబెట్టుదునని, నన్ను భయపెట్టును. అందుచేత, నామె కోరినప్రకారము, లాభమగు పని నేదైన నేను చేయవలయును గదా! తదనుగుణముగ, నీపని నారంభించితిని" అని పూరురిచ్చర్డు పంచాంగములో లిఖింపఁబడెను. మఱియొక పర్యాయము, "ఒక జత చెప్పులు, రెండు నారపంచలామెకు, నాకొక కోటును కొనినాను. ఇదివఱకు కోటు లేనందున, బయటకు పోవుటకు సిగ్గుపడితిని. ఆమె కోపము కొంచెము తగ్గినది. అందుచేత, మునుపటికంటె, నిప్పుడు రాత్రివేళల స్వస్థగ నిద్రించుచుంటిని" అని 'పూరురిచ్చర్డు'లో వ్రాయఁబడెను. ఇందులో కొన్ని సరసముగ వ్రాయఁబడిన సంగతుల నిందు పొందుపఱుచుచున్నారము:— "కొట్టవలెను, ప్రేమించవలెను." "బంగారమును పరీక్షించునది నిప్పు; స్త్రీని, బంగారము; పురుషుని, స్త్రీ." "నూతనమైన సత్యము, సత్యమే; పురాతనమైన తప్పు, తప్పే." "ఇదువురు చనిపోయిన, మువ్వురు రహస్యము నుంచ

గలరు." "నీవు దుకాణమునుంచుము—దుకాణము నిన్నుం చును." "వక్తయొక్క మాటలు పూర్ణస్థానము; తెలివి పూర్ణానుస్వారము." "నీవు చెప్పిన సంగతులను విని, యామె నవ్వుచున్నది. ఎందుచేతను? ఆమెకు మంచిదంతములుకలవు." "చుట్టము, చూపులకు వచ్చినవారు, చేపలు మూడురోజులలో కంపుకొట్టును." "రోగము కుదుర్చువాడు దైవము, కట్నము పుచ్చుకొనువాడు వైద్యుడు." "నమ్మకమైన స్నేహితులు ముగ్గురు:—ముసలిభార్య, ముసలికుక్క, రొక్కము ధనము." "వివాహమునకు ముందు కండ్లు తెఱచియుండుము; తరువాత, సగము వానిని మూయుము."

పదిసంవత్సరములకు, స్వగ్రామమునకు బెంజమిను వెళ్లెను. జీవితకాలములో ప్రతి పదిసంవత్సరముల కొకపర్యాయము అతడు స్వగ్రామమునకు వెళ్లుచుండెను. తిరుగుదలలో న్యూపోర్టుకు వచ్చి, తన్నయన్న నితడు చూచెను. పూర్వపుమన స్పర్థలు మఱచి, కొంతకాల మన్నదమ్ములు కలసి మెలసి యుండిరి. జేమ్సు ఫ్రాంక్లిను జబ్బుగనున్నందున, నతడు తన కుమారుని తమ్మునికప్పగించెను. ఆ ప్రకారమే, వానికి చదువు చెప్పించి, ముద్రకుని వ్యాపారమును బెంజమిను నేర్పెను. ఇంతలో జేమ్సు కాలధర్మము నొందినందున, నతని భార్య



'న్యూపోర్టు'లోనే వ్యాపారముచేయుచుండెను. చదువు ముగిసినపైని, కుమారుడు తల్లియొద్దకు వెళ్లెను.

బెంజమిను ఫిలడల్ఫియాలో స్వంతపనులను జూచుకొనుచు, స్వగ్రామస్థులచే మన్ననలను బొందెను. సం॥ 1736-రములో "సామాన్యప్రజాసభ"కు లేఖకునిగ, బెంజమినును నియోగించిరి. పెన్సిలువానియాలో నితడే మతిమంతుడు. ఈ యుద్యోగమువలన ధనము దొరకకపోయినను రాష్ట్రీము వారి ముద్రకపనులను జూచుటచేత, నితనికి లాభము గలిగెను. ఈ పనిలో బదునాలుగు సంవత్సరము లతడుండెను. ఫిలడల్ఫియాలో 'పోస్టుమాస్టరు'గ నియోగింపబడినందున, దేశములోని సమాచారములను తెలిసికొనుట కితనికి వీలుపడి, తనవార్తాపత్రికను విశేషముగ విస్తరింపజేసెను. నేడు మొదలవిచ్ఛిన్నముగ నితడు శరీరయాత్రను గడిపెను.

అతడంతరంగమున జరిపిన జీవితచరిత్ర మతియాహ్లాదకరముగ నుండును!

---

*

## పదియవ ప్రకరణము



### స్వయంకృషి.

పుస్తక భాండాగారములోని పుస్తకము లన్నియు బెంజమిను చదివెను. ఇతను మొదట దేశచరిత్రలను, మహాపురుషుల జీవన చరిత్రములను, జదివినటులఁ గనబడుచున్నది. "చరిత్రపఠనోద్భాసితాభిప్రాయము" లను నొక వ్యాసము నితఁడు వ్రాసెను. ఏబది సంవత్సరము లైరోపాలోని రాజుల దివాణములలో కాలము గడిపి, శాస్త్రోక్తముగ నడచు తంత్రవాది వ్రాసిన విధమున నీ వ్యాసము వ్రాయఁబడినదిగాని, నూతన సీమలలో స్వానుభవము లేని పడుచువాఁడు వ్రాసినట్లు కనఁబడదు. ఈ వ్యాసము చాలకాలము ప్రచురము లేక పడియుండెను.

ధర్మాత్ముల నందఱిని సమాహారాయముచేసి, యొక సంఘమును స్థాపించవలెనని బెంజమిను యత్నించి, తన స్నేహితులతో నీ సంగతిని ముచ్చటించ, వారందు కంగీకరించిరి. "ముక్తులు - స్వాస్థ్యులు సంఘము" అని దీనికిఁ బేరుపెట్టుట కితను తలఁచెను. ముక్తులన, పాపము, ఋణములనుండి ముక్తిని పొందిన వారు. ఈ రెండు బాధలు లేనందున, స్వాస్థ్యులు మున్ముందుగ



ధర్మాచరణలో నితఁడు పూర్ణత్వమును బొందఁగోరెను. ఏకాలమందును తప్పుచేయక యుండవలెను. పొరపాటుచేతఁ జేయు స్నేహితుల ప్రోద్బలముచేతఁ జేయు, తప్పులను ముందుకుఁ జేయకుండుటకు నేను ప్రయత్నించితిని. 'ఇది తప్పు, అదియొప్పు' అని నాకు తెలియును. అట్టి స్థితిలో, తప్పునుమాని, యొప్పు నెందుకు నేను చేయరాదు ? ఇదియే కష్టమని తోఁచుచున్నది. ఒక తప్పును మానివేయుటకు ప్రయత్నించినందున, నకస్మాత్తుగ మఱియొకటి చేయనగుచున్నది. అజాగ్రత్తగ నుండుటవలన, నే నలవాటుచేత తప్పు మార్గములోనికి వచ్చుచుంటిని. బుద్ధి లేనందున, నామనస్సు విచ్చలవిడిగ వెళ్లుచున్నది." అని బెంజమిను వ్రాసెను.

అతఁ డాచరణలోనికిఁ దెచ్చిన ధర్మము లివి:—యుక్తాహారము, మౌనము, క్రమము, శాంతము, దాంతము, నిర్మలము, శుచిత్వము, పత్నీవ్రతము, అణఁకువ, శ్రద్ధ, భక్తి, న్యాయ్యము, క్లుప్తత ఈ పదమూఁడు ధర్మములను వారమున కొక్కొక్కటి చొప్పున యాచరణఁ జేయుచుఁ బ్రతిధర్మమునకు సంవత్సరమునకు నాలు గావృత్తుల నితఁ డిచ్చుచుండెను. ఇది సానుకూలముగ తుదముట్టుట కష్టమని తోఁచెనుగాని, కొన్ని రోజులకు వీనిలాభము స్పష్టముగ నతనికిఁ గనఁబడెను.

అన్ని ధర్మములలోను, రెండు మాత్ర మితఁడు ప్రవృత్తి లోనికిఁ దెచ్చుటకు వీలులేకపోయెను. అవి, "క్రమము, అణఁకువ." పేరుకు మాత్రముగాని, నిజమైనయణఁకువ తనకు లేదని యతఁడు వ్రాసెను. గర్వము పాపిష్టిది. దానికి బదులు, యణఁకువయుండి, మనుజుఁ డందుకు గర్వించిన బాగుగనుండును. క్రమముగఁ బనిచేయుట కొంచె మితనికిఁ దెలియును. అయిన, నేపని నెప్పుడు చేయవలయునో, యేయేవస్తువు నెక్కడ నుంచవలయునో, బెంజమినుకు బాగుగఁ దెలియదు.

అన్నిధర్మములను సానుకూలముగ నాచరణలోనుంచి, మనుజు లెంతో శ్రమపడిన పక్షమున, నొక ధర్మమునందు వారికి స్థిరబుద్ధి కలుగును? ఒక సమయమున మన కొక ధర్మమునందు బుద్ధికలిగినను, మనమాత్మ నిగ్రహము మాత్రముచేయలేము. అభ్యాసమువలన నిది పొందవలసినదియేకాని, మఱియొకటి కాదు. బెంజమి నాచరణచేసిన విధ మతని దేశ కాలావస్థల కనుగుణ్యముగ నున్నది. అంతకు మించినది మంచిది నీకు తెలిసిన, నీవు దాని ననుష్ఠించుము. "ముందురాఁబోవువారి కీ సంగతిని తెలియఁజేయుట మంచిది. ఈ ప్రకారము నడచుటచేత, దైవానుగ్రహమువలన, నేను వృద్ధాప్యములో సుఖజీవనమును బొందితిని. రాఁబోవు కష్టసుఖములు దైవాధీనములు. ఒకవేళ నవి వచ్చినను, గతములో ననుభవించిన వానిని జ్ఞప్తికిఁ దెచ్చు



కొని విరాగముతో వీనిని భరింతును. యుక్తాహారము పుచ్చుకొనుటచేత, నిరోగిగ నుంటిని" అని, సం॥ 79-రములు వయస్సున బెంజమిను వ్రాసెను.

ధర్మాచరణ కష్టసాధ్యమైన పనియని తెలిసి, "ముక్తులయు స్వాస్థ్యులయు సంఘము"లోఁ బ్రవేశించుటకుముందు, ప్రతివాఁడును, పదమూఁడు వారములలో కనీస మొకవారమైన నాత్మ పరిశోధన జేసినగాని యర్హత కలుగ దని బెంజమిను నిబంధన చేసెను. సంఘము మాత్రము సమకూడలేదు. వ్యవహారము దట్టమయినందున, దీని విషయమై శ్రద్ధవహించుట కతనికి వీలులేకపోయెను.

సం॥ 1733-రములో భాషలను చదువుట కితఁ డారంభించి, కొద్దికాలములో, "ఫ్రెంచి, ఇటాలియా, స్పానిషు" భాషలను వ్రాయను చదువను నేర్చెను. ఇతనికి చతురంగము నాడుటయందతిప్రేమ గనుక, కొంతవఱ కితఁడు 'ఇటాలియా' భాషను వేగముగ నేర్చుకొనుటకు వీలుకలిగెను. ఇతనివలె నిటాలియా భాషను నేర్చుకొనుచున్న స్నేహితుఁ డొకఁడు, బెంజమినును చదువును మాని యాటకు వచ్చునటులఁ జేయుచుండెను. ఓడిన వాఁడు మరల యాటకు వచ్చులోపు క్రియాపదములను వల్లించుటయో లేదా భాషాంతరీకరణము చేయుటయో యీ రెండు

పనులలో నేదియైన చేయవలయు నని నిర్ణయించుకొని, వారు సరిసమముగ నాడుచు వచ్చిరి. ఈ విధమున, నిటాలియా భాషను వీరు సొంతముగ నేర్చిరి. ఈ భాషలను బూర్ణముగఁ జదివి, 'లాటిను' భాషను జదువనేర్చి, దాని నితఁడు తుద ముట్టనభ్యసించెను.

సంగీతమును విలాసార్థముగ నితఁ డారంభించి, యెక్కు డుత్సాహముతో దానిని నేర్చుకొనెను. ఇతఁ డన్ని వాయిద్యములు వాయించుట యెఱిఁగి, స్వరజ్ఞానమును బొందెను. ఇతఁడు ప్రకృతిని కన్నులు విప్పి పరీక్షించుచుండెను; దాని సంపద్వైభవములకు సంతసించుచుండెను. ఇతఁడు ప్రకృతిలో మునిఁగి యుండెను.

'స్వీడను' దేశపు సర్కారుచే పంపఁబడిన, వృక్షశాస్త్రజ్ఞుఁడు 'కాము' అను నతఁడు, సం॥ 1748-రములో బెంజమినును జూచెను. వీరిరువురికి స్నేహము కలిగెను. "తమలోఁ దాము మాటలాడుకొను శక్తి చీమలకు కల దనుటకు నిదర్శనముగ, నొక స్వానుభవ విషయమును బెంజమిను నాతోఁ జెప్పెను. పంచదారను చీమచూచి, తనకన్నములోనికి పోవును. కొంతసేపటికి, వందలు వేలు చీమలు వచ్చి, పంచదారను తీసికొనిపోవును. అటులనే, చచ్చిన యీఁగను జూచి,



తానొక్కటి దానిని మోసికొని పోలేక పోయిన పక్షమున, వెంటనే చీమ కన్నములోనికిఁ బోవును. క్రమక్రమముగ, చీమలు ప్రాకుచువచ్చి, దానిని తీసికొనిపోవును. ఒక సమయమున చిన్నకుండలో తేనెవేసి, దానిని పదిలముగ బెంజమిను దాఁచెను. దానిలో మెల్లఁగ ప్రవేశించి, కొంత తేనెను చీమలు తినివేసెను. వానిని జూచి దులిపివేసి, యాకుండ నింటి వెన్నుకు త్రాటితో నతఁడు వ్రేలగట్టెను. పొరబాటున నొక చీమ దానిలోనుండి పోయెను. పైకి ప్రాకిపోవుటకు వీలులేక, నటునిటు తిరిగి, త్రాడుమీఁదుగ వెన్నుకుపోయి, తప్పించుకొని క్రిందికి దిగెను. ఇది దిగిన మఱియొక యరగంటకు వందచీమలు గోడమీఁద ప్రాకుచు వెన్నెక్కి, త్రాడుమీఁదుగ కుండలోనికి దిగిపోయి, తేనెను తినుటకారంభించెను. తుదకా తేనె నంతయు నవి తినివేసెను." అని, తనతో బెంజమిను చెప్పినట్లు, స్వీడనుదేశపు పండితుఁడు వ్రాసెను.

బుద్ధిమంతు లేసంగతిని జూచినను లెస్సగ విచారించుదురు. తుపానుల మార్గమును కనిపెట్టి చెప్పుటకు బెంజమినుకవకాశమయ్యెను. "పూరురిచ్ఛర్డు" పత్రికలో, నొక నాఁటి రాత్రి 9-గంటలకు చంద్రగ్రహణము పట్టునని, వ్రాయఁబడి యుండెను. దానినిఁ జూచుటకు బెంజమిను సమకట్టెను. గ్రహణము పట్టుటకు పూర్వమొకగంట కీశాన్యమూలనుండి, గాలి

వాన ప్రళయముగ లేచి, యా రాత్రియు మరుచటి దినమంతయు గొట్టుచుండెను. సముద్రముమీఁద, దేశమందంతట నది వ్యాపించి, చాలనాశముఁ జేసెను. ఈ సంగతిని నూతన సీమలలోని వార్తాపత్రికలు ముచ్చటించెను. బోస్టను పట్టణములోని వార్తాపత్రికలలో తుపాను సంగతియేకాక, గ్రహణము సంగతి కూడ వ్రాయఁబడియున్నందుకు, బెంజమి నాశ్చర్యపడెను. బోస్టనులో నితనియన్నగారికి లేఖనువ్రాయ, గ్రహణము పట్టువదలిన గంటకు తుపా నారంభమయిన దని వానివలన విని బెంజమి నాశ్చర్యపడెను. సకృచ్ఛముగ వీని సంగతినిఁ దెలిసికొని, యీశాన్యమూలనుండి వచ్చి యట్లాంటికు తీరమందు వీచు తుపానులు వెనుకకు నడచును—అనఁగా, నైఋతిమూలనుండి ఈశాన్యములకుఁబోవుచుఁ గ్రమముగ వీనికి బలము తగ్గును—అను సంగతిని బెంజమిను గనిపెట్టెను. ఈ కాలములో, నితనిచే "ఫ్రాంక్లినుస్టవు" చేయఁబడెను. రెండుపురుషాంతరములవారు దీనిని వాడుకొనిరి. అటుపైని దీనిని పరులు వృద్ధి చేసిరి. కఱ్ఱలు లేకపోవుటవలన, పొగబాధచేతను, దీని నితఁడు కనిపెట్టుట కుద్యుక్తుఁ డయ్యెను. దీనివలన నతఁడు లాభము పొందవలెనని కోరలేదు. లాభమును బొందలేదు. "పెన్సిలువానియా గవర్నరు దీనినిజూచి, సంతోషించి, దీనిమాదిరిని మఱికొన్ని తయారుచేయుటకు హక్కు నాకే యుండునటుల



చేయుదు నని నాతోఁ జెప్పెనుగాని, నేను దానికి సమ్మతించలేదు. ఇతరులు కనిపెట్టిన క్రొత్తసంగతులవలన మనమెటుల లాభమును బొందుచుంటిమో, యటులనే మనము కనిపెట్టిన వానివలన నితరులుకూడ సంతసించవలెను. పరోపకారమునకు కదా, మనము కష్టపడుచుంటిమి" అని బెంజమిను వ్రాసెను.

సభవారు వాదముచేయుచున్న కాలమున, నితఁడు లేకరి గనుక, వారివాదములయం దిష్టములేనందున, గోళ్లు మీటుచు కాలయాపనముచేయుట కితనికి కష్టముగ నుండెను. అందుచేత నితని స్నేహితుఁడు 'లోగను' అనువాఁడు ఫ్రెంచిభాషలో వ్రాఁయబడిన "చమత్కారచతుష్కోణము" అను నాటను నేర్పుపుస్తకము నితనిచేతిలోఁ బెట్టెను. ఈ ప్రక్కపుటలో వ్రాసినదే అట్టి "చమత్కార చతుష్కోణము".

ఈ చౌకములో నిలువుగనున్న యంకెలను కలిపిన, 260 మొత్తము వచ్చును. సగము వరుసకలిపిన, దానిలో సగము మొత్తము వచ్చును. ఆరోహణ, అవరోహణగ, ఐమూలలంకెలను కలిపిన, 260 మొత్తము వచ్చును. అతఁడీ చౌకమును చతురముతో గలుపుచు కాలము పుచ్చుచుండెను.

---

*

| 52 | 61 | 4 | 13 | 20 | 29 | 36 | 45 |
|---|---|---|---|---|---|---|---|
| 14 | 3 | 62 | 51 | 46 | 35 | 30 | 19 |
| 53 | 60 | 5 | 12 | 21 | 28 | 37 | 44 |
| 11 | 6 | 59 | 54 | 43 | 38 | 27 | 22 |
| 55 | 58 | 7 | 10 | 23 | 26 | 39 | 42 |
| 9 | 8 | 57 | 56 | 41 | 40 | 25 | 24 |
| 50 | 63 | 2 | 15 | 18 | 31 | 34 | 47 |
| 16 | 1 | 64 | 49 | 48 | 33 | 32 | 17 |

చమత్కార చతుష్కోణము.

## పదునొకండవ ప్రకరణము



### దేశోపకారి

సుశీలుని వ్యాపారము సాగిన, నతని సుశీలము వన్నె కెక్కును. అట్లు సాగుటవలన నతనిమనస్సు కరఁగును; నమ్రత వహించు. సంతోషముగనుండును. కర్తృత్వమువలన వచ్చిన సామ్ము కర్తకు మేలుచేయుననుట సందేహము. అసాధారణమైన ధర్మబుద్ధి, వివేకము కలిగియుండినగాని, కర్త శ్రేయస్సును పొందుట కష్టము. మానవశరీరము కనుక ధనము దీనికి మాంద్యము కలిగించును. అందుచేత ప్రజలకు వీఁడుపకారియగుటకు వీలులేదు. ముందు వెనుక లాలోచించి, క్రమముగ వ్యాపారము సాగుటవలన లాభమును బొందువాఁడు, చాలకాల మనుభవించి, తుదకు స్వార్జితమును సద్వినియోగముచేయును.

బెంజమిను దినదిన ప్రవర్ధమానముగ వృద్ధిపొందుచు వచ్చెను. పరగణాలో నితని 'గజెటు' వార్తాపత్రిక పేరు కెక్కి, ముఖ్య పత్రిక యయ్యెను. 'పూరురిచ్చర్డు' పత్రిక ప్రచురింపఁబడి, జనులకు సంతోషము కలుగఁజేయు చుండెను. వీనివలన బెంజమినుకు లాభము వచ్చుచుండెను.

వ్యాపారము సాగినకొలఁది స్వగ్రామస్థులమన్ననల నతఁడు బొందుచు వచ్చెను. పురాతనపద్ధతి నవలంబించి పట్టణమును రాత్రివేళల కాపాడువారి సంఘమును సంస్కరించుట కితఁడు మొదట నమకట్టెను. "ఏపేట తలారులాపేటను రాత్రివేళ గాపాడుచుండిరి. రాత్రిసంచారములోఁ దనకుఁ దోడుగ నుండుట కింటి యజమానుల కొందఱిని తలారి పిలుచుచుండెను. అటుల తోడుగఁ బోవుట కిష్టములేనివారు, తలారికి సంవత్సరమునకు సుమారయిదు రూప్యము లిచ్చుచుండిరి. ఈ ధనమును వేతనముగ నిచ్చి, వీఁడితరులను దనకు సహాయముగ రాత్రివేళల దీసికొని బోవుటమాని, యాధనమును తానే వాడుకొనుచుండెను. ఇందుచేత వానిపని బాగుగనుండెను. ఒకదరాము సారాయిని తలారివలనఁ బుచ్చుకొని, యతని వెంట ననేకదుండగీండ్రు పోవుచున్నందున, వారితోఁ గలిసి తలారితోఁ బోవుటకుఁ గొందఱు గృహస్థు లిష్టపడలేదు. వీరు గస్తీతిరుగుట మానివేసిరి. చాల రాత్రులు వీరు త్రాగి మైమఱచియుండుట కల"దని బెంజమిను వ్రాసెను.

'అగ్ని నివారణసైన్యము' నొకటితఁడుస్థాపించెను. ఈ దండులోఁ జేరిన ప్రతివాఁడు తోలుసంచులు, బుట్టలు మొదలగువానిని సిద్ధముగ నుంచుకొనవలెను. ఎక్కడనైన, నిప్పు తగులుకొనిన, నాస్థలమునకు వీరంతఱు తమవస్తువులతోఁ బోయి, నిప్పునార్పుచుండిరి. నెలకొక పర్యాయము వీరు కలిసికొనుట కలదు. అప్పుడు, కాలానుగుణముగ, దండు యొక్క పద్ధతులను మార్చుటయో, లేక నూతనపద్ధతులను జేయుటయో జరుగుచుండెను.



సం॥ 1743-రము మేయినెలలో, "అమెరికా శాస్త్రపరిశోధన సంఘము"ను స్థాపించుట కితఁడు ప్రయత్నముచేసెను. ఈ సంఘముయొక్క ముఖ్యోద్దేశములను వ్రాసి, యతఁడు స్నేహితులకుఁ బంపెను. మొక్కలు, దుంపలు, వేళ్లు, వీని గుణములు, నుపయోగములు, వీనిని నలుగురికి తెలియజేయు విధము ; ఖనులు, లోహములు ; వర్తకవిశేషములు ; నదులు, వీనియుపనదుల సంగమము, సరస్సులు, పర్వతములు; ఉపయోగమైన జంతువులను వృద్ధిజేయుట ; తమదేశములో లేని జంతువులను బరదేశములనుండి తెప్పించి, వానిని బెంచువిధము; మొక్కలు నాటుట ; తోఁటలు వేయువిధము ; ఈ మొదలగు విశేషాంశములను జర్చించుటకు నీ సంఘమును సమకూర్పవలెనని బెంజమిను కోరెను. "తనకంటె గొప్పవాఁడు సమకూడువఱకు, యోచనాంశములనువ్రాసి పంపినటువంటి బెంజమిను, సంఘమునకు కార్యదర్శిగ నుండుటకు సమ్మతించెను" అని బెంజమిను వ్రాసెను. సంఘము రూపముబొంది కొన్నిసంవత్సరములవఱకు వర్ధిల్లెను. అయినను, దీనివలనఁ గలిగినమేలు

శాశ్వతమైనదిగాని, యెన్నిక పొందినదిగాని కాలేదు. ఎందుచేతనన, దీనినివృద్ధిచేయుటకుఁ దగినపండితు లాకాలమున విశేషముగ లేరు.

సం॥ 1740-రము మొదలు సం॥ 1748-రము వఱకు, 'ఐరోపా' ఖండము సమరకల్లోలావృతమై యుండెను. 'న్యూ ఇంగ్లాండు' సంస్థానములలోని ప్రజలు తమ తీరములకు సమర భయము కలుగునని యెంచి, రక్షణ దుర్గములుగట్టి, సైన్యము జతపఱచి, యుద్ధనావలను సన్నద్ధముచేసి, సంరక్షణకు యుక్తమైన నితరసన్నాహములను జేసిరి. సం॥ 1744-రము వఱకు, వీరు భయపడుటకు గారణము కనపడలేదు. కాని, నాఁడుమొదలు సం॥ 1748-రములో జరిగిన "ఐక్సులాచపల్" సంధివఱకు నూతన సీమలవారు సమరభయ కంపితగాత్రులైనను, "ఆత్మసంయమ శత్రుచ్ఛేదము"లకు తగిన సన్నాహమును వీరు చేయలేదు. బెంజమినుయొక్క ప్రేరణచే, గ్రామస్థులు స్వగ్రామమును రక్షించుటకుఁ బూనుకొనిరి.

సమరాద్యంత సంప్రాప్తదుఃఖములను బెంజమిను వివరణతో వ్రాసెను. "రణభేరీనాదము వినినతోడనే, నందఱు భీతమానసు లగుదురు. ఒకని కొకఁడు సహాయముచేయు ననునమ్మకము లేదుగాన, ప్రతిమనుజుఁడు పరారియగును. తమయొద్దనున్న దానికంటె హెచ్చుధనముఁ నిమ్మని శత్రువులు పీడించుదురను



భయముచేత, భాగ్యవంతులు ముందుగ పరారు లగుదురు. పెండ్లాము, బిడ్డలు కలవాఁడు, వారిరోదనముఁజూచి వారిని దోడ్కొనిపోవును. ఎక్కడజూచినను రోదనమే......కొందఱు వెచ్చగనూర్చుచు, మరికొందఱు ముఖమున దప్పిదేర, పరుగిడుచుందురు. భయావహమాహవము." అని బెంజమిను వ్రాసెను. "ఐక్సులాచపల్" సంధివలన వీరు నిర్భయు లయిరి.

బెంజమిను తలిదండ్రులు నేటివఱకు సజీవులయి యుండిరి. వయోవృద్ధులు గనుక, వృద్ధాప్యముచేత వారు బాధపడుచుండిరి. వారు శ్రమపడుటకు విచారించి, బెంజమిను వారికి నుత్తరములను వ్రాయుచుండెను. సం॥ 8)-రములు జీవించి, సం॥ 1744-రమున నితనితండ్రి, జోషయా ఫ్రాంక్లినుఁ స్వర్గస్థుఁడయ్యెను.

అనేక సంవత్సరములు విద్యుచ్ఛక్తి విషయమై బెంజమిను పాటుపడెను. పదార్థ విజ్ఞానశాస్త్రజ్ఞుఁడని పేరొందెను. విద్యుత్సంబంధప్రయోగముల నితఁడు జేయుచుండెను. ఇటులాఱుసంవత్సరములు గడిచినవి. పిడుగులోని శక్తి విద్యుచ్ఛక్తి యని కనిపెట్టిన మహనీయుఁడితఁడే.

---

# పంద్రెండవప్రకరణము



## మహోపకారములు - ఇతరవ్యాపారములు.

జ్ఞానాభివృద్ధికిఁ బాటుపడిన విధమున, తత్ప్రచారమునకుఁ దగిన సదుపాయములను బెంజమిను చేసెను. న్యూయార్కు పట్టణములోగాని పెన్సిలువానియాపరగణాలోగాని, యీఁడువచ్చిన బాలురు చదువుకొనుటకుఁ దగిన పాఠశాలలేకపోవుటవలన, పదమూఁడుసంవత్సరములు ప్రాయముగల తన కుమారుని విద్యాభ్యాసము నిలిచిపోయెను. పాఠశాల లేమిని బోఁగొట్టుటకై, జంటోసమాజము వారితోఁగూడి, బెంజమిను శ్రమపడి, 5000, కాసులు చందాను ప్రోగుచేసెను. వెంటనే, పాఠశాలస్థాపింపఁబడెను. గుంపులు గుంపులుగ, బాలురు పాఠశాలకుఁ బోవుచుండిరి. ఇదియే, సం॥ 1779-రమున, "పెన్సిలువానియా సర్వకళాశాల" యయ్యెను. నేటివఱకీ కళాశాల వృద్ధిలోనున్నది.

"డాక్టరు థామసు బాండు" అను వాఁడూహించ, బెంజమినుసహాయమునచేత నొక వైద్యశాల పెట్టఁబడెను. "నీ సహాయములేనిది, యేపని జరుగదు. వైద్యశాలను స్థాపించుటకు



సొమ్ము నిమ్మని నే నెవరినడిగిన, వారు నీ సలహా నడిగితినో లేదోయని నన్నడుగుచుందురు. నేను నీ సలహా నడుగలేదని చెప్పిన, వారు వెనుకనుండి చందా నిచ్చెద మని చెప్పి వెళ్లుదురు" అని డాక్టరు బాండు బెంజమినుకు వ్రాసెను. క్రైస్తవదేశములలో బాగుగ జరపఁబడుచుండిన వైద్యశాలలలో నిది యొకటియై యున్నది.

బెంజమిను స్వదేశమునందలి ప్రజలకు విరోధియై, పరదేశమువారిచే మెప్పుఁబడసిన మనుజుఁడని చెప్పరాదు. అతనినిఁ దెలిసినవా రతనిని లెస్సగఁ బ్రేమించుచుండిరి. ప్రతికూల ప్రవర్తనకాగ్రహపడనివారిని మర్యాదచేసి, వారితో నితఁడు మర్యాదగ మాటలాడుచుండెను. తల్లి, సోదరులు, మిత్రులు, చెల్లెండ్రు—వీరి కితను వ్రాసిన యుత్తరములు చదువుట కింపుగ నుండును. అతని యుచ్ఛదశలో, నతని తల్లి, వృద్ధాప్యముచేత శస్త్రశస్త్రములణిగి, క్రమముగ జీర్ణించుచుండెను. సం॥ 84-రములు వయస్సు కలదైనను, తల్లి కుమారునికిఁ బ్రత్యుత్తర మిచ్చుచుండెను. సం॥ 1752-రము మెయినెలలో నామె స్వప్నములేని నిదురజెందెను.

తల్లి మరణానంతరమున, నితఁడు తన చెల్లెలు జేనుకు వ్రాసిన యుత్తరములు దయారసపూర్ణములయి యున్నవి. తన చెల్లెలికి కూఁతురు పుట్టినదని విని, "నా మేనకోడలిని ముద్దిడినాను అని

నోటిలోఁబెట్టుకొని కొఱుకుట కొక కాసు పంపితిని. దానిని బుచ్చుకొనుము. ముందుకు నీ కూఁతు రీకాసుతో బిళ్ళలను గొని కొఱుకుటకు వీలగు"నని చెల్లెలికి బెంజమిను వ్రాసెను. ఆమె పిల్ల చనిపోయినపుడు, "మనము బ్రతికిన కొలఁది, మనకిట్టి విపత్తులు సంప్రాప్తమగును. దైవానుగ్రహమువలన నిట్టివి సంప్రాప్త మగునని, దైవవిధికి మనము బద్ధులమని తెలిసినను, మనవలె నిదివఱ కెంద రిట్టి కష్టము ననుభవించిరో, ముందు నెందఱనుభవించెదరో అను జ్ఞానములేక, మనకష్టము భరించుటకు శక్యముకానిదని తలంచెదము. ఉపశమనపుమాటలెన్ని చెప్పినను కార్యములేదు. రక్తస్పర్శగనుక, దుఃఖము కొంతకాలమువఱకు వ్యాపించి, క్రమముగ జల్లారును. ఇది నా స్వానుభవమువలన జెప్పినమాట. కష్టములో నీవు దైవకటాక్షములను మఱచిపోనందుకు నే నెంతయు సంతసించుచున్నాను. దైవకృపచేత, నీకు మిగిలిన పిల్లలు సజీవులుగనుందురుగాక" అని బెంజమిను వ్రాసెను.

ఎన్నిపనులున్న నతఁడు శాస్త్రాభిలాషను బోఁగొట్టుకొనలేదు. ఏకముగ విద్యుచ్ఛక్తి విషయములోనే నీతఁడు పాటుపడుచుండలేదు. ఇతని ప్రోత్సాహమున, వాయవ్యమూలగ నాశియాఖండమునకుఁబోవు మార్గమును గనిపెట్టుటకు, ఫిలడల్ఫియాలో వర్తకులందఱు సమావేశమై, యుత్తరధ్రువమున



కొక యోడను బంపుటకు సన్నాహముఁ జేసిరి. ఇతఁ డాహ్వాయము చేసినందున, స్వీడను దేశపు వృక్షశాస్త్రజ్ఞుఁడు 'కాము' అనువాఁ డమెరికాకు వచ్చెను. బెంజమిను ఆలోచనలను మన్నించువారి నందఱిని, పండితుని దర్శనమున కతఁడు తీసికొని వెళ్ళెను. ఊపిరితిత్తులనుండి వెలువడు వాయు వపరిశుద్ధమైనదని కనిపెట్టినవాఁడు బెంజమిను; గృహములలో గాలివ్యాపకము బాగుగ నుండవలయు నని దృఢముగ సిద్ధాంతముఁ జేసినవాఁడితఁడే.

ఇతని మతవిషయాభిప్రాయములు మారలేదు. మనుజులకు మతము ముఖ్యమైనదను దృఢనమ్మక మితనికిఁ గలదు. పిచ్చిభ్రమలను ఖండించుటకు బదులు, సత్యమును బ్రకటనముఁ జేసి, వాని నంతరింపఁజేసిన, మతము పరిశుభ్రముగ నుండునని, ఇతని యభిప్రాయము. క్రీస్తుమతముయొక్క సత్యాధిక్యమును విశేషముగ గుర్తెఱిఁగినవా రితనికంటె మఱియెవరును లేరు. గృహములు, వృక్షములు, ప్రదేశములు మొదలయిన యచేతనములు పవిత్రము లయినవి యని, యే భయము కలదో, యది మాత్ర మితనికి లేదు. "ఇతరుల నిమిత్తము నేను పాటుపడినపుడు, వారిని నే ననుగ్రహించితి నని తలంపక, విధాయుక్తమైనపనిని జేసితి నని తలంచెదను. నా యాత్రలలోనేమి, నేను స్థిరముగ నుండినపుడేమి, జనులు నన్ను దయతో జూచుచుండిరి. తనను

ప్రత్యుపకారము వారికి నేనెన్నటికిని జేయలేను. స్వల్పకార్యములవలన దైవము సంతసించి, నా కనంతముగ కటాక్షములను జూపెను. పరమేశ్వరుని కటాక్షములను బొందినందుకు, నా కృతజ్ఞతను జూపుటకు, ఆయనకు పిల్లలు, నాకు సోదరు లగు వారి నిమిత్తము నేను పాటుపడుదును. వందనములును, మన్ననలును చేయుటచేత, మన కొండొరులకుగల బాధ్యతలు తగ్గవు; మనకు దైవమునకుం గలబాధ్యత లంతకన్న తగ్గవు. నేనూహించిన సత్కార్యములవలన, నాకును స్వర్గమునకు నెంతదూరమో మీారు చూడుడు! శాశ్వతమై, యనంతమైన సుఖస్థితియె స్వర్గము. అట్టిపదవిని బొందుటకు నే నసర్హుఁడను. ప్రపంచములో నామకార్థ మొకసత్కార్యమును జేసి, స్వర్గమును బొందవలయు నని కోరిన వానికన్న, దాహశాంతి కొకనికి నీరునిచ్చి, తోటల నియ్య మని దైవమును కోరినవాఁడు నయమని తోఁచును. పరమేశ్వరుని కృపచేత, మనమసంపూర్ణమైన మిశ్రమసుఖముల నీప్రపంచములో ననుభవించుదుముగాని, మన కర్హతకలిగి కాదు; దైవకృపవలన కలిగిన స్వర్గ సుఖమెట్టిదగ నుండును! దానిని బొందుట కర్హుఁడనని గర్వము, నిరీక్షించుటకు బుద్ధిహీనత, కోరుటకు కోరికయు నాకు లేదు. నన్ను పుట్టించి పరిపాలించు ప్రభువును నేను శరణుజొచ్చెదను. పుత్రవాత్సల్యముతోఁ గాపాడు ప్రభువు నన్ను దుఃఖమయసముద్రములో



ముంచఁడు. నే నొకొక్కప్పుడు పొందుకష్టములు నామేలునకతఁడు పంపును" అని మతమునుగుఱించి తన యభిప్రాయమును దెలిపియున్నాఁడు.

పుస్తకములను చదువుటకును, మననముచేయుటకును, స్నేహితులతో సంభాషించుటకును బెంజమినుకు కాలము దొరకలేదు. ఇతఁడు సర్కారుపనిలో ప్రవేశించినఁ జూడవలయు నని కోరినవారికోరిక నీడేర్చుటకుఁ దగిన కాలము సమకూరెను. పెన్సిలువానియా పరగణాను రక్షించుటకు చేసిన సన్నాహము వలన, ప్రజలు, స్వగ్రామస్థులు సంతోషించుటయేకాక, రాజ్యాంగముల వారు కూడ సంతసించిరి. "నేను రిత్తగనుంటి నని యెంచి, ప్రజలు తమపనులను నెరవేర్చుకొనుటకు నన్నుపట్టిరి; పట్టణపుపెద్దలు కూడ నన్ను బనిలోనికిలాగిరి" అని యితఁడు వ్రాసెను.

సం॥ 1753-రమున, "అమెరికా పోస్టుమేస్టరు జనరలు" మృతినొందినందున, బెంజమిను, విల్లియముహాంటరు, వీరిరువురి నాపనిలో సర్కారువారు నియోగించిరి. ఎన్నఁడు నమెరికాలోని తపాలాఫీసులవలన డబ్బువచ్చుట లేదు. వీరు వానిని సంస్కరించి, లాభము వచ్చునటులఁ జేసిన, వీరికి మూఁడుపందల కాసులు చొప్పున వేతన మిచ్చుటకు వారునిర్ణయించిరి. అందుచే కంటెను, దేశసమాచారములు తనకు బాగుగ దెలిసినందున

